దీపావళినాటికి వెలువడుతుంది

# స్వతంత్ర

ద్వితీయ వార్షిక సంచిక (ఇంగ్లీషు)

ముచ్చటగొలిపే త్రివర్ణ ముఖచిత్రం

[illegible]

[illegible]

ఇంకా మరెన్నో కొత్త ఆకర్షణలు గల

సుమారు 150 పేజీల ప్రతి

వెల 1-8-0

అక్టోబరు 15 వ తేదీ లోగా

[illegible]

ప్రతి ఉచితం

[illegible]

మేనేజరు, స్వతంత్ర

[illegible] 14.





గ్రామిక యువతులు (చిత్రకారుడు: హెచ్. వి. రాంగోపాల్.)

తెలుగు స్వతంత్ర

సంపుటి-
సంచిక-8

సెప్టెంబరు 24, 1948

ప్రచురణ:
ప్రతిశుక్రవారం

# అంతర్జాతీయ దుష్టశక్తులు

భారతదేశ శత్రువులకు హైదరాబాద్‌లో మనసేనల విజయం ఆశ్చర్యంతోపాటు నిరాశకూడా కలిగించింది. ముఖ్యంగా ఇంగ్లండులోని టోరీ వర్గ నాయకులకు, వారి మనస్తత్వమే కల బెవిన్‌వంటి ప్రభుత్వవర్గ ప్రతినిధులకూ. చాలాభాగం బ్రిటిష్ పత్రికలూ, బి. బి. సి. రేడియో, వారికి వెవకతాళం వేశాయి. బహుస్వల్ప జననష్టంతో ఇంత శీఘ్రంగా హైదరాబాద్ సమస్య తేలిపోవడంతో ఇంగ్లండ్ అమెరికా దేశాలలోని అభ్యుదయ నిరోధకులు కట్టుకున్న గాలి మేడలన్నీ కూలిపోయాయి.

ఆఖరు నిముషందాకా ధిక్కరించి, ప్రగల్భాలుపలికి స్వైరవిహారం చెయ్యడం; ఇక లాభంలేదని జ్ఞానం కలిగినప్పుడు 'దాసోహం' అని, అంతవరకూ జరిగిన దానికి బాధ్యత వేరొకరిమీద మోపి, కిరీటం నిలబెట్టుకోవడం అసఫ్ జాహీ వంశీయులకు అనూచానంగా వస్తూన్న అలవాటు. ప్రస్తుతపు నైజాముకూడా ఆపనే చేశాడు.

నైజాము ఓటమితో, భద్రతా సంఘంలో ఇండియాపై ఉన్న నేరారోపణకూడా హరించిపోవాలి. అసలు నైజాము భద్రతాసంఘం దగ్గిర ఫిర్యాదు చెయ్యడం యథాతథపు ఒడంబడికకు వ్యతిరేకమే కాక, ఇండియా శత్రువులకు దేశపు ఆంతరంగిక విషయాలలో జోక్యం చేసుకుందుకి ఒక అవకాశం. ఫిర్యాదు చెయ్యడానికి నైజామునకు హక్కు ఉన్నదీ లేనిదీ ఒకపక్క చర్చ జరుగుతూండగానే, నైజాము ప్రతినిధికి మాట్లాడడానికి అవకాశం ఇచ్చి భద్రతా సంఘం తన పాక్షికత్వం బయట పెట్టింది. భద్రతాసంఘం పరిశీలనకి పూనుకున్నది, ఇండియా సేనలు హైదరాబాద్‌పై "ముట్టడి" చేశాయనే ఆరోపణ కాదు; ఆగష్టు 21 తారీకున నైజాము చేసుకున్న విజ్ఞాపన. యథాతథపు ఒడంబడికకు ఇండియా కట్టుబడి ఉండలేదని, నవాబ్ మొయిన్ నవాజ్ జంగ్ చిలవలూ పలవలూ చేర్చి వర్ణించాడు. అందులో నిజానిజాలు బైట పెట్టడానికి యింక సర్. రామస్వామి మొదలియార్‌కు అవకాశం ఉన్నట్టు గోచరించదు కాని, ఉంటే బాగుండునని తోస్తుంది. యథాతథపు ఒడంబడిక పత్రంపై చేసిన సంతకం సిరా యింకా ఆరకుండానే, పాకిస్తాన్‌కి హైదరాబాద్ విపరీతమైన ధనం అప్పుగా ఇచ్చింది; సంస్థానంలోని సైన్యం అపారంగా, ఒడంబడిక షరతులకు విరుద్ధంగా, పెంచడానికి సన్నాహాలు చేసింది. విదేశాలలోని వర్తక



హైదరాబాద్ సంస్థానంలో ఇండియా సేనలకు ప్రజలు బ్రహ్మాండమైన స్వాగతమిచ్చారు.

సంస్థానద్వారా రహస్యంగా ఆయుధాలు తెప్పించుకుంది; (మొన్న సైనిక చర్యలో పట్టుబడిన షెర్మన్ టాంకులూ, 25-పౌండర్ తుపాకులూ అలా రహస్యంగా చేరినవే) రజాకార్ల రాక్షసకృత్యాలకు ప్రోత్సాహం ఇచ్చింది. యీ భీభత్సకృత్యాలకి తట్టుకోలేక ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని లక్షలాది ప్రజలు సంస్థానం విడిచి వచ్చేశారు.

ఇంత జరిగినా, సంస్థానంలో శాంతిరక్షణ సక్రమంగానే ఉందని భద్రతాసంఘంలో హైదరాబాద్ ప్రతినిధి వాదించారు. అందుకు ఉదాహరణంగా, అక్కడే ఉండ దలచుకున్న యూరోపియన్లను పేర్కొన్నారు. కల్లోలపరిస్థితే ఉంటే, వారక్కడే ఉండడానికి ఎందుకు నిశ్చయించుకున్నారని చాలా అమాయకంగా ప్రశ్నించారు. గత సంవత్సరం పంజాబ్‌లో కల్లోలం చెలరేగినప్పుడు యూరపియన్లు సురక్షితంగానే ఉన్నారనీ, ఇటువంటి పరిస్థితులలో వాళ్ళెప్పుడూ సురక్షితంగానే ఉంటారనీ, అందరికీ తెలిసిన విషయమే. హైదరాబాద్ "రాజ్యం"లో ఉన్న 18 మిలియన్ల ప్రజల క్షేమంగురించి మొయిన్ నవాజ్ జంగ్ తన ఆందోళన ప్రకటించారు. ప్రజలపై అతడు చూపించిన అభిమానానికి అందరూ కృతజ్ఞత చూపించవలసి ఉంటుంది. అయితే నూటికి పదిహేనుగురు మాత్రమే ఉన్న మైనారిటీవర్గానికి మెజారిటీ వర్గంతో సమానమైన ప్రాతినిధ్యం ఉండాలన్న నైజాము వైఖరిమాత్రం భద్రతా సంఘానికి తెలియదు; తెలిసినా తెలియనట్టే ప్రవర్తించడం వారి ప్రత్యేక కళ.

అంతర్జాతీయంగా హైదరాబాద్ కి గల హోదా ఏమిటో ఇంగ్లండ్ విదేశాంగ మంత్రి బెవిన్‌కి అవగాహన కాలేదు. ప్రధానమంత్రి ఆట్లీ లోగడ స్పష్టం చేసినా బెవిన్‌కి బోధపడినట్టు తోచదు. ఇండియా సేనల విజయం తరవాతనైనా, మిస్టర్ బెవిన్‌కీ, భద్రతాసంఘం సభ్యులకీ సందేహ నివారణ అయిందో లేదో భవిష్యత్తు నిర్ణయించాలి.

నైజాం సేనలు అస్త్రసన్యాసం చేశాయన్న వార్త ప్రకటిస్తూ, లండన్ బి.బి.సి. రేడియో, "మా ఢిల్లీ విలేఖరిద్వారాయీ వార్త అందింది. హైదరాబాద్ రేడియోలో నైజామ్ ఒక ప్రకటన చేసినట్టు కూడా తెలుస్తోంది. కాని, నైజామ్‌నుండి అధికారరీత్యా ఎట్టి ప్రకటనా మాకు చేరలేదు. ఇంగ్లండులో హైదరాబాద్ రేడియో వినిపించదు" అని వ్యాఖ్యానం చేసింది, అమాయకంగా. హైదరాబాద్ రేడియో లండనులో వినిపించక పోవచ్చుగాని, ఢిల్లీలో వినిపిస్తుంది; బి.బి.సి. ఢిల్లీ విలేఖరి తలుచుకుంటే వినగలడు. కాని తను విని, రూఢిఅయిన వార్తనే బి.బి.సి. కి ఎందుకు పంపలేదో ఆ విలేఖరిగాని, లండను వ్యాఖ్యాతగాని స్పష్టం చెయ్యలేదు.

కాశ్మీర్ సమస్యలో వలెనే హైదరాబాద్ విషయంలో కూడా జోక్యం చేసుకుని, ఇండియా ప్రభుత్వాన్ని ఇరుకులో పెట్ట దలచుకున్న వారంతా హతాశులయ్యారు. దీనినిబట్టి ప్రారంభదశలో ఉన్న మన స్వాతంత్ర్యాన్ని భగ్నం చేసేందుకు అంతర్జాతీయ దుష్టశక్తులు ఎన్ని కాచుకుని ఉన్నాయో బయటపడింది. ఐక్యరాజసమితి, భద్రతాసంఘం—వీటిలో గోముఖవ్యాఘ్రాలు ఎవరెవరో మళ్ళీ ఇంకోసారి ధృవపడింది.

# యథాలాపం

> యోగ్యత కలిగినవానిని గురిచూచి కాల్చడానికి, వీలుగా ఎత్తున కెక్కించడమే రాజకీయాల్లో యోగ్యతను సత్కరించే విధం.
>
> —బాపి

కాంగ్రెసుఅధ్యక్షపదవికి పోటీచేస్తూన్న ముగ్గురు అభ్యర్థుల్లోను, శ్రీ శంకరరావుదేవే తీసికట్టుగా కనిపిస్తాడు. సహాయనిరాకరణోద్యమం ప్రారంభదశనాడే.—ఆయన మహాత్ముని నిరాడంబర జీవనం అనుసరించి కొన్ని బాహ్య వేషాలు అలవాటుచేశాడు ఈ తరహావాళ్లు, చాలామంది మధ్యలో మానుకుని మళ్లీ మామూలు పద్ధతికి వచ్చినప్పటికీ, కొంతమంది యిప్పటికీ మిగలకపోలేదు. వీరిని గుర్తుపట్టడం ఎలాగంటే—వీరికి కుట్టుడు బట్టలు పూర్తిగా నిషేధం. వీరు ఒక్కొక్కప్పుడు తల నున్నగా గీయించుకుని కటికి పైరాగుల్లా దర్శనమిస్తుంటారు; ఒకొక్కప్పుడు గెడ్డం పెంచుకొని వ్యక్తి బూచుల్లా ప్రత్యక్షమవుతూంటారు.

*   *   *

మహాత్మ డెప్పుడూ తనకు ప్రియమైన ధర్మసూత్ర మేదో పట్టుబట్టి సాధించే ప్రయత్నంలోనే విలక్షణంగా ప్రవర్తిస్తూ వచ్చాడు. మహాత్ముని వింతచర్యలన్నిటికీ అర్థమిచ్చే పరమార్థమొకటి వెనక ఉంటూ వచ్చింది. సంఘజీవితానికి పైమెట్టున ఉండడానికి తనకు సహాయభూతంగాని దేనినీ మహాత్ముడు విడనాడలేదు ఆయన్ని అనుకరించే శిష్యుల జీవిత పద్ధతుల్లో మాత్రం అటువంటి స్పష్టమైన నిర్మాణాత్మక ప్రయోజనం ఎల్లప్పుడూ ఉంటూ వచ్చిందనడానికి వీల్లేదు దాంతో వాళ్లు పగటివేషగాళ్లల్లా కనిపించడం తటస్థిస్తోంది.

మహాత్ముని బాహ్యవేషం అనుసరించడం మినహా శ్రీ శంకరరావు దేవు సాధించిందేమీ కనబడదు. ఆయనవుంటే చుట్టూవున్నవాళ్లలో ఉత్సాహం హరించిపోతుంది స్వల్ప కార్యాలు నెరవేర్చడంలో మాత్రం ఆయనకి కొంత చాకచక్యం ఉందని చెప్పాలి దానినిబట్టి—తన కిందవుంటూ, తన మాట వినిపించుకునే సమర్థులైన ఉపకరణమాత్రు లవసరమైన సర్దారుకు ప్రీతిపాత్రుడు కాగలిగాడు. సమర్థుడుగా ఉపకరించినప్పటికీ, స్వతంత్ర స్వభావుడవడంచేత—ఆచార్య కృపాలనీ సెలవు తీసుకోవలసివచ్చింది. శ్రీ రాజేంద్రప్రసాదు ఒకరికి ఉపకరణం అనదగ్గవాడు కాడు. కాని గాంధీమహాత్ముని అనంతరం దేశనాయకత్వం పూర్తిగా పటేల్ నెహ్రూలకు విడిచిపెట్టి, ఆయన చల్లగా తప్పించుకొన్నాడు. ఉబ్బసపురోగి; ఎప్పుడు అకస్మాత్తుగా యీ జబ్బు రాగలదో చెప్పలేము; ఆయన చేతిలో త్వరత్వరగా చూడవలసిన రాచకార్యాలుంటే యిబ్బంది అవుతుంది. ఆరోగ్యం చెడిపోయినకారణంగా ఎక్కువగా పనిచేసే స్థితిలోలేని శ్రీ రాజేంద్రప్రసాదువంటి పెద్ద నాయకులకు బాధ్యతలేని గౌరవపదవులు మాత్రమే వేరుపాటు చేయుట సమంజసం.

ఆచార్యకృపాలనీ నిష్క్రమణకు పూర్వం వచ్చిన క్లిష్టపరిస్థితిలో–అధ్యక్షుని కార్యనిర్వహణలో అడుగడుగునా అడ్డుపడుతూ, అవతల ప్రజల్లో అడ్డదిడ్డంగా ప్రచారంచేస్తూ శ్రీ శంకరరావుదేవు ప్రాముఖ్యం సంపాదించాడు. వెనక శ్రీ ప్రకాశంగారు ప్రధానిగా ఉన్నరోజుల్లో యిక్కడ సామరస్యం కుదర్చడానికి ఆచార్యకృపాలనీ మద్రాసువచ్చినప్పుడు–సంకోచంలేకుండా తానుకూడా సిద్ధపై పానకంలో పుడకలా అడ్డపడి అంతా రసాభాస చేశాడు. అప్పుడు శ్రీ శంకరరావుదేవు గోప్యంగా నిర్వహించినపాత్ర ఉదాత్త చరిత్ర గలిగిన కాంగ్రెసు అధ్యక్ష పదవికి ఆయన్ని అనర్హుణ్ణిచేస్తుంది. ఒక వేళ కాంగ్రెసును నామమాత్ర సంస్థగా మార్చివెయ్యడం ఉద్దేశమైతేమాత్రం, యీ పట్టింపులేదు.

శ్రీ శంకరరావుదేవు కంటె శ్రీ పురుషోత్తమదాస్ టాండన్ ఉదాత్తుడైన వ్యక్తి; అతని చిత్తశుద్ధి గురించి ఎవరికీ–సంశయంలేదు వ్యక్తుల్నీ కూటాల్నీ



సుప్రసిద్ధ బొంబాయి చిత్రకారుడు వై. కె. శుక్లా ఇటీవల చైనాలో భారతీయ చిత్రాల ప్రదర్శనం ఒకటి ఏర్పాటు చేశాడు.

(ఎడమనుండి కుడికి):— చైనా విదేశాంగమంత్రి డాక్టర్ వాంగ్ షీ-చే; ఇండియాలోని చైనారాయబారి భార్య మదాం లో; బర్మా రాయబారి ఊమింట్-థీన్; వై. కే. శుక్లా; చైనాలోఇండియారాయబారి సర్దార్ పాణిక్కర్; మిసెస్ పాణిక్కర్; మిసెస్ వాంగ్ షీ-చే.

ఆధారం చేసుకుని పైకి వద్దామనే ఆశయాలు లేనివాడు. స్వార్థరహితుడు. కూహాకాల్లో పాల్గొనడానికి వస్తుతః అభిలాష లేనివాడు అయినా ప్రస్తుత పరిస్థితులలో అధ్యక్షుడుగా అతణ్ణి ఎన్నుకోవడం రెండు కారణాలవల్ల సమంజసంకాదు. కేంద్రప్రభుత్వంలాగే మన కేంద్రరాజకీయ సంస్థకూడా- సంయుక్తరాష్ట్రీయుల, గుజరాతీల ప్రాబల్యంతో నిండి ఉంది తత్ఫలితంగా దేశంలో తక్కిన భాగాల లోని ప్రజల్లో అసంతృప్తి తీవ్రంగాఉంది రాష్ట్రీయవాదం ఖండించడం సమంజసమే కాని, కేంద్రప్రభుత్వంలో ప్రాతినిధ్యం అసంతృప్తి గొలిపేటంత అసమానంగా ఉండడం వాంఛనీయంకాదు. నెహ్రూ పటేలులవంటి యావద్భారతనాయకులపట్ల యీ రాష్ట్రీభావం ఎవరికీ కలగదు. వారు దేశం మొత్తానికే నాయకులు. శ్రీటాండన్ అంతస్థు ఇంకా రాష్ట్రాన్ని అతిక్రమించి పైకి రాలేదు. మతానికి ఏమాత్రమూ ప్రాముఖ్యమివ్వని ప్రభుత్వ స్థాపనకోసం ప్రయత్నించే యీనాడు, టాండన్‌కి ఆర్. యస్. యస్ - హిందూమహాసభలపట్ల ఉండే సానుభూతి, మన తక్షణావసరాలకి సమన్వయంగా ఉండదేమో ననిపిస్తుంది.

*  *  *

కాంగ్రెస్ అధ్యక్షపదవి అలంకరించడానికి యీ ముగ్గురు అభ్యర్థులలోనూ అన్ని విధాలా అర్హుడైనవాడు డాక్టర్ పట్టాభి అతడు యింకో రాష్ట్రంలో జన్మించి ఉంటే, ఏనాడో కాంగ్రెస్ అధ్యక్షుడు అయేవాడు. ఆంధ్రత్వం అతనికి శాపంగా పరిణమించింది. తమ రాజకీయనాయకుల భవిష్యత్తును వర్ధమానం చెయ్యడం అనేది ఆంధ్రులకు ఇంకా చాతకాలేదు. నాయకత్వం కోసం పోటీ పడడమనేది ప్రతిచోటా ఉండే విషయమే. అయితే, యీ స్థానికమైన పోటీలకు ఒక హద్దు అంటూఉంది. ఇతరేతర నాయకుల ఒత్తిడికి తట్టుకోవడం కోసం అటుంచి, కనీసం లోకదృష్టిలో పరువు కాపాడుకుందుకైనా, సంఘీభావం చూపించడం అవసరం అయినా ఆంధ్రులది చిత్రమైన మనస్థితి వారి అంతః కలహాల ప్రకటనకి హద్దులులేవు స్వదేశపు పొలిమేరలుదాటి ఏ ఆంధ్రనాయకుడేనా పైకివచ్చి, యావద్భారత రంగంలో అడుగుపెడితే, అతడికి దోహదంయిచ్చి నిలపెట్టడానికి కావలసిన సహాయం స్వరాష్ట్రప్రజలే అతడికి నిరాకరిస్తారు ప్రజానాయకత్వానికి కావలసిన వివిధాలైన ప్రతిభలన్నీ ఉన్న పట్టాభి వంటి వ్యక్తిని వెనక్కినెట్టి, లఘుశక్తులనేకులు పైకి రాగలగడం అందువల్లనే జరిగింది

*  *  *

బహుముఖమైన డాక్టర్ పట్టాభి ప్రతిభ మన పురోభివృద్ధికి వినియోగించుకోలేక పోతున్నామంటే విచారకరమైన సంగతి అతడికి అపారమైన కార్య నిరతి ఉంది; మేధస్సు ఉంది; వాక్చాతుర్యం, నిర్మాణశక్తి, పరేంగితజ్ఞానం — అన్ని ఉన్నాయి. సంస్థానాలసమస్యగురించి అతడికి తెలిసినంత దేశంలో ఇంకెవరికీ తెలీదు. ప్రస్తుత పరిస్థితులలో, కాంగ్రెస్ అధ్యక్షుడు ప్రభుత్వవర్గాలతో సంఘర్షించకుండా, అలాగని ఆ వర్గాలకి లొంగిపోకుండా, చాకచక్యంతో కార్యభారం నిర్వహించాలి. అందుకు తగిన సామర్థ్యం తక్కిన యిద్దరికంటె డాక్టర్ పట్టాభికే ఎక్కువఉంది. ఏ విధంగా చూసినా, నేటి పరిస్థితులలో కాంగ్రెస్ అధ్యక్షతకి పట్టాభే అన్ని విధాలా అర్హుడని నిర్ణయించి తీరాలి.—(సాకా)

ఆపేక్ష చాలా జాలీకరంగా ఉండేది. ఆమెస్త్రీతనికి లోనే మాధుర్యం ఒలికేది. మా యింటికి వచ్చే మిత్రులంతా ఆమెను అధికారరీత్యా మా గృహంలో స్థానం ఉన్న వ్యక్తిగానే స్వీకరిస్తూ వచ్చారు. ఆమె తన మధురమైన ప్రవర్తనవల్ల, మృదులమైన స్వభావంవల్ల అందరి గౌరవప్రేమలను చూరగొనగలిగేది.

ఈలోపున కేంబ్రిడ్జి పరీక్షలలో సీనియర్ రేంగ్లర్‌గా ఉత్తీర్ణుడైన యువకుడు కుప్పుస్వామితో నా స్నేహం దినదిన ప్రవర్ధమానం కాసాగింది. నాకు తన సాంగత్యంవల్ల విసుగు కలిగించని వ్యక్తి అతడు ఒక్కడే. అతనివంటివాడు మాట్లాడ్డానికి దొరకడమే ఒక ఉపశాంతి. అతనికి అనేక విషయాలలో అభినివేశం ఉంది. తన అభిమాన విషయమైన గణితశాస్త్రం ఒక్కదానిలోనే కాక సాహిత్య విషయాలలోనూ, యోగశాస్త్ర విషయాలలోనూ కూడా అతడు సాధికారంగా సంభాషణ నెరపగలడు. ఏ ఒక్క శాస్త్ర విషయంలో గాని లోతైన పరిజ్ఞానం కలిగిన వ్యక్తి తుట్టతుదిని దైవము, ప్రకృతి, ఆత్మలను గూర్చిన నిగూఢ సమస్యలకు సంబంధించిన సమాలోచనలో పడక తప్పదని నా దృఢమైన విశ్వాసం. కాలపరిమితమైన విలువలకు, నిత్యమైన విలువలకు మధ్య జరిగే సంఘర్షణ వలన కలిగే పారవశ్యానుభూతిని తెలియనివాడు, జ్యోతిర్మయమైన నిర్మలభావనా జగదంచలాలను మానసికంగానైనా సోకలేక అంధకారంలో దారి తెలియక తపముల్లాడేవాడు నిజమైనజ్ఞాని కాజాలడు. నా మిత్రుడు కుప్పుస్వామి ఉన్నత గణితశాస్త్ర విహాయస వీధిని చాలా సాధికార ప్రయాణం సాగించి, సాధారణ మానసిక కక్ష్యకు అతీతమైన గణిత సమస్యలను సాధింపజాలిన ఉత్కృష్ట ప్రజ్ఞాశాలి. గణితజ్ఞుడుగాని, శాస్త్రజ్ఞుడుగాని, కళాభిజ్ఞుడు గాని— సాధారణ మనస్సుకి సంతృప్తికరంగా తోచినా స్థాలిత్య భూయిష్ఠమైన సాంప్రదాయిక సమాలోచన పద్ధతులను ఒకసారి అధిగమిస్తే- మనోకక్ష్యకు అతీతము బాహ్యము అయిన ఒక నూతన ప్రపంచపు అంచులను స్పృశింప గలుగుతాడు. ఆ అధిమానసిక లోకాంచలాలను సోకిన వానికి ఇక సంతృప్తిగాని, విశ్రాంతిగాని ఉండదు. అట్టివారు భౌతిక చేతన లోనించి ఆధ్యాత్మిక చేతనలోనికి అయస్కాంతం వలన ఆకర్షింపబడినట్లు లాగబడతారు. అంకెలు, సూత్రాలు, స్వప్నాలు— వీనికి సంబంధించిన ఉన్నతోన్నత సమస్యలను గూర్చిన నిరంతర సంభావనము వలన సంజనితమైన జ్ఞాన తేజస్సు వీరి మనోవీథిని ఆవరించి, నెమ్మదిగా వీరి ప్రకృతిలో ఉత్కృష్ట పరివర్తనం చేకూరుస్తుంది. కాల క్రమేపి అట్టివారు తెలియకుండానే, ఆధ్యాత్మికాన్వేషణపరులౌతారు. బహుముఖమైన సత్య పరిశీలన మార్గాలని అనుసరించి ఏకైక సత్యపరమావధిని అందుకుంటారు. వారి దినజీవితం నిరాడంబరమై, సన్నిహితులకు యోగసాధకునితో వారికిగల సాదృశ్యం దృగ్గోచర మవుతుంది. అందువల్లనే అట్టివారు ఒకవంక అసాధారణ విచిత్రవ్యక్తులుగా పరిగణింపబడి నప్పటికీ, మరొకవంక హృదయపూర్వకమైన భక్తి గౌరవాలను చూరగొనగలుగుతారు. కుప్పుస్వామి నిస్సంశయంగా కేవల మానవ మేధోజనితమైన క్లిష్టతర గణిత సమస్యలకు- స్థిరీభూతమైన అంక సముచ్ఛయాలకు— అతీతమైన అనుభూతిస్థితుల కొరకు అన్వేషించే వ్యక్తి. అందువల్లనే అతనంటే నాకు ప్రేమాతిశయం. నేను కూడా నా చిన్ననాటినుంచీ సౌందర్యాన్నీ ప్రాణ ప్రకృతుల చేతనలనూ అధిగమించాలనీ, సామాన్య దృష్టికి స్థిరత్వరూపంతో గోచరించే సహస్ర శబల వర్ణ ప్రపంచానికి మూలకారణమైన సూక్ష్మసత్యాన్ని అందుకోవాలని ఒంటరియాత్ర సాగిస్తున్న వాణ్ణే.

వెంకటచలం పూర్తిగా మరొకతరహా మనిషి. అతణ్ణిచూస్తే ఒకవిధమైన ఉల్లాసాదేశబ్రహ్మలా కనిపిస్తాడు. అతని దృష్టిలో జీవితం కేవలం అనుభోగంకోసమే అని అనిపించినా, అతడా అనుభోగానికి అతుక్కుపోకుండా కాలక్షేపం చేయగలడు. అతడు దొరికినన్ని పరిచయాలను చేసుకొని, జీవితంలో వీలైనంత సంతోషాన్ని సేకరించుకుంటూ కాలము పుచ్చడంలో మిక్కిలి ప్రతిభాశాలి. దివ్యజ్ఞాన సమాజానికి చెందినవాడు కావడంవల్ల దానికి చెందిన ఆకర్షకమైన అభిప్రాయాలు అతనికి విశాలమైన దృక్పథాన్ని ఒసగాయి. అందువల్ల అతనికి ప్రముఖమైన స్నేహాలను, పరిచయాలను సంపాదించడంలో ప్రజ్ఞ ఏర్పడింది. ఎల్లప్పుడు సరదాగాను సహాయకరంగాను ఉంటూ, ముఖ్యంగా కళాకారులచే సుందర సృష్టి చేయించడానికి సహకరించడంలో అతడు అందెవేసిన చేయి. అతడు

చాలాకాలం మా నాటక యాత్రలలోను, రంగ నిర్మాణ కార్యంలోను అత్యంత సహకారిగా ఉపకరిస్తూ వచ్చాడు. నేనెప్పుడూ అతణ్ణి ఒక 'కులాసా ఫకీరు'గా సంభావించేవాణ్ణి. తనకుగల ప్రాపంచికపు ఆస్తి కొలదిపాటే అయినా, బహుసహజంగా సమాన స్థాయిని ప్రముఖులైన వ్యక్తులతో పరిచయ లాభం కలిగించుకుని, వారి సమాదరణ పొందుతుతూ, సుఖంగా సంతోషంగా అతనెప్పుడూ పట్నంనించి పట్నానికి ప్రభువులా ప్రయాణాలు సాగిస్తూ గడిపేవాడు. వెంకటచలం మాకుటుంబపు "ఆంతరంగిక మిత్రబృందంలో" ఒకడు.

కమల తన చుట్టూ చాలామంది యువకులైన ఆరాధకుల్ని ఆకర్షించుకుంది. వారు ఆమెలోని అసాధారణ సంస్కృతి వ్యక్తిత్వాలవల్ల ఆకర్షింపబడేవారు. ఆరాధకులను ఆకర్షించడంకంటె మించిన ఆనందం స్త్రీజాతికి ఉండదని తోస్తుంది నాకు. ఇతరుల అభిమానాన్ని చూరగొనడంలో వుండే ఆసక్తికి వయస్సు పరిమితివుండనే వుండదనికూడా అనిపిస్తుంది. ఈ లక్షణం లేని వయస్సు ముదిరిన అవివాహితురాలినైనా ఒకర్తెను చూపగలరా? యథార్థానికి విరుద్ధమైనా, తాను అందగత్తె అని పొగిడితే విన కుతూహాలురాలు కాని స్త్రీరత్నం సృష్టి సర్వస్వంలోను ఎక్కడైనా ఉంటుందా? అయితే కమల విషయం వేరు. ఆమె నిజంగా ఆ రోజుల్లో అందంగా వుండేది. నిస్సందేహంగా ఆమెలో ఇతరులను వశంవదం చేసుకోగల గొప్ప ఆకర్షణశక్తి వుంది. కాని స్నేహాలని స్థిరంగా నిలుపుకో లేదని మాత్రం కాలం ఋజువుపరిచింది. బహుశా ఆమె స్వభావంలో సంఘటనలను, వ్యక్తులను స్వీయాన్నత్య లక్ష్యాన్ని చేరుకునేందుకు తాత్కాలిక సోపానాలుగా వినియోగించుకునే గుణం వుండడం అందుకు కారణం కావచ్చు. అది చాలా స్వాభావికమైన విషయమే. ఏమనగా— ఔన్నత్య పిపాసగాని, ఏతదన్వేషణగాని ఏ క్షణంలోనూ అల్పమైన అనుబంధ బంధనాలలో చిక్కబడే దౌర్బల్యానికి వశంకాదు. విశ్వాసభావం అనేది ఉత్త నిర్వీర్యమైన మాట అనీ, అర్థప్రయోజనాలు అంతరించిన పిదపకూడా విషయ లంపటంలో పడి కొట్టుకునే దుర్బల మనస్కులు తుది శరణ్యమనీ వాదిస్తుంది ఔన్నత్య పిపాస! "నాటకం నడవడం ప్రధానం" అన్నాడు షేక్స్పియరు కవి— పాత్రలు ఏకత్ర ప్రయోజనాన్ని నెరవేర్చే కీలుబొమ్మలు మాత్రమే!

మా బెంగుళూరు జీవితం అలసట గొలిపే రకరకాల సాంఘిక కార్యకలాపాలతో కూడిన చిత్రబంధంగా పరిణమించింది. నాకు ఈసరికి కమలలో గాని, గృహజీవితంలోగాని ఉత్సాహం పూర్తిగా సన్నగిలిపోయింది. నా ఒంటరితనం ఇంతింతలుగా పెరిగిపోయింది. నన్ను ముంచెత్తే ఆ ఒంటరితనం మద్యచషకాలతో నన్ను తాను కొలుచుకొని, బలాత్కారంగా జీవిత భారాన్ని తేలిక చేసుకోడానికీ, హృదయాన్ని ఉల్లాసపరిచికోడానికీ ప్రయత్నించడం ప్రారంభించింది. ఈపని తరుచైనకొలదీ ఆధ్యాత్మిక వైకల్యతా దౌర్బల్యాలు నన్నావహింపసాగాయి.



కళాశీలి తన రచనలద్వారా మానవ వివేచనాశక్తిని పెంపొందింపజేయాలి. ఈ ఆశయంతో రచనలు సాగించని రచయిత రాణించడు. ఆ విధంగానే ఈ ఆశయం లేనినటకుడుకూడా తన కళలో పరిపూర్ణుడు కాజాలడు.—కాలినిన్.

* * * * * *

కళ స్నేహితుణ్ణీ, శత్రువునూ అర్థంచేసుకోవడానికీ, సామ్యవాద దీక్షను ఉత్తేజింపచేస్తూ విద్యా ప్రబోధం చేయడానికీ తోడ్పడాలి—లెనిన్.

*మదరాస్ స్థిరవాస్తవ్యుల యభిప్రాయ మెట్టిదియో కనుగొను ప్రయత్నము జేసినవారెవ్వరును లేరు- వారాంధ్రరాష్ట్రమున జేర సమ్మతింతురా? లేక యరవనాటితో నైక్యమందుదురా? వారియభిప్రాయమేమి?*

# భాషాప్రయుక్త విభజన సాధకబాధకములు

డాక్టరు నేలటూరి వేంకటరమణయ్య

భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణముకొఱకు నియోగింపబడిన విచారణకమిటీ వచ్చిపోయినది. సాక్ష్యమునుబట్టి వారేమి తీర్మానమును చేయుదురో తెలియదు; తీర్మాన మెట్టిదైనను కమిటీ వారు విచారించిన సాక్ష్యము సరియైనదని చెప్పుటకు వీలులేదు. విషయమునంతటిని అవగాహన చేసికొని యథార్థమునకు రంగువేయక సాక్ష్యమును బలుకు సాక్షులను వీరు విచారించిరని యెంచుటకవకాశము లేదు. ఈతప్పు కమిటీవారిది కాదు. సాక్షులపట్టికలను తయారుచేసిన మహానుభావులది. వీరు పొలిటీషియనులు-వీరిగొంతు పెద్దది; వీరు సర్వజ్ఞులు. వీరికిగలజ్ఞాన మితరులకు లేదని వీరి దృఢనమ్మకము. మన రాజకీయార్థిక సాంఘిక మత విషయములలోనే కాక నైతిక చారిత్రిక శాస్త్ర విషయములయందు వీరికిగలగాఢపరిజ్ఞాన మన్యులకులేదని వీరి యభిప్రాయము; కావున పైవిచారణ కమిటీ వారిముందు సాక్ష్యమును బలుకుటకు దమగూడెమునకు జెందినవారినే తయారుచేసిరి. ఇంకొక విశేషము. సాక్ష్యమును బలుకుటకు నిర్ణయింపబడిన పొలిటీషియనులుగూడ నన్ని పక్షముల నుండియు సమానముగ నెన్నుకొనబడలేదు. దీనికి ముఖ్యకారణ మాంధ్ర ద్రావిడ పరస్పరవిరోధము. ఈ విరోధము మదరాసువలన కలిగినది. మదరాసు ఆంధ్రులదా, ద్రావిడులదా యను పెనువాదమొకటి ఇటీవల బయలుదేరినది. దీనిమూలమున జనులయాందోళన పెల్లుబికినది. ఆంధ్రులును తమిళులును తమతమ రాష్ట్రముల యుత్తర దక్షిణపు టెల్లలను గూర్చి విపరీతాభిప్రాయములను వెలిబుచ్చినారు. ఒక మదరాసు మాత్రమే కాదు. చెంగల్పట్టు ఉత్తర ఆర్కాటు జిల్లాలుకూడ మావే నని యుద్ఘాటించినా రాంధ్రులు. అట్లగునా? నెల్లూరు చిత్తూరు కడప జిల్లాలు మావేనని ప్రత్యుద్ఘోషము గావించినా రరవలు. ఇరుతెగలవారికిని ఆవేశము పెరిగిపోయినది; పౌరుషమే ప్రధానమైనది, నిజము మీది దృష్టి నీరుగలిసిపోయినది. ఈ పరిస్థితియందు మదరాసురాష్ట్ర మన్త్రిత్వాంగ మరవల చేజిక్కినది. ఆంధ్ర ప్రధానమంత్రిని స్వార్థపరులగు కొందఱు శాసనసభయందలి యాంధ్రప్రతినిధుల సహాయమువలన అరవవారు త్రోసిపుచ్చిరి. అరవరెడ్డి యొక్కడు ప్రధానియాయెను. జన్మతః రెడ్డియైనను గుణములచే నరవలతలమవన్ని నాడీతరగుణముల మాటనటుండనిచ్చి యాంధ్రద్వేషమునితర ద్రావిడులకు నీసిపోడు. నరియుద్ధులనే తోడుమంత్రులుగ నెన్నుకొనినాడు; ఆంధ్రులను మదరాసునుంచి ఊడ్చివేయవలయునని పట్టుపట్టినాడు. నిప్పునకు గాలి తోడైనట్లు తక్కిన అరవ మంత్రులకు బాసట. భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణ విచారణ కమిటీముందు సాక్ష్యము చెప్పుటకు సాక్షులపట్టిని మదరాసు గవర్నమెంటు తరఫున తయారుచేసిన మహానుభావులు వీరు: ఇక వారు తయారుచేసిన పట్టికయందలి సాక్షులు చెప్పిన సాక్ష్యము నిష్పక్షపాతముగ నెట్లుండగలదు?

మదరాసు మంత్రివర్గము సర్వమును ద్రావిడ భూయిష్ఠము గాదే? ఆంధ్రమంత్రులు గూడ కలరే? వీరు ఐదుగురే? వీరు ఆంధ్రుల పక్షమున యథా

[illegible]లైన సాక్షుల సాక్ష్యము పట్టికయందు చేర్చి యుండరా? యను ప్రశ్న రావచ్చును. పట్టికయందలి సాక్షులను పరిశీలించి తరగతివారిగ విభజించి చూచిన ఈ ప్రశ్నకు సమాధానము రాగలదు. సాక్షులయందు నూటికి అరువదివంతు అరవవారు; వీరికి ఆంధ్రులయెడ ద్వేషము సుప్రసిద్ధము. ఒక ప్రకాశమునకును కాశీశ్వరరావునకు దప్ప పేరుగల యాంధ్రుల కెవ్వరికి నిందు తావు లేకపోయినది. ఒక యాంధ్ర పత్రికాధిపతియైన నిందు జేర్చుట కర్హుడు గాకపోయెను; నాంనిషాక్ లేని సెట్టు పిళ్లలు మొదలియారులు అయ్యరులు అయ్యంగారులు ప్రవిష్టమండలములు- అరవలు కానివారిలో బహుసంఖ్యాకులు ఆంధ్రరాష్ట్రము పేరు చెప్పిన బొబ్బలిడువారు. వీరు ఆంధ్రుల విషయమై నిష్పక్షపాతబుద్ధితో నెట్లు ప్రవర్తింప గలుగుదురు? పట్టిక పరిశోధనవలన తేలిన సారాంశ మేమనగా నది యరవల పక్షమునను, నాంధ్రులకు ప్రతికూలముగను సాక్ష్యము పలికించుటకొఱకే తయారు గావింపఁబడెనని- ఐదుగురాంధ్రమంత్రులును మంత్రివర్గమున లేకుండిన నెట్లో ఉండియు నట్టే నిరర్థకులైరి- వీరిపేర దయారు గావింపఁబడిన పట్టిక యాంధ్రులకు సహకారి యగుటకు బదులు నష్టకారి యైనది-

మద్రాసు గవర్నమెంటువారి పట్టికయందు పేర్కొనబడని పెద్దమనుష్యులు మఱికొందఱు తమంతట తాముగ సాక్ష్యము పలుకుటకు ముందునకువచ్చిరి. వీరియందు ముఖ్యులు ఆంధ్రసరిహద్దు సంఘమువారు. వీరు నలుగురు. వీరు చెప్పిన సాక్ష్య మైక్యకంఠము గాకపోయినను సమంజసమైనదే. మదరాసు ఆంధ్రులచే నిర్మింపబడెననుట నిస్సంశయమైన విషయము. ఇప్పుడీపట్టణమున నాంధ్రులకంటె నరవల సంఖ్య యతిశయమగుటకు గొన్ని ముఖ్యకారణములు గలవు. ఇచట ప్రస్తుతము కార్యవ్యాసంగమున వచ్చి తాత్కాలికముగ నివసించువా రనేకులుగలరు. ఉద్యోగమునకు వచ్చినవారు కొందఱు; వీరి మూలముననే కాక ఇటీవల పెక్కు అరవగ్రామముల నీపట్టణమున జేర్చుటవలన పట్టణప్రజయందరవవారి సంఖ్య యతిశయించినది. కావున ఇప్పటి యతిశయ యరవ జనసంఖ్య నాధారపఱచుకొని యనాదిగ చెన్నపట్టణ మరవలదని చెప్పుట చరిత్రకు విరుద్ధమైన విషయము.

ప్రస్తుతము మదరాసున నివసించుచుండు జనులందఱును- అరవలును ఆంధ్రులును మాత్రమే కాదు. గుజరాతీలు మార్వాడీలు కన్నడిగలు మళయాళీలు మున్నగు నన్యభాషల నాడెడువారు పెక్కండ్రు గలరు. వీరియం దనేకులు మదరాసును స్థిరనివాసముగ జేసికొని యచట ఇండ్లు వాకిండ్లు తోటలు దొడ్లు ఆస్తిపాస్తు లార్జించుకొని యుండువారు కలరు. వీరి యభిప్రాయమేమి?

మదరాసు మాదిమాది యని పోట్లాడు నాంధ్ర ద్రావిడులలో మదరాసు స్థిరనివాసముగాగల వార లనేకులు లేరు. కొంతెమించుగ నీకందఱో గోదావరి విశాఖపట్టణ కృష్ణా గుంటూరు మండలముల నుండియో: తిరునెల్వేలి మధుర తిరుచిరాపల్లి తంజావూరు జిల్లాలనుండియో వచ్చి తాత్కాలికముగ నిచట వసించు పెద్దలు-వీరిదే పెద్దగొంతు. అరచి యార్భటించువారును వీరే. ఈ సందర్భమున మదరాసు స్థిరవాస్తవ్యుల యభిప్రాయ మెట్టిదియో కనుగొను ప్రయత్నము జేసినవా రెవ్వరును లేరు. వారాంధ్రరాష్ట్రమున జేర సమ్మతింతురా? లేక యరవనాటితో నైక్యమందుదురా? వారి యభిప్రాయ మేమి? వారి యభిప్రాయము గనుగొనుటకు ప్లెబిసైటే ముఖ్యసాధనము. ప్లెబిసైటును దీసికొనుట యుక్తమైనయెడల ఉద్యోగార్థముగాని, పోలిటిక్సువలన పొట్టపోసికొనుటకుగాని, వ్యాపారముకొఱకుగాని మదరాసున తాత్కాలికముగ నివసించు జనులను విడిచి పృచ్ఛుట సమంజసము. అట్లే నిన్న మొన్నటివరకు మదరాసు నగరమున జేరక స్వతంత్రములై యుండిన పల్లెటూరుల ప్రజలను వెలిపఱచుటయు న్యాయము- ఈ నియమముల ననుసరించి ప్లెబిసైటును గొనిన మదరాసు ఎవ్వరికి చెందవలయునను విషయము నిశ్చయముగ తేలగలదు. అప్పా అండు కంపెని వెంకటస్వామి నాయనివంటి అరవనాయండ్లు కొందఱు తమ పూర్వోత్తరములను విస్మరించి జాతికి వీడికోలొసఁగి యరవనాటి పక్షమున ఓటిచ్చినను, మాజీ పురపాలక సంఘాధ్యక్షుడు సుందరరావు నాయని వంటి జాత్యభిమాను లాంధ్రులకు ఓటిచ్చినను, మదరాసు స్థిరనివాసముగ గల జనులు ఆంధ్రదేశమును గాని యరవనాటినిగాని గలయుట కొప్పుకొనక స్వతంత్ర నగరముగ నుండవలయునని కోరుదురని నా యభిప్రాయము.

లేకుండ వేఱుపఱచవలయునని చేయు ప్రయత్నము కొనసాగదు. ఏలన అది యసాధ్యమైన కార్యము- ఇట్టి కార్యమును దలపెట్టిన సర్కారాంధ్రులకును, తంజాపుర చిరుచిరాపల్లి మధుర రామనాథపుర తిరునెల్వేలి యరవలకును నీకార్యము సులభమనియు నవశ్యమనియు తోచవచ్చును; కాని గడిమండలాంధ్ర ద్రావిడుల కిది నచ్చదు. చారిత్రికముగను సాంఘికముగను వారి జీవనము కలసి మెలసి యేకమైపోయినది- మఱియు సాంస్కృతిక దృష్టితో జూచిన యే భేదమును గాన్పించదు. పొలిటీషియనులును స్వయంకృత ప్రజానాయకులును ద్రావిడ సంస్కృతియనియు నాంధ్ర సంస్కృతి యనియు గర్ణాటక సంస్కృతియనియు నొక్కొక భాష నాడు ప్రజలకు నొక్కొక్క ప్రత్యేక సంస్కృతి యుండునట్లుద్ఘోషించుచు దక్షిణ భారతీయుల నైక్యమును జెఱుప బ్రయత్నములు సల్పుచున్నారు. ఒక్కొక్క భాష నాడు దేశమునను కొంత భేదము గానవచ్చుట వాస్తవమే- ఈభేదము లల్ప విషయములందే; ప్రాధాన్యాంశములందు కాదు. దాక్షిణాత్య సంస్కృతి యొక్కటియే. ఆంధ్ర ద్రావిడ కర్ణాటాది దాక్షిణాత్య సమస్త ప్రజల సామాన్య కృషిచే రూపొందినది. భాషననుసరించి చేయు రాష్ట్ర విభజనా విషయమం దీయంశము విస్మరింపగూడనిది.

మదరాసు దక్షిణ భారతదేశమున ప్రధాన కేంద్రస్థానము- ఇతర భాషల నాడు ప్రజలిచ్చటికి వచ్చుచుపోవుచున్ననిది తెనుగువారికినితమిళులకును కూడలి- కావున దాని నిటు తెనుగువారికిగాని యటు అరవలకుగాని యిచ్చిన నది యసంతృప్తికిని దీర్ఘ వైషమ్యములకును గారణము కాగలదు. మదరాసును పరిసర ప్రదేశములతో గూడ నొక చిన్న ప్రత్యేక రాష్ట్రముగ జేసిన ఆంధ్ర ద్రావిడ వివాదము తీరునని కొందఱు చెప్పుదురు- ఈ తీర్మానమువలన పట్టణాభివృద్ధి చెడిపోవును. మదరాసు ఘనమైన వ్యాపార స్థలముగాదు-వస్తు నిర్మాణ కర్మాగారముల యునికిపట్టునుగాదు- దాని ప్రాముఖ్యము కేవలము రాజకీయ కారణములవలన గలిగినది- దక్షిణ హిందూదేశమున కంతటికిని అది రాజధాని- దాని యభివృద్ధి రాజకీయ వ్యవహారములమీద నాధారపడియున్నది- మదరాసును ప్రత్యేక రాష్ట్రముగ జేసిన తెనుగువారు మఱియొక నగరమును రాజధానిగ జేసికొన వలసి వచ్చును- అంతట మదరాసు ప్రాముఖ్యము చెడును- దక్షిణ హిందూస్థానములోని సామాన్య పట్టణములవలె నది యొక చిన్న పట్టణముగ మారును- కాబట్టి మదరాసును ప్రత్యేక రాష్ట్రముగ చేయుట యుక్తమని యెంచుటకు వీలుపడదు-

ఆంధ్రపరిషద్దు సంఘమున సాక్ష్యము జెప్పుచు శ్రీ బులుసు సాంబమూర్తిగారు చెప్పినట్లు మదరాసు ఆంధ్రులకే సంపూర్ణముగ నిచ్చివేయని పక్షమున దాని నాంధ్రద్రావిడుల కిరువురకును పంచియిచ్చుట యుక్తము. కూవమునకు దక్షిణభాగ మరవలకును ఉత్తర మాంధ్రులకు నిచ్చివేసిన ఇరుపక్షములవారికిని అసంతృప్తికి కారణముండదు. చలవాదులగు నాంధ్రులుగాని యరవలుగాని ఈ విభజనకు సమ్మతింపకపోవచ్చును. కాని ఇట్టివిభజన సమంజసము- మఱియు ననాదినుండి వచ్చుచుండు నాంధ్ర ద్రావిడ సంయోగ మవిచ్ఛిన్నముగ సాగుట కిందువలన నవకాశ మేర్పడుచున్నది.

మదరాసు నరవలకే ఇచ్చివేయుట కేవల మక్రమము. అది తమిళనాటి యుత్తరపు కొన నున్నను కేవల మరవ పట్టణముగాదు. అధికారము దమకు కైవసమైనది మొదలు అరవమంత్రులుచెన్నపట్టణమును కేవల మరవపట్టణము సేయుటకు భగీరథ ప్రయత్నములు సేయుచున్నారు. జాత్యభిమానము లేక స్వార్థపరులైన తెనుగుమంత్రులు అరవలకు లొంగి తటస్థులైయున్నారు. వీరి ప్రవర్తన యేహ్యమైనది.

భాషాప్రయుక్త రాష్ట్రనిర్మాణ సందర్భమున తెనుగువారికి న్యాయముకలుగునా యను శంక కలుగుచున్నది. అఖిలభారత కాంగ్రెసు సంఘము వారి కాంధ్రులయెడ నుదాసీనతయు నరవలయెడ నవ్యాజప్రేమయుగలదు. వీరి పూర్వప్రవర్తనను బట్టిచూచిన వీరీసందర్భమున నిష్పక్షపాతముగ వర్తించగలరా యనుసంకోచము పొడముచున్నది. అన్నిటికంటెను బలవత్తరమైనది యాంధ్రనాయకుల వేఱు బందము. వీరు తమ యభిప్రాయభేదములను విస్మరించి సర్వాంధ్రజనులకుసామాన్యముగ నీ విషయమున నొక్కటిగా నిలిచిరేని మనకు కొంతన్యాయముగలుగగలదు; కాని యాంధ్రనాయకు లేకమార్గమునననుసరింతురా!

# ఘంటాపథం

## నిజాం భవితవ్యం

భారత సైన్యపు కవచ శకటాలు హైదరాబాదు నగర మాక్రమించి సికిందరాబాదు గమ్యం చేరుకున్నాయి; నిజాం నవాబు భారత ప్రభుత్వానికి పాదాక్రాంతుడైనాడు

భారతసేనా శకటాలు, ఆధునిక లోహ చక్రాలు శత్రువుల పాలిటికి హింసాకర్కశములైనా, శరణాగతుల పట్ల అహింసా మార్దవం నెరపజాలిన పునీత సనాతన రాజనీతికి పునః ప్రతిష్ఠ చేశాయి

నిజాం సీమలోనికి భారత సైనిక దళాలు చేసిన శరవేగ పురోగమనపు మార్గంలో ఎదురైన రజాకారు దండు 1500 నిహతులైతే, నవాబు సాయుధ సైన్యం 600 మాత్రమే హతమైనట్లు అంచనాలు ప్రకటిత మైనాయి- దీనిని బట్టి చూస్తే, రజాకారు దండు అండగా నిలిచి యుద్ధానికి రేపెట్టకపోతే నవాబు సేనలు ఇంతపాటి అయినా తలెత్తడానికి సాహసించ గలిగేవని తోచదు అందుకనే వారు ఎదిరిబలం కళ్లార చూచినంతనే ఎక్కడివారక్కడ అలగాజనంలో కలిసిపోయి అంతర్హితులై ప్రాణాలు దక్కించుకున్నట్లు తోస్తుంది తమ ఉన్మత్త నాయకుని మోసపుమాటలునమ్ముకుని ఎదురొడ్డి నిలిచిన రజాకార్లుమాత్రం హెచ్చుగా దెబ్బతినకతప్పిందికాదు.

తన రాచనగరులోనే బందీకృతుడైన వాసిలా నవాబు భారత సేనాదళాల దిగ్బంధంలో సురక్షిత శరణాగతుడై మిగిలి వున్నాడు. అతడిపట్ల భారతసేనాని ఇంతవరకు రాజలాంఛన గౌరవాలలో ఏమీకొరవచేయకుండానే వర్తిస్తున్నాడు. అతడి భావిగతి భారత ప్రభుత్వపు రాజకీయ అధినాయకుల కరగతమై వుంది. నిజాం సంస్థాన కాంగ్రెసువారు నవాబును పదవీచ్యుతుని చేయాలని భారత ప్రభుత్వాన్ని కోరుతున్నట్లు చూచాయగా మాత్రమే ప్రకటీకృతమయింది నిర్ధారణగా మాత్రం ప్రజాభీష్టానుసారం ముందు ఏర్పాట్లు జరుగుతాయని నెహ్రూప్రధాని తన అభిభాషణలో ప్రస్ఫుటం చేశాడు

రంగాగారి నడిగితే, తెలంగాణాజిల్లాలు ఆంధ్రరాష్ట్రంలో అంతర్గతం చేసివేయవలసినదని ఘంటాపథంగా ఉద్ఘాటిస్తారు. అయితే రంగాగారి అభిప్రాయాలమీద ఇంకా భారత ప్రభుత్వం నడిచే అవసరం అవకాశం ఏర్పడకపోడం శోచనీయం. సోషలిస్టులు, కమ్యూనిస్టులు- భాషాప్రయుక్త రాష్ట్రాలమాట అటుంచి- నవాబును తొలగించ వలసిన షరతులుమాత్రం నొక్కి వక్కాణిస్తున్నారు

డాక్టరు పట్టాభిగారుభారతస్వాతంత్ర్య గోపురానికి హైదరాబాదు పత

నంతో శిఖర నిర్మాణం పరిపూర్తి అయిందని అందమైన ఆలంకారిక పరిభాషలో శ్రోతల నానందపరిచారు

సైనికబలం బహు స్వల్పమై, ఆర్భాట ప్రచారాన్నే ఆధారం చేసుకు ఒంటికాలి మీద లేచిన నవాబును నాలుగు రోజులలో శరణాగతుణ్ణి చేయడం భారతప్రభుత్వాని కొక మహా బృహత్ విజయంగా పాటించవలసిన తొందర నాకు పట్టదు. కాశ్మీర సమరరంగముందర హైదరాబాదు పోలీసుచర్య అల్పమైన సైనిక విన్యాసము కంటె ఎక్కువైనదిగా కనిపించదు. అయినా, రాజకీయ ప్రాముఖ్యాన్ని, భౌగోళిక ప్రాధాన్యాన్ని బట్టి ఈ స్వల్ప విజయ సంరంభానికి అనల్పమైన సార్థకత ఏర్పడ గలుగుతుంది

నవాబును తొలగించడానికి పూనుకుంటే, భారత ప్రభుత్వానికి ఈ సైనిక చర్య ఫలితంగా తగిన అధికారమూ, శక్తీ హస్తగతమై ఉన్నాయి అయితే ఆపూనిక ఇప్పట్లో ఉన్నట్లు మాత్రం సూచనలింకా లేవు అది కాని పక్షంలో ప్రజా ప్రాతినిధ్య ప్రభుత్వం ఏర్పడేవరకు ప్రస్తుతంవలె ఈ నవాబు, తదనంతరం తద్వంశీకులు చట్టసమ్మతమైన రాచరికం నెరపడం మనం చూడవలసి వుంటుంది. అయితే సింహద్వారం దగ్గర ఫిరంగి మ్రోగించేదాకా సింహాసనం దిగకుండా భీష్మించుకు కూర్చున్న నిజాం నవాబు, ప్రజారంజకత్వంలో ఎంతవరకు ఎంత త్వరలో పాఠాలు నేర్చుకొన గలుగుతాడో ఎవరు హామీ యివ్వగలరు? రజాకారు దుండగీండ్రకు నిజమైన నాయకుడు రజ్వీ ఒక్కడే అని అప్పుడే నిశ్చయంగా అనుకోడం సాహసం కాదని మాత్రం ఎవరు ఋజువు పరచగలరు? నవాబు మూర్ఖుడో, నవాబు మోసగాడో, నవాబే గత సంవత్సరపు దురాగతాలన్నిటికి రజ్వీతో సహా బాధ్యత పంచుకోవలసినవాడో పూర్తిగా విచారిస్తే తప్ప నిర్ధారణగా తేల్చుకోవలసిన విషయమేనా?

ఏ దెట్లైనా, కాసిం రజ్వీ సజీవంగా భారత ప్రభుత్వం చేతిలో బందీగా చిక్కడము మాత్రం శుభసూచకం రజ్వీని లాల్ ఖిల్లాకు చేర్చి ప్రాడ్వివాకుల ఎదుట విచారణకు నిలబెడితే, ఈ నవాబు పేచీ యొక్క ఆంతర్యం పూర్తిగాక కొంతైనా బహిరంగానికి వచ్చి, నిజాం నవాబు గతవత్సరపు దుశ్చరిత్రకు కీలకాన్ని విస్పష్టము చేయగలుగుతుందని ఊహించవచ్చును

భారత ప్రభుత్వం ఇందుకే ప్రస్తుత కాలంలో ముఖ్యంగా చేయవలసిన సైనిక విషయక, పాలన విషయకములైన బందోబస్తులు మాత్రం చేస్తున్నారు. నిజాం షరతులు కోరడం, మనం ఒప్పుకోడం పద్ధతిని అనుసరించడం లేదు. భారత ప్రభుత్వ నిర్ణీతమైన ప్రణాళిక ప్రకారమే ఏర్పాట్లు జరుగుతున్నాయి. అధికారాల పూర్తి సమాలోచన మీదనే ప్రజాభీష్ట ప్రాధాన్య సిద్ధాంతాన్ని అనుసరించే భావి చర్యలు నిర్ధారితం అవుతాయి

నెహరూ ప్రధానియొక్క సముచితమైన జాగరూక వాక్యాలలో అంతర్గతమై ఈ భావాలు, సమస్యలు, సంకోచాలు, సూచనలు అన్నీ తొణికిసలాడి తొంగి చూస్తూనే ఉన్నాయి. పటేలు భల్లూకపు పట్టులోనే నవాబు పతనమైనా ప్రాధేయపడినా ఒకే రీతిగా భావించి, ప్రజా శ్రేయస్సునే ప్రధానంగా పాటించే భవితవ్య నిర్ణయసూత్రం ప్రస్ఫుటంగా ప్రతిఫలితమవుతూ వుంది.

"విశ్వేశ్వర్"

# "మ్యూజింగ్స్"

"చలం"

ప్రతి సాయంత్రం బిచ్చగాళ్ల సత్రంలోంచి వెళ్లాలి. వాళ్లు వేషాలు కడిగేసుకుని తీరికగా మిరపకాయలు నూరుకుంటో, అన్నం వొండుకుంటో, దిగులుగా కబుర్లు చెప్పుకుంటో వుంటారు. రోజూ మొహాలు మారుతో వుంటాయి కూడాను. మొన్న చప్పున, నన్ను చూసి, ఇద్దరు మీసాలు వాళ్లు లేచి నుంచుని నమస్కరించారు. దేశంలో నమస్కారాలు ఎక్కువౌతున్న ఈ కాలంలో నమస్కారాన్ని చూసి, ముఖ్యంగా బిచ్చగాళ్ల నమస్కారాన్ని చూసి ఆగవలసిన పనిలేదు. ఆగామా, డబ్బు లడుగుతారని భయంకూడా వుంది. నమస్కారం తెలుగు దేశాచారం కాదనుకుంటాను ఎప్పుడో ఏ గౌరవనీయుణ్ణి చూసి నమస్కరించే వారు. ఇప్పుడు ఇంగ్లీషు నమస్కారాలు పోవడంతో, వాటిబదులు ఎక్కడ చూసినా నమస్కారాలు పేలిపోతున్నాయి. ముఖ్యంగా నాగరిక స్త్రీలలో- రోడ్లమీదా, ఉత్తరాల్లోకూడా. నేను వెళ్లిపోవలసిందే, కాని వాళ్లిద్దరూ మామూలు బిచ్చగాళ్లమల్లే లేరు. ఏదో కొంత జ్ఞానవుంది మొహాల్లో. అని 'ఏమటి?' అన్నాను. అంటే నాకు లేచి నుంచుని నమస్కరించవలసిన అవసరం ఏం కలిగిందని! వాళ్లు—

"జన్మ అంటే మీది. బతికితే అట్లా బతకాలి. అంతేగాని తక్కిన జన్మలు ఎత్తేం ఎత్తకేం?— నాస్తో వుంటాము మీరిట్లా 'వెముతో వుండడం'" అన్నారు.

నాదేం ఈర్ష్య పడవలసినజన్మకాదనీ, నాకన్న ఒకవేళ-వాళ్లకే, ఎక్కువ డబ్బువుండవొచ్చుననీ. వాళ్లనీ కుటుంబరావుగారినీ నిరుత్సాహపరచడంలో ఉపయోగం నాకు కనపళ్లేదు. (నేను ధనవంతుణ్ణని ఎక్కడో రాశారుట కుటుంబరావుగారు. రాశారో లేదో ఇంతకీ.)

అయినా నా వేషంలో ధనం చూసివుండడానికి వీలులేదనుకుంటాను. నన్నంతా దోచుకున్నా రెండురూపాయలు రావు. ఏదో మోసం వుందనుకుంటాను వాళ్లో.

ఓసారి గాలి కేతాచార్యులుగారు నాకు జాతకం చెప్పారు. "మీది వుత్త మోసపుజాతకం. అంటే మీకు లేనివన్నీ వున్నాయనుకుంటారు మనుష్యులు" అన్నారు. మరి నా జాతకం పనిచేసిందో, మొత్తానికి వాళ్ళిద్దరికీ నేను 'ఎన్వియబుల్' అయినాను ఆ సాయంత్రం.

"మీరేం చేస్తారు?"— అని అడిగాను.

"మేమా! మేము పాటలు పాడుకుంటో అడుక్కుంటాము. ఏం బతుకు లెండి? అడివినించి అడివికి, వూరునించి వూరుకి, ఉన్నచోట అరపూట నిలవకుండా తిరుగుతో వుంటాము. మావీ ఏం బతుకులండి?" అన్నారు.

"ఊరినుంచి ఊరుకి, అడవినుంచి అడివికి" అని అంటోవుంటే, కలలో పడి గెంతుతోంది నామనసు ఏవేవో అందాలు అల్లుకుంటో. అసునాన్నే నేమో వాళ్లు అంత నాలో ఇష్టపడ్డది మరి! కాని వాళ్ళిద్దరితో వెళ్లగలిగితే! నాకే ఆ ఆరోగ్యం విధి ప్రసాదించినట్లయితే! కాని ఏమాటలవల్లా వాళ్లకి నేననుకునేది అర్థం చెయ్యలేను. నిజమే వాళ్ళకి పూర్తిగా తిండి వుండదు గావును. కాని చాకలి బట్టలు ఇరవై రోజులనాకా ఇవ్వకపోవడం, గడ్డం చేసుకుంటో ప్రతిరోజు కోసుకోవడం, ఎప్పుడూ భయపెడుతో దూకమంకించే తలనొప్పి, ఎన్నడూ విడువని హృదయ అశాంతి- ఇవేమీ లేవు వాళ్ళకి. పైగా నాజీవితమే ధన్యమంటారు.

కాని- అబద్ధంగానైనా ఇంతోరు నన్ను చూసి ఈర్ష్యపడడం రుచికరంగానే వుంటుంది. "సోమర్సెట్ మాఘమ్" గావును, ఎన్నడూ ఎవరినీ విడవని మనోజాడ్యం 'వా(్య)సిటీ' అంటాడు. 'వా(్య)' అని తెలుగు రాయగల కొత్త అచ్చుని మీ ముద్రాలయంలో నిర్మించలేరా? ఇన్నిమార్పులు జరుగుతున్నాయి. అ-కి ఏ-కి మధ్య పలికే అచ్చునీ, f శబ్దం పలికే హల్లునీ చేర్చలేకుండా వున్నారు, ఇంతమంది భాషాసంస్కర్తలు. వీటి సాజ్ఞల్ని నిర్ణయించేందుకు కొందరు ఆంగ్లోత్తముల స్పెషల్ కమిటీని నియమించకూడదా ప్రభు

స్వం! కాకపోతే ఆంధ్రరాష్ట్రపు ఎల్లలు నియామక మయిందాకా ఇదీ ఆగవలసిందేనా?

పూర్వం హాస్టల్లో పప్పు వుడక్కపోతే
'స్వరాజ్యం రానీ' అనేవారు.
ఇప్పుడు 'ఆంధ్రరాష్ట్రం రానీ' అంటారు గావును.

ఎవరైనా మెచ్చుకుంటే సంతుష్టి పడకుండా వుండడం మానవాతీతం అనుకుంటాను—ఏ భగవాన్‌కో తప్ప. నన్ను చూడవొచ్చిన వాళ్లు ఏవో మాటలు చెప్పి వూరికి వెళ్లిపోతో వుంటే, 'కొంచెం హారతి ఇచ్చి వెడుదురూ' అని యేడుస్తుంది మనసు. మొన్న హారీన్‌కూడా ఇదే రాయడం చదివాను. సింహాసనంమీద కూచోపెట్టడం, పువ్వులతో పాద పూజ చెయ్యడం, ఏనుగమీద వూరేగించడం, పెద్ద పెద్ద ఉపన్యాసాలు ముఖాముఖే ఇయ్యడం- ఇవన్నీ బాగానే వుంటాయి. కాని మర్నాటినించి మాసిన చొక్కాతో, ఓ సంచి చేత్తోపట్టుకుని- రైళ్లల్లో, బస్సుల్లో మన కవిత్వం సంగతి విననీ, వినినా లక్ష్యపెట్టని మూర్ఖులతో తొక్కిస లాడవలిసి వొస్తుంది కద! ఇంక దిగ నవసరంలేని పద్ధతిని సింహాసనం, గజాసనం, ఇంకే ఆసనమైనా నా కభ్యంతరంలేదు, కూచునే అడుగున పల్లేసు కాయలు లేకపోతే చాలు.

చాలా ఆత్రుతగా చదివాను హారీన్- 'లైఫ్ ఆండ్ మైసెల్ఫ్' బావుంది. 'కాని హారీన్ రాశాడని తెలుసుకున్నప్పుడు 'ఇంతేనా బావుంది?' అని పించింది. హారీన్నిగురించి రాయగలిగినంత బాగా ఎవ గను అతన్ని. కాని బాగా ఎరిగివుంటే రాయుకనే పోదునేమో? నే నేమనుకుంటానంటే, ఆ మనిషే కళ. కళని తననించి వేరుచేసి చూపడం అతనిలో కొంత బలవంతం—ఇది అతని వచనానికే కాదు- కవిత్వానికి, గానానికి, నటనకి, నాటకాలకి కూడా అన్వయిస్తుంది. ఠాగూరు కైనా కొంత కళా వాతావరణం అవసరమయ్యేది. కాని హారీన్ దుమ్ములో పడినాకూడా కళా మయుడు. అందువల్లనే రాసి, దాన్ని కట్టిపాస్తే ఠాగూరు ముందు హారీన్ ఏమీకాడు. ఠాగూరు దేనిమీదనన్నా చెయ్యిపెట్టాడా అది కవిత్వమై పోయింది. కాని హారీన్ చెయ్యి కవిత్వం. అందు వల్ల హారీన్ పట్టుకున్నది చాలాసార్లు రాణించదు.

కొంచెం మాయన కప్పితేనేగాని వృత్తవాస్తవం ఎప్పుడూ కళకాదు. హారీన్‌లో కళని మింగే 'సేకెండ్ సిన్సియారిటీ' ఎక్కువౌతుంది చాలా సార్లు. వాతావరణంలో దుమ్ము అణువులు లేక పోతే, ఆకాశాన రంగులే లేవు.

అందంలేనివాళ్లు ఫొటో తీయించుకోడం అప రాధ మనుకుంటాను. అందం అంటే ఏమిటనే తర్కం వొదిలి, అందం అంటే చాలా విశా లార్థంలో తీసుకోవాలి. ఆ అర్థంలో నాకు గాంధి గారు, భగవాన్ ఇద్దరూ అందం. ఓసారి అరుణా చలం ఆశ్రమంలో డన్‌కన్ గ్రీన్లీస్‌గావును అంటున్నారు-

"నా చెల్లెలు ఇండియాకి వొస్తానంటోంది. ఇండియాలోకల్లా గొప్పవాళ్లు అని, నేను దిగం బరులై అందంలేని గాంధీగారినీ భగవాన్ నీ చూపిస్తే, ఏమంటుందోనని."

నాకు భగవాన్‌కన్న అందం ఎవరూకారు.

పోనీ అందవికారమైనా, ప్రత్యేకంగా మన వికృతాకారాన్నే ప్రేమించేవారన్నా వుండాలి, ఫొటో తీయించుకునేందుకు. ప్రపంచంమీద ఈ నాటివరకు 'నే నందవికారం' అని అనుకున్న మనిషి లేరన్నారు లీలగారు.

ప్రఖ్యాత నాయకుడో, గాయకుడో, రచయితో ఎట్లా వుంటాడో చూడాలని మనిషికి కోరిక వుండవొచ్చును. ఆ వుండడంకూడా ఆలో చన లేని సంగతేనంటాను. ఎట్లా వుంటేనేం? కావలిసింది గానమూ, రచనా.

ఓసారి లిసెనర్ (రేడియోపత్రిక)కి రాశాము- నేనూ, సౌరిస్ కొన్ని కట్టింగ్సు పంపించి.

"మీ పత్రికలో వేసే ఈ మొహాలుగల మనుషులు నిజంగా వున్నారా? మీరు కల్పించి వేస్తున్నారా? నిజంగా వుంటే, వాళ్లు ఫొటోలు వేయించుకోడా నికి వొప్పుకున్నారా?" అని.

నల్లసిరాముద్దగా అచ్చుపడ్డాసరే, కింద తన పేరు పడితే చాలు కొంత సంతోషం తప్పదనుకుంటాను —గొప్ప నేరాలు చేసి మరణదండన పడ్డవారికైనా సరే.

దేశాన్ని ఇట్లా ఉబ్బించడం ఎందుకో అను కుంటాను. మనిషిలో పుట్టే ఉబ్బే, దేశానికికూడా పడుతుంది గావును. ఎంతవరకు వీలైతే అంతవరకు మనిషి ఉబ్బడానికి చూస్తాడు. ధనంలోనో, జ్ఞానం లోనో, అధికారంలోనో, నమ్రతలోనో, సద్గుణాల లోనో, పాతివ్రత్యంలోనో, దేశభక్తి మానవసేవ

లోనో. ప్రత్యేకంగా తాను 'నేను' అంటాడు. ఈ ప్రత్యేకమైన 'నేను'ని తగ్గించాలని చూచే దేశాలు, దేశాన్నే ఒక 'నేను'ని చేసి దాన్ని ఉబ్బిస్తాయి. చివరికి-దయ్యాంబయ్యోను స్వేచ్ఛా భారతి, దయ్యాంబయ్యో నమో-అవుతుంది.

ఎక్కడ విన్నా ఇప్పుడు స్వేచ్ఛా గీతాలే. కాని ఒక్కటైనా హృదయంలోంచి పలికినట్టు వినిపించదు. స్వతంత్రం అనేప్పటికి పేరుపడ్డ కవులందరూ ఋషులదగ్గరికిపోయి, వాళ్ల విజ్ఞానం, వాళ్ల సంతతివాళ్ళం అని పాడతారు. ఈ కవులకి ఆ ఋషుల పేర్లయినా సరిగా రావు. ఆశ్రమాలూ, ధూమాలూ, ఋక్కులూ అని పాడతారు. కొత్త కవులు ముందుకాలానికి వెళ్ళి - భూమికలూ, శ్మశానాలూ, మంటలూ, రక్తాలూ అంటారు. ఆవిప్లవమేదో వచ్చిననాడు అది శాంతంగా మామూలుగా ఆహ్లాదంగా రావడానికి వీల్లేదు. ఈవిపత్తనప్పు మహాకాళి విజృంభించి ధనికులందరి రక్తాన్ని పీల్చేసి శ్మశానం చేస్తుంది ఈ భూమిని - అని ఓ గీతం రాసేసి కాఫీతాగి నిద్రపోతాడు ప్రళయకవి. తరవాత అతని సంగతి మనకేమీ తెలీదు. ముఖ్యం ధనికవర్గం, పాలకవర్గం, మతవర్గం నశిస్తుంది ఆ మహా ప్రళయంలో. వీళ్లు భవిష్యద్వక్తలు. ఋషుల సంతతివారు భూతకవులు. వర్తమాన ప్రేమకవుల ప్రభ తగ్గిపోతున్నట్టుగా వుంది. అంతేకాని ప్రస్తుతపు స్వతంత్రం పాడే కవులకి ఇన్‌స్పిరేషన్ చాలా తక్కువగా కనిపిస్తుంది. ఎటు తిరగేసినా ఓ గాంధీగారే దొరికారు. ఏదో రికార్డులో ఇంకేం లేకగాక, కీచుమని గాంధీ ఈ ఈ ఈ— అని నొక్కిలేస్తుంది ఆ పాడే ఆమె.

ఈమాతలు ఎంతమంది ఎక్కువైపోతున్నారని? భారతమాత-రాజకీయపరిస్థితులవల్ల ఆమె ప్రభతగ్గింది. గట్టిగా అనడానికి సిగ్గుపడుతున్నారు. ఇండియా పటాన్ని ఓ మాతగా చిత్రించిన చిత్రకారులకి చాలా ఇబ్బంది కలుగుతోంది ఇప్పుడు— వర్ణించే కవులకికూడా. అనంతకోటి తన శిశువులకి స్తన్యమిచ్చే ఆ మహామాత క్షీరస్తానాల విషయం తగాదాలో పడింది. తరవాత ఆంధ్రమాత. ఈమెనంతా అతికించి ఓ రూపమిచ్చి ఆరాధించాలని చూస్తున్నారు ఆమె పుత్రులు. ఈలోపల ఆమె పూర్వంకన్న వీరుల్ని, రాజుల్ని, కవుల్ని కీర్తిస్తో ఎన్ని పద్యాలు రాసినా-ఆమె సరిగా ఏ భాగానికా భాగం అతుక్కోటంలేదు. అంతే కాకండా నదీమాతలున్నారు, గోమాతలున్నారు - ముగురమ్మలున్నారు అందరికన్నా పైన, అప్పుడప్పుడు సినిమాల్లో చేతులు వూపుకొంటూ దర్శనమిస్తో. అందరికంటే గొప్పది భూమాత. ఇందరు మాతలున్నా వాళ్లెవరూ ఎక్కువగా ఈ స్తోత్రాలూ, అరుపులూ వింటున్నట్టు లేదు. అదిగాక మనుష్యుల్లోనే అక్కడక్కడ ఒక్కరు ఈ మాతల స్థానానికి ఎక్కుతో వుంటారు. భర్త ప్రజలకి తండ్రి కావడంవల్ల, అతనిభార్య మాత కావొచ్చు. కాకపోతే ఆమె వొక్కత్తె మాతగా మారవచ్చు. ఈ మాతలు లేకపోతే కవిత్వానికి తీరని లోటు వాటిల్లుతుంది. దేనికైనాసరే 'మాత' అనేమాట తగిలిస్తే ఇంక ఎవరూ నోరెత్తడానికి వీల్లేదు. ఈ మాత అనే మాటకి ఎందుకు విలవ వచ్చిందో ఆశ్చర్యం వేస్తుంది. ఆ మాటలో చాలా మోసం వుంటేనేగాని ఇంత విపరీత ప్రచారంలోకి రాదు. యువతీ యువకుల మధ్య 'అక్క, అన్న, చెల్లీ' అనే పదాలు ఎన్ని వ్యభిచారాల్ని చాలా సురక్షితంగా కప్పుతున్నాయో! అట్లానే 'మాత' అనగానే ఆ మృగాన్నిగాని మనిషినిగాని నాలుగు గజాల పైకి ఎత్తివేయవొచ్చు.

మాతృత్వం వృత్తి సహజాతం. పురుగుల్లో పక్షుల్లో, మృగాల్లో, మనుషులకన్నా కూడా ఎక్కువ బలంగా పనిచేస్తుంది. దానికి మహిమల్ని ఆపాదించి, గాలిపోసి వుబ్బించి, ఏదన్నా భక్తికి తీసుకురావాలంటే, దానికి మాత పదం తగిలించి, ఇంత మోసం పుచ్చుతున్నారు. ఈ తలితండ్రులు పిల్లలమీదవేసే పన్నాగాలు చూస్తే, ఇంకే విషయంలోనన్నా ఇంతఘోరం జరుగుతుందా అనిపిస్తుంది. తాము కన్నందుకు, పెంచినందుకు, కొంతశ్రమా కాలమూ ధనమూ ఖర్చుచేసినందుకు, ఎన్నివిధాలైన సెంటిమెంటల్ వురులు వాళ్ళచుట్టూ. ఆస్తికలవాళ్లు, ముఖ్యం స్వార్థితులు, ఇంక ఆ జన్మాంతమూ వాళ్లని బెదిరించి, వాళ్లభార్యల్ని, పిల్లల్ని, తమ అధీనంకింద వుంచుకుని వూపిరాడనీరు. 'తల్లీ తండ్రీ' అనగానే వాళ్లుపెట్టే నరకాన్ని ఇంకోరితో ఫిర్యాదు చేసుకునే సుఖంకూడా వుండదు. అవును మరి. వాళ్లు భూలోక దేవతలు. కన్నారు, పెంచారు. ఈ తల్లులవల్లనే కదా.

కాలక్షేపమనేది ఇంత సాధారణమైపోయింది. పోనీ తాము స్వేచ్ఛను పొందిన నాగరిక స్త్రీలలో ఈ ధూర్తత్వం తగ్గిందంటారా? అదీ కొత్త రూపాల్ని పొందింది. ఉరితాడు కనపడనంత నాజూకయింది. దానికి బంగారు పూత. ఏ ప్రభుత్వమో కనికరించి పిల్లల సంగతి చూడకపోతే, ఇంక క్రమంగా స్వతంత్రత పొందుతున్న స్త్రీ జాతి నించి వారిని ఎవరూ రక్షించలేరు. నేను చదివిన ఓకథలో చాలా గొప్ప ఘట్టంవుంది. ఆమె కోటీశ్వరుడికి ప్రియురాలు. సంపూర్ణ స్వతంత్రం ఆమెకి. హోటళ్లు, షాపులు, డాన్సులు, అన్నీ ఆమెకి గొప్ప విహారస్థలాలు. ఎంతో ఖరీదుగల బట్టలు, నగలు. కాని అన్నీ బిల్లులు. అన్నీ భీమా ఐనాయి. చెక్కు బుక్కుమాత్రం లేదు ఆమెకి. అంటే అనుభవంతప్ప, కానీ పుట్టదన్నమాట. చాలా మంచి పిల్లలగతీ ఇదే.

ఏ ప్రభుత్వ పద్ధతో ప్రతి వ్యక్తి ఆర్థిక విషయాన్ని తానే తీసుకుని, యీ బానిసత్వాలనించి పిల్లల్నీ, వృద్ధాప్యంలో పిల్లల స్వార్థాలనించి తల్లిదండ్రుల్నీ రక్షిస్తుందేమో ననుకుంటే, ఈ ఉచ్చులన్నింటినీ ఆ ప్రభుత్వం చేతపట్టుకు కూచుంటుంది. కూచుంటేనేగాని ఆ ప్రభుత్వానికి నాలుగునాళ్లు నిలిచే యోగ్యత వుండదు.

ఇన్ని తీరని ఇబ్బందుల్నీ, ఇవి ఎందుకు ఉండాలని పోట్లాడుతాను గాని, జీవితమనేది చాలా గొప్పసంగతి. చివరి తూనికలకి వొస్తే సుఖం, దుఃఖం కన్న ఎన్నో రెట్లు. హక్కు సినిమాలో ఎన్ని అరుపులు అరిపించినా ఎప్పుడో ఒకప్పుడు నాయుడుగారి ఫిడేలో, సుబ్బలక్ష్మి ఝుంగుమిరల దానో అనే రికార్డూ పెడుతూనే వుంటారు పాపం. నిన్న రాత్రి తిన్న చేపలపులుసు, దాన్ని తినేందుకే ఈ జన్మ ఎత్తితే నేమనిపించింది. ఎప్పుడూ కనుమరుగు గాని ఆకాశం, ఎక్కడ చూచినా గడ్డిలించి, ములగచెట్టువరకు విరగపూసే పువ్వులు, ఒకప్పుడు ఉక్కపెట్టినా, ప్రియురాలి హస్తాలమల్లే తాకి ముద్దుచేసే గాలి, ఉచితమై ముంచే యీ ఎండ, అప్పుడప్పుడు ఏ పుంతల్లోనో కనిపించే అందమైన పశుపుతీరు, పక్షుల రెక్కల పూపు, పురుగులమీది నత్తగుల్లలమీది వర్ణాలు, రీలంగారి కళ్ళనించి వెలుగులచూపు, ఏ దూరాన్నించో హృదయంతో పలకరించే ఓ ఉత్తరం, కారణం లేకండా నన్ను చూసి నవ్వించే పాపాయి చిరునవ్వు... ఎంత అందం జీవితం!

సన్మానాల్ని చూస్తే నాకు కోపంగాని, ఒకే మనిషిలో ప్రజలు అట్లా ఐపోవడం అర్థమౌతుంది. భగవాన్‌ని తలుచుకుంటే నేనట్లా అవుతాను. 'ఏం చెయ్యలేనా? నా కృతజ్ఞతా భారాన్ని ఏవిధంగానూ తీర్చుకోనేలేనా' అని కొట్టుకుపోతాను. టాగూరుగారి కవిత్వంఏనాడూ నన్నట్లా చేస్తుంది. ఈవూరి మిషన్ ఆస్పత్రి లేడీడాక్టరిమీద అప్పుడప్పుడు ఆవిధంగా అవుతుంది నామనసు.

చివరికి నన్ను చూడవచ్చేనా 'ఫా(వ్ర)న్స్'లో కనపడుతుంది నాకు. ఒక్కొక్కరు అనేస్తారు కూడాను. "మీ పుస్తకాలవల్ల మాకెంత ఉపకారం జరిగింది. మేము మీకు చెయ్యగలిగింది ఏదీ లేదా?" అన్నది. నాకు కనపడకుండానే ఏ చిన్న వార్తద్వారానో. ఏ చిహ్నం ద్వారానో తెలుపుతారు నన్ను కలుసుకోలేని వాళ్లు... ఏం చెయ్యం మీకింతకన్న! అని. ఈ విధంగా, ఎంతో గొప్ప వేదనతో గాంధిగారి విషయమై ఐపోయిన మనుషుల్ని ఎరుగుదును. ఆయన ప్రత్యేకం ఓ మనిషికని చేసిన ఉపకారం ఏమీ ఉండీ వుండదు. కాని ఆ వైరాగికి ఏం చెయ్యగలం. ఆయనకి కావలసింది ఏముంది? ఏమిస్తే నానించి ప్రత్యేకంగా ఇది జరిగిందని ఆయన గుర్తించగలడు? అనే వేదన. చాలామంది సత్యాగ్రహం చెయ్యడం, జైళ్లకు వెళ్లడం, దెబ్బలు తినడం దేశభక్తికై కన్న గాంధిగారి ప్రీత్యర్థమే చేశారని పిస్తుంది. ఆవిధంగా ఓ కవివల్ల ప్రజలైనప్పుడు, ఇంకే విధంగానూ చూపలేక, అతన్ని భుజాలమీద మోసినా గొప్ప అందమౌతుంది. నేనెన్నడూ ఏ సన్మానాన్నీ చూడలేదు గాని, యీ నాయకులకీ, తక్కిన ప్రముఖులకీ జరిగిన మర్యాదల విషయం పేపర్లలో చదివినప్పుడు, ఆ ఆహ్వానాలు నాకూ వొచ్చినప్పుడు, చాలా జాలీ అసహ్యం పుడతాయి. మరి ఆ సన్మానాలే అట్లా జరుగుతాయో, పేపర్లో రిపోర్టు అంత సవ్యంగా చేస్తారో!



# సామాన్యుని సందేహాలు

అనవసరమయిన సంభాషణ దురభ్యాసమనీ, ప్రస్తుతమూ, పరిమితమూ, అవసరమూ అయిన సంభాషణ సజ్జన లక్షణమనీ, మనవాళ్ల అభిప్రాయం. అనవసరంగా, అవసరంలేని విషయాలను గురించి తమర్ని వాగ్వాదంలో దింపేవారిని, "డబ్బారాయుడు, చాటర్ బాక్స్" అని చాటునో, వీలయితే మొఖమ్మీదో అనేయడం మధ్య జాతి సామాన్యులకూ బుద్ధిమంతులకూ నైసర్గికలక్షణం అయిపోయింది. తన వ్యాపారంలో-ఎవడెవాడికి టోపీపెట్టి అయినాసరే-ఎల్లా లాభం వస్తుందని తాపత్రయంపడే వర్తకుడూ, తన సెలజీతం యెల్లా పెరుగుతుందనే తాలూకా గుమాస్తా, తన సంసారం ఎల్లా బాగుపడుతుందనే కుటుంబీకుడూ, తమ సన్నిహిత పరిసరాల్నీ, పరిస్థితుల్నీ తమ కెంతగా వుపయోగించుకోవడానికి వీలవుతుందో చూస్తారేగాని, ఆ పరిస్థితు లిల్లా వుండడానికి, మూలకారణాలేమిటో యోచించరు; చర్చించరు. ఎవరయినా తమర్ని అటువంటి అనవసర చర్చలోకి దించితే, చికాకుపడి, అసహ్యించుకుంటారు కూడా! ఇది నేటి సామాన్యుడి ముఖ్యలక్షణం. తమ జీవితంలో లోపాల్నీ, తానుచేసే పొరపాటులకూ కర్మసిద్ధాంతానికి ఆరోపించి, చాలామంది చేతులు కడుక్కుంటారుకూడా!

కర్మ సిద్ధాంతంలో నాకున్న విశ్వాసం, చాలా కొద్దిమందికి మాత్రమే ఉంటుంది. ప్రకృతిశాస్త్ర సూత్రాలకు చాలా సన్నిహితమయిన మత సిద్ధాంతాల్లో కర్మ సిద్ధాంతం వొకటి. న్యూటన్ పండితుడి మూడో సూత్రంలో 'యాక్షన్' అంటే కర్మ అనుకుంటే, మనంచేసే ప్రతిపని ప్రతికర్మ-రియాక్షన్-అనుకుంటే కర్మ సిద్ధాంతం కేవలం వైజ్ఞానిక మవుతుంది. ప్రతికర్మ కర్మ నధిగమించినప్పుడు ప్రాపంచిక విజయం కలుగుతుంది. కానప్పుడు అపజయం కలుగుతుంది. కాని యీ జయాపజయాలు కొందరికే, ఒకరి జయం మరొకరికి అపజయం. నైజాముమీద దండు నడిపి, మన ప్రభుత్వంకర్మనెరపింది. తత్ఫలంగా మన విజయం. నైజాం అపజయం. ఇందుకు కారణాలు వాటికి కారణాలు. ఆ కారణాలకి కారణాలు తరిచిన కొద్దీ కనబడి, మనలను సృష్ట్యాదికి తీసుకునిపోతవి. సృష్ట్యాదిలో ఆదికర్మకు ఎవరు కారకులు, ఏది కారణం అనేది వేదాంతులు తేల్చలేదు. తేల్చవలసినపని లేకుకూడా! ఒకవ్యక్తి కోటీశ్వరుడుగానూ, ఒకదేశం సర్వసమృద్ధంగానూ ఉండటానికీ, మరొకడు దరిద్రుడుగానూ, మరొకదేశం దరిద్ర భూయిష్ఠంగానూ వుండడానికి ఒకవ్యక్తి యొక్కా జాతియొక్కా కర్మకారణం. ప్రతికర్మ లేని కర్మలేదు. అది శాస్త్రీయంగా అసంభవం. కర్మ సిద్ధాంతాన్ని విశ్వసించినవారు, ప్రతి కర్మ సిద్ధాంతాన్నీ విశ్వసించితీరాలి! అంటే ప్రతివారూ కర్మ చేయాలని విశ్వసించి తీరాలి.

మనిషి ప్రగతికి కర్మ ప్రధానం. వ్యక్తుల కర్మలుచేరి జాతుల కర్మ లవుతవి. ప్రాపంచిక యుద్ధాలూ, సమస్యలూ అన్నీ కర్మమీదనే ఆధారపడుతున్నవి. జిన్నా కర్మ చేయకపోతే ముస్లిం లీగూ లేదు, పాకిస్థానూ లేదు. కాశ్మీర యుద్ధమూ లేదు. అట్లాగే హిట్లరు కర్మ లేకపోతే ఆధునిక ప్రాపంచిక చరిత్రలేదు. ఇవే గీతావాక్యములకు అర్థమని నాకంటె సామాన్యులు అనుకుంటారు. ఆ కర్మ కర్థం తైత్తిరీయ కర్మ కాండలో చెప్పిన కర్మలని అర్థం చెప్పి, మన మతగురువులు, మనలను యీ స్థితికీ, తమర్ని తమ స్థితికి తెచ్చుకున్నారు. అది వారికర్మ, ప్రతి కర్మ. ప్రమేయం లేకుండా స్తబ్ధులై వూరుకోడం జీవితానికి లక్షణం కాదు. అల్లా వూరుకోడం కర్మ సిద్ధాంతానికే అపచారం. ఈ విధంగా కర్మ సిద్ధాంతాన్ని అవగతం చేసుకున్న వ్యక్తికి దేవుళ్లూ, సత్యనారాయణ వ్రతాలూ, బక్రీదులూ క్రిస్మసు పండుగలూ, వుండవు. ఆవ్యక్తికి స్థావర జంగమాత్మకమయిన ప్రపంచాన్నే ఒక కర్మక్షేత్రంగా భావించి ప్రాపంచిక వస్తువుల్లో తానొక భాగంగా ప్రపంచమే తన

నివాసంగా భావించి, ప్రపంచాభివృద్ధికే తన కర్మని వినియోగిస్తాడు. అతడే సిసలయిన వేదాంతి. అటువంటి వేదాంతమే జవహర్లాలువంటి వారి కర్మకు మూలాధారం, చలనహేతువు అవుతున్నది.

జంతుకోటిలో అత్యభివృద్ధి పొందిన మనస్సు వాక్కు క్రియల ద్వారా కర్మ చేయడం జరుగుతోంది. నోరులేని జంతువుకు వాక్కు లేదు. మరి తరంగికి మనస్సూ లేదు. వాక్కూ లేదు. కాని అవికర్మ చేస్తూనే వున్నవి. ఆ కర్మలన్నీ మరొక కర్మకి ప్రతికర్మలే!

కర్మ ఒక వ్యక్తికీ, ఒక తరానికీ చెందింది కాదు. అది ప్రపంచకం అంతటికీ చెందింది. తరతరాలకు చెందింది. కర్మల ఫలితాలు ఒక నాటితో ఆగిపోయేవి కావు. కర్మకు ప్రతి కర్మ దానికి ప్రతికర్మ. యిట్లే కర్మఫలితం ముందుకు సాగిపోతూ వుంటుంది.

మనదేశం అన్ని దేశాలలోకీ దరిద్ర దేశం, మనదేశంలో దరిద్రులు అన్ని దేశాల్లోకీ పెద్ద దరిద్రులు కావడం మనదేశీయులూ అన్యదేశీయులూ అనంతంగా చేస్తున్న కర్మలకు ఫలితమే. ఆ స్థితిని తొలిగించడానికి, అభివృద్ధి చెందడానికి మనం కర్మ చెయ్యాలి; అంటే ఆలోచించాలి; చర్చించాలి; పని చెయ్యాలి. సద్యోఫలితం వ్యక్తిగతంగా లేని, ఏ విషయాన్ని గురించి అయినా, ఆలోచించడం, చర్చించడం దురభ్యాసంగా పరిగణించడం మానెయ్యాలి.

మన ఆర్థిక స్థితికి, ప్రపంచ ఆర్థిక స్థితికీ అవినాభావ సంబంధం ఉంది. ఎంతకాలం ఒకదేశ ఆర్థిక సంపద అన్యదేశంమీద ఆధారపడుతుందో అంతకాలం ప్రపంచంలో ఏదో ఒక దేశం ఏదో జాతీ దరిద్రంతో బాధపడక తప్పదు. వ్యాపార రీత్యా భారతదేశాన్ని కొల్లగొట్టి ఇంగ్లాండు ధన సమృద్ధ మయింది. అందుకు భారతీయులు కర్మ చేసి, స్వతంత్రం సంపాదించుకుని, తమ వ్యాపారము వృద్ధి చేసుకుంటే మళ్లీ దరిద్రంలో కృంగిపోతోంది. అందుచేత మన ఆర్థిక అభివృద్ధికి మనం చేసే కర్మ మరొక దేశానికి దరిద్రం ఇచ్చేదిగా వుండకూడదు. మరొక దేశమ్మీదా మరొక జాతిమీదా, ఆధారపడకుండానే, మన ఆర్థిక సంపద అభివృద్ధి చెందేటట్లే మనం కృషి, కర్మ చెయ్యాలి. మన సౌకాదళం అభివృద్ధి చెందాలి. దానితో మనం విదేశాలతో వ్యాపారంచెయ్యాలి. మన వస్త్ర పరిశ్రమ అభివృద్ధి కావాలి. మనం విదేశాలకు యెగుమతి చెయ్యాలి, అనే ఆర్భాటం సమంజసమయింది కాదు. ఆవిధమైన అభివృద్ధి, విదేశాలలో లేమిమీదనో, అభివృద్ధి లేమిమీదనో ఆధారపడుతుంది. అందువల్ల వచ్చిన దేశ సంపద యెక్కువకాలం నిలవదు. పైగా అనేక అంతర్జాతీయము లయిన పగలకు, అసూయలకు మనస్పర్థలకు అది కారణం కావచ్చును. ఆ పరిస్థితులలో జవహర్ పండితుడి తటస్థ విధానం సాధ్యంకాదు.

ఇంతకీ, ఆర్థికసంపద అంటే యేమిటి? అది. దేశంలో వున్న బంగారమ్మీద ఆధారపడుతుందా? దేశంలో వున్న కోటీశ్వరులమీద ఆధారపడుతుందా? మరి దేనిమీద ఆధారపడుతుంది?

దేశం ఆర్థిక సంపద మానవ జీవితావసర వస్తు సామగ్రి సర్వజనానికీ సమకూర్చడం మీద ఆధారపడుతుంది. అందరికీ అన్నవస్త్రాలు, ఉంటానికి యిల్లు, విద్య, ఆరోగ్యమూ ఉన్ననాడు, ఆ దేశం సర్వ సమృద్ధ మయిందని, ఆదేశపు ఆర్థిక పరిస్థితి బాగున్నదనీ, చెప్పవచ్చును. వైజ్ఞానిక ప్రవృద్ధికి ఫలితంగా అందుబాటులోకి వచ్చిన నూతన నాగరికతావసరములయిన, కారులు, టెలిఫోనులూ, టెలివిజన్లూ, కెమేరాలూ, పంకాలూ, విద్యుద్దీపాలూ, తదితర పరికరాలూ చౌకగా లభించినప్పుడు సర్వ జనానికీ అనుభవనీయములూ, అనుభవ యోగ్యములూ కావచ్చును. కాని అల్ప సంఖ్యాకులు వీటిని అనుభవించడంకోసం అధిక సంఖ్యాకులు మాడిచావడం, నాగరికతకూ, ఆర్థిక సంపదకూ లక్షణములు కావు.

ఏవి జీవితావసరములు, ఏవి కావు అన్నది వివాదాస్పదమయిన విషయం కావచ్చును. కోటీశ్వరుడి భార్యకు మొఖమల్ చీర అవసరం, ఆయనకు కారు అవసరం. ఆయన కొడుక్కి కెమెరా అవసరము. ధనవంతుడి కొడుక్కి ట్వీడుసూట్లు, సిల్కుసూట్లు అవసరం. మరీ దొరలకు మద్యం అవసరం. కూలివాడికి గుడ్డా చుట్టా అవసరం. అవి దొరికిన్నాడు వేరే అవసరాలు వ్యుత్పత్తి అవుతవి. ఈ విధంగా ఆధునిక కాలంలో జీవితావసరములు 'యివి' అని నిర్ణయించడం చాలా కష్టసాధ్యమే! అయినా ఆ సమస్యా పూర్తికి మనం విజ్ఞానం సహాయాన్నే అర్థించాలి. ఇన్ని కోలరీలు

ఉత్పత్తి చేసే ఆహారపదార్థాలు, యీ యీ పరిమాణాల్లో మానవులకు కావాలని శాస్త్రజ్ఞులు అంచనావేశారు. ఈ యీ లక్షణాలు కలిగిన బట్టలు యీ యీ శీతోష్ణపరిస్థితుల్లో యిన్ని జతలుండాలని అంచనా వేశారు. ఇన్ని చదరపు టడుగుల నేల యిన్ని ఘనపుటడుగులగాలి వ్యక్తికి అవసరమని అంచనా వేశారు. ఇవన్నీ ఉన్ననాడు ఆరోగ సమస్య పెద్ద సమస్యగా వుండదు. కాని రోగసమస్య ఎంత ప్రవృద్ధి సమృద్ధి గల జాతికయినా ఉండేదే. జననం, మరణం - విజ్ఞానం కనుగొన్న కాన్సర్వేటిజమ్ ఆఫ్ ఎనర్జీ ననుసరించే జరుగుతున్నవని నా విశ్వాసం. ఏదో వ్యాధి లేంది, మరణం రాదు. ఏ కారణంచేతనయినా శాస్త్రజ్ఞులు మరణాన్ని జయిస్తే, వారు ప్రపంచ సమస్యలను శతధా అధికం చేసినవారవుతారు. ఆరోగ్య శాస్త్రవేత్తలకు చావు తప్పించడంకన్నా బాధ తప్పించడం, రోగగ్రస్త కాలాన్ని స్వల్పం చెయ్యడం, ఎక్కువ సాధ్యములూ, వాంఛనీయములూ అయిన విషయాలేమో!

అంటే, ఆహారం, దుస్తులు, నివాస ప్రదేశం, విద్య, వైద్య, సహాయం జీవితానికి అత్యవసరాలు. ఈ అవసరాల సరఫరాకే, విజ్ఞానమయినా పరిశ్రమలయినా వినియోగించాలి. అల్లా కానినాడు, విజ్ఞానానికీ పరిశ్రమలకూ మానవాభివృద్ధి దృష్ట్యా ప్రయోజనం లేదు.

ఇన్ని వున్నా ఆత్మానందం, వినోదం జీవితానికి కొంత అవసరం. అవి లేకపోతే చచ్చిపోము కాని, అవిలేని జీవితం, ఆదరువులు లేని అన్నంలాగా నీరసంగా వుంటుంది.

ఈదృష్టితో చూస్తే, మనదేశంలో ఆర్థిక సంపద లేదనే తోస్తుంది. అది దేశంలో వున్న నైసర్గిక లోపమా? కాక మన సంఘ నిర్మాణంలో వున్న లోపమా? అంటే అది చాలా పెద్ద సందేహమే. తన తాతలనాటినుంచీ తన కుటుంబ పరిస్థితుల్ని పరిశీలించుకుంటూ వచ్చిన సామాన్యుడు, దేశంలో నైసర్గిక లోపాలకన్నా సంఘనిర్మాణంలో వున్న నైసర్గిక లోపాలు మన ప్రస్తుత పరిస్థితికి ఎక్కువ కారణాలని భావించడానికి అవకాశం వుంది.

ఈ స్థితికి కారణం ఏమిటీ అని ఆలోచిస్తే, పారతంత్ర్య మంటాడు కాంగ్రెసువాడి. మిల్లు యజమానులంటాడు కూలీ. సమ్మెలంటాడు. కోటీశ్వరుడు. పెట్టుబడిదారీ విధానం అంటాడు. కమ్యూనిష్టు. వర్ణసాంకర్యమంటాడు సనాతనుడు. అజ్ఞానం అంటాడు విజ్ఞాని. ఇందులో ఎవరు చెప్పింది నిజం? వీరందరూ నిపుణుల్లో జమ. నిపుణుణ్ణి నిర్వచిస్తూ ఒక ఆంగ్ల గ్రంథకర్త "తన విషయంకన్నా తక్కిన విషయాల్ని గురించి ఎంత తక్కువగా తెలుసుకుంటే అంత నిపుణుడౌతా" డన్నాడు. వీరందరి సమాధానాలు వాళ్ల కళ్లజోళ్లలోంచి కనబడే దృశ్యాలే! ఒకరి జోడు మరొకరికి యిమడదు.

ఒకప్పుడు విదేశాలకు ధాన్యాలూ, బట్టలూ ఎగుమతిచేసిన మనం యిప్పుడు దిగుమతి చేసుకుంటానికి కారణం ఏమిటి? ఉన్నవాటినయినా అందరికీ పంచలేకపోవడానికి కారణమేమిటి?

ఒక దేశానికి కావలసిన ఆహారం, బట్టలూ ఆదేశంలో వున్న జనాభామీద ఆధారపడవు. ఆ దేశం ఆ వస్తువులను. ఎగుమతి చెయ్యడమో, దిగుమతి చెయ్యడమో - ఆ దేశంలో ఉత్పత్తి అయ్యే వస్తువులు అక్కడ జనాభాకు చాలకపోవడంమీదో, ఎక్కువవడంమీదో ఆధారపడి వుంటుంది. ఎగుమతి చేసినమనం దిగుమతి చెయ్యడానికి కారణం, మన వుత్పత్తి మించిన జనాభావల్లనయినా కావాలి. లేదా, మనదేశంలో వుత్పత్తే తగ్గిపోయి అయినా కావాలి. పత్రికల్లో నిపుణులు చెప్పేది చూస్తే రెండూ జరిగినట్లే తెలుస్తుంది-

"సామాన్యుడు"

# స్టెర్లింగ్ ఒడంబడిక బాగోగులు

టి. జగన్మోహనరావు

ద్వితీయ మహాసంగ్రామము ప్రారంభించినప్పటి నుండి ప్రపంచ ఆర్థిక పరిస్థితులందు చాల మార్పులు వచ్చినవి. మనదేశమునందు కూడ అట్టి మార్పులు కలిగినవి. యుద్ధానంతరము ఏ అమెరికావంటి దేశమునో మినహా యితర దేశము లన్నిటియందును ఆర్థికదుస్థితి యెక్కువయ్యెను. అంతర్జాతీయ వ్యాపారమున కనేక విఘ్నములు కలిగెను. ముఖ్యముగా దిగుమతులపై నాధారపడిన దేశములు ఒక్కసారి తమ ఆర్థిక విషయములను సరిచేసికొనవలసి వచ్చి, అటుల చేయజాలక పోవుటచే కూడు గుడ్డల కరువు మొదలగు నిక్కట్టులకు గురియైనవి. అట్టి దేశములలో ఇండియా ఒకటి.

మనకు ఆహారమునందు కొరత. పరిశ్రమల ఉత్పత్తిసాధనములు లేవు. కాని యీ విషయముల లేశమాత్రము గణించక అప్పటి ఇండియా ప్రభుత్వము యుద్ధమునకు కావలసిన పరికరములను తమ నిమిత్తమునకేగాక, ఇతర దేశములకుగూడ సమకూర్చుటయందు చాలా [illegible] పని చేసినది. మిత్రరాజ్య సైన్యములు ఇండియాను జపానునుండి రక్షించుటకుగాను మన దేశమునందు యుద్ధకాలమున ఉంచబడినవి. ఈ సైన్యములకు కావలసిన ఆహారపదార్థములను సరఫరా చేయుటకును, అందులకు కావలసిన పెట్టుబడినిగూడ అప్పటి కప్పుడు తానే సమకూర్చుటకు ఇండియా ప్రభుత్వము ఒప్పుకొనినది. అవిధముగ మన గవర్నమెంటు దేశములోని బహిరంగ విపణియందు (ఓపెన్ మార్కెట్) కొనుటకొరకు కరెన్సీని ప్రతి సంవత్సరము అధికము చేయుచు వచ్చెను. బ్రిటిషు ప్రభుత్వ మిందుకు బదులుగా స్టెర్లింగును ఇచ్చుటకు ఒప్పుకొనినది. కాని యుద్ధకాలమున మాత్ర మీ స్టెర్లింగు మొత్తమును మన కిచ్చుటకు బదులుగా బ్యాంక్ ఆఫ్ ఇంగ్లండ్‌నందు ఇండియా ఎక్కౌంటునకు నిల్వ చేయుచు వచ్చినది.

ఈ ఏర్పాటు ఫలితములు మనదేశమునకు అన్నివిధములా ప్రతికూలమే. యుద్ధకాలమున ఇండియాలోని మిత్రరాజ్య సైన్యముల ఖర్చు ఎక్కువగుచుండుటచే మన స్టెర్లింగు నిలవలు నానాటికి లండనులో నభివృద్ధి యగుచుండెడివి. మన దేశములోని కరెన్సీ మొత్తము సుమారుఅయిదురెట్లధికమైనది. ఉత్పత్తియందభివృద్ధి లేకపోగా నితర దేశములనుండి రవాణా యగుచుండెడి వస్తుసామగ్రి దిగుమతి ఆగిపోయెను. ఇందుకు తోడు గవర్నమెంటుగూడ సైన్యములకు కావలసిన వస్తువులను కొనుటచే దేశమునందు క్షామ పరిస్థితు లేర్పడెను. వస్తువులధర విపరీతముగ పెరిగిపోయినది. సామాన్య మానవుని జీవితము మిక్కిలి దుర్భరమయ్యెను.

ఈ విషయ మటుండ ప్రపంచమంతటను భారతదేశార్థికాభివృద్ధిని గురించి అపోహ కలిగెను. 1939 వరకు ఇండియా బ్రిటనుదేశమునకు చాలా బాకీ యుండెను. ఆ బాకీ యంతయు 1942 ప్రాంతముల తీరిపోవుటయే గాకుండ అప్పటినుండి బ్రిటనుదేశమే మనకి స్టెర్లింగు మొత్తము నివ్వవలసివచ్చెను- ఇండియాదేశము యొక్క ఆర్థికశక్తి ప్రశంసనీయమే! కాని యీ స్టెర్లింగు మొత్తము భారతీయులు అమెరికనులవలె ఆడుచు పాడుచు నిల్వ చేసినవి కావు. ఇవ్వగల శక్తియుండియు కాదు. అసలు మన దేశములో జీవనప్రమాణము చాల తక్కువ. ఆప్రమాణమింకను తగ్గినది. మరి అమెరికాదేశములో ప్రజలు యుద్ధమునకు పూర్వముకంటె యుద్ధానంతరము ఆర్థికముగా బాగుగా నున్నారు.

యుద్ధానంతరము జరిగిన మొదటి ఒడంబడికల ననుసరించి యీ సంవత్సరము జూన్ 30 తేదీ వరకు ఇండియా 93 మిలియను పౌనులను సంపాదించెను. ప్రస్తుతము బ్రిటను ఆర్థికపరిస్థితులను గమనించి యీ స్టెర్లింగు సమస్యను ఒకేసారిగాని నాలుగైదు సంవత్సరములలోగాని పరిష్కరించుట

పీటుంకాదని నిర్ధారణచెయ్యను. తదనంతరము ఇండియా ఆర్థికమంత్రి అధ్వర్యమున ఒక డెలిగేషన్ లండను వెళ్లి బ్రిటిషు ఆర్థిక శాఖామంత్రితో సల్పిన సంప్రతింపుల ఫలితముగ మూడు సంవత్సరముల ఒడంబడిక యొకటి జరిగెను. ఈ నిర్ణయ సమయమున కున్న స్టెర్లింగు నిల్వల మొత్తము 1160, 000, 000. ఒడంబడిక యొక్క ప్రధానాంశములు:

( ) యుద్ధకాలమున ఇండియాయందు నెలకొల్పబడిన బ్రిటిషు గవర్నమెంటు యుద్ధ నిర్మాణముల పరిష్కారము- ఇండియా ప్రభుత్వము నిర్మాణములకు 1)0,000,000 పౌనులిచ్చుటకు ఒప్పుకొనెను. కొన్ని బ్రిటిషు పత్రికలు ఇండియను డెలిగేషన్‌వారి అంచనాలు చాల సబబుగ నున్నవని వ్రాసినవి. అసలు ఈసరికనము లుపయోగములే యైనప్పుడు వాటికి ధర యిచ్చుట సమంజసమే.

(2) ఇండియాలో తమ పదవులనుండి విరమించుకొనిన బ్రిటిషు ఉద్యోగులకు— 1947నుండి విరమించుకొనినవారి సంఖ్య ఎక్కువ- ఉపకారవేతనముల నివ్వవలసిన బాధ్యత ఇండియా ప్రభుత్వముపైగలదు. ఇందునిమిత్తము 168000,000 పౌనులను బ్రిటిషు ప్రభుత్వమున కిచ్చుటకేర్పాటు జరిగెను. అయితే ఈ పెన్షను మొత్తము నొకేసారి యిచ్చివేసి ఆ బాధ్యతను తొలగించుకొనుటకు బదులు మన ప్రభుత్వము ప్రతి సంవత్సరము కొంత సొమ్ము నిచ్చు ఉద్దేశములో కొయిమాన సాంవత్సరికములను బ్రిటిషు గవర్నమెంటువద్ద నుంచుకొనెను. అనగా ఈ సంవత్సరము 1¼ మిలియను పౌనుల పెన్షను యిచ్చెదరు. క్రమముగా 60 సంవత్సరములలో యీ సాంవత్సరిక సంఖ్య క్షీణించిపోవును. ఈ యేర్పాటువలని లాభమేమని ప్రశ్న వేయబడెను. కాని పెన్షనను యిచ్చునప్పుడు పెన్షను దారుని నడవడి యోగ్యముగా నుండవలయును. మరి యీ 16ర,000,000 పౌనుల నొకేసారి యిచ్చివైచినచో యీ నిబంధనయొక్క విలువ లేదు. కాని యీ నిబంధనయొక్క ఉపయోగము చాల అనుమానాస్పదము.

(3) 1951 సంవత్సరమువరకు ఇండియా ప్రభుత్వమునకు 80,000,000 పౌనులు మాత్రమే యివ్వబడినవి. క్రిందటి జూన్‌వర కిచ్చిన 83,000,000 పౌనులు పోగా మనకు మిగిలెడి స్టెర్లింగు 640 మిలియనులు. ఈ మొత్తములో 200 మిలియనులను మన రూపాయకు రిజర్వుగా లండనులో నుంచుటకు ఒప్పుదల జరిగెను. ఒకానొకప్పుడు స్టెర్లింగున కంతర్జాతీయ ప్రాముఖ్యము గలదు. ఒకానొక ఆర్థిక సిద్ధాంతము ననుసరించి బంగారమునకు బదులు ఈ స్టెర్లింగు మనదేశ నాణెములకు బలముగా నుండెడిది. ప్రస్తుతము ఈస్టెర్లింగు యొక్క ప్రాధాన్యమును అమెరికను డాలరు సంపాదించెను. ఇకను పౌనుపై మన రూపాయని ఆధారపడునట్లు చేయుటనవసరమని తోచుచున్నది. మరియు నంతర్జాతీయ వ్యాపారము సౌకర్యముగా కొనసాగుటకు ప్రతి దేశమునకు ఇతరదేశముల నాణెములను సరఫరా చేయుచు అంతర్జాతీయ ధన నిధి అను సంస్థ నెలకొల్పబడెను. ఈ సందర్భమున 200 మిలియను పౌనులను రిజర్వుగా లండనులో నుంచుట యెందుకను సందేహము ఆర్థిక వేత్తలకు కలుగుట సహజము. ఈ రిజర్వు పోగా మిగిలిన 400–500 మిలియను స్టెర్లింగు ఇండియాకు ఎప్పుడు ఏవిధముగా నిచ్చెదరో 1951 లో గాని తెలియదు.

(4) మరియు మనకు ఇచ్చిన 160 మిలియను పౌనులు ఒక్క స్టెర్లింగు ప్రాంతమునందే చెల్లుబడి అగును. అమెరికా, మరికొన్ని ఐరోపా దేశము లీ 'ప్రాంతము' లోనివి కావు. కనుక ఇండియా స్టెర్లింగు ప్రాంతేతర దేశములనుండి వస్తువులను కొనుటకుగాను 15,000,000 పౌనులు యివ్వబడినవి. ఈ సంఖ్య చాల అల్పము. ఇండియాకు కావలసిన వస్తువులు చాలవరకు అమెరికా ఇవ్వగలదు. మన డాలరు సంపత్తి యెంతయో లేదు. అంతర్జాతీయ ధన నిధినుండి యిప్పటికి 40 మి. డాలర్లను ఇండియా పొందెను. కనుక మనకు ఇచ్చిన పెద్ది స్టెర్లింగు మొత్త మన్నిదేశములం దుపయోగించుట కష్టము. ఈ మధ్యనే చకోస్లావాకియా, స్విట్జర్లాండు, స్వీడన్ దేశములతో ఇంగ్లాండు గావించుకొనిన సంప్రతింపులవలన స్టెర్లింగు ఆ దేశములలో చెల్లుబడి అగును.

మన ఆర్థికమంత్రి స్టెర్లింగు ఒడంబడికను గురించి మాట్లాడుచు ఇండియా వ్యాపార సమ[illegible]సరములలో నధికముగా [illegible] సంవత్సరము మనకు

ఎగుమతి వ్యాపారము 500 కోట్ల రూపాయల విలువగలది. కనుక 1951 సం॥ లోపుగా మనకు సుమారు 1760 కోట్ల రూపాయల ఎగుమతి వ్యాపారమున కవకాశము గలదని ఆర్థికమంత్రి యుద్దేశము.

నిర్థ్యముగ పరిశీలించిన నీ పై ఒడంబడిక షరతులు మన దేశమున కెంత లాభకరమో విశదము. మన దేశములోని ఆర్థికాభివృద్ధికిగాను అనేక ప్రణాళికలు తయారు కాబడినవి. వీని యన్నిటి యందును స్టెర్లింగు నిల్వలు పెట్టుబడిధనముగా ప్రాధాన్య మీయబడినది. కాని 1951 వరకిచ్చిన 160 మి. పౌ. ఆర్థికాభివృద్ధికి ఎంతవరకు తోడ్పడుననునది అనుమానము.ఇండియా ఆర్థికస్థితి ఒక రాచబాట ననుసరించుట కెంతయో కృషి యవసరము. మనకు మిగిలిన స్టెర్లింగు మొత్తము నంత నొకేసారి ఇచ్చినను ఆర్థిక ప్రణాళికల పెట్టుబడి చాలదు. మనకు కావలసిన వస్తువులను పంపుటకు బ్రిటను దేశమున కెంతవరకు శక్తియున్నదో, అసలు యిష్ట మున్నదోగూడ తెలియదు.

ఇంకొక విషయమునగూడ నీ యొడంబడిక నిరుత్సాహకరముగ నున్నది.ఇండియాయందు బ్రిటిషు వారి యాజమాన్యమున ననేక పరిశ్రమలు గలవు. కాఫీ తేయాకు ఎస్టేటులు ఎక్స్ఛేంజి బ్యాంకులు తదితరములు బ్రిటిషు కంపెనీల చేతులో నున్నవి. వాటినన్నిటిని ఇండియాప్రభుత్వము యీ స్టెర్లింగు నిల్వలతో కొనవలయునని, అట్లు చేయనిచో రాజకీయముగా బ్రిటీషువారు తొలగి పోయినప్పటికిని ఆర్థికముగ వారిస్థానము బలముగా నుండునని మన దేశమున ప్రబలమైన విశ్వాసము గలదు. ఈ విషయ మసలు చర్చింపబడలేదు. ఆర్థిక మంత్రి యెంత చెప్పినను ఇండియాప్రభుత్వమునకి బ్రిటీషు కంపెనీలు చెల్లించు పన్నులకంటె ఆ యా వ్యాపారములనుండి వచ్చు లాభమెక్కువ.

ఇంకను- రావలసిన స్టెర్లింగు నిల్వలపై మనకు వచ్చు వడ్డి 0. 78 o/o మాత్రము. అసలు మిగిలిన మొత్తములో తగ్గింపులేమి యుండదవనియు మన డెలిగేషను స్పష్టముగ చెప్పుచుండ, కొన్ని ఇంగ్లీషుపత్రికలు,కొందరుబ్రిటిషువ్యక్తులు- చర్చలు మున్నగువారు-అప్రమేయ మేమియు నీసందర్భమున రాలేదని, యలజడి కలుగజేయుచున్నారు.

మన స్వాతంత్ర్యార్జన చారిత్రాత్మకమైనది. కాని స్వతంత్ర దేశము లేవియు నార్థికముగ నింత హీనస్థితియందు లేవు. ఈ స్టెర్లింగు నిల్వలను మన ఆర్థిక సౌభాగ్యమున కుపయోగించుకొనవలయునను నాశ యెంతయో యుండెడిది. ప్రస్తుత స్టెర్లింగు ఒడంబడిక మన ఆశయముల కంత ప్రోద్బలముగా లేదు.ఒడంబడిక గుణగుణములటుండ మనము సంపాదించినటువంటి స్టెర్లింగు నేవిధముగ నుపయోగించుట యనునది దేశమున పెద్ద సమస్యగ నున్నది. క్రిందటిసంవత్సరముమనకివ్వబడిన 83,000,000 పౌనులలో మన గవర్నమెంటు 3,000,000 పౌనులను మాత్రమే ఉపయోగించిరి. అందుచేత నే ఈ స్టెర్లింగును పెట్టుబడిదారులకొఱకే వినియోగింతురేమోయను భయము సామాన్య మానవుని యందు జనించినది. స్టెర్లింగు నిల్వల నిర్మాణ కాలమున భారతీయు లెంత కష్టమునకు గురియైరో యూహించిన, ప్రతిభారతీయునికిస్టెర్లింగు నిల్వలపై గల హక్కు తెలియును. ఇండియా ప్రభుత్వము గూడ నీ విషయమును తెలిసికొని చక్కని ఆదర్శములతో నీ సమస్యను పరిశీలించెదరని విశ్వాసము.

కథానిక

# భూత ప్రణయం

'అమరేంద్ర'

నామటుకు నాకెప్పుడూ దయ్యాలన్నా పిశాచాలన్నా నమ్మకం లేదు. చూచామన్న వాళ్లని నిలదీసి అడుగుతే వాళ్లకే తెలియదు ఏం చెప్పాలో! బహుశః ఆ తెలియనితనం కూడా ఆ భూతంవల్లే కావచ్చు. ఐనా, నాకా విషయంలో అనుభవం లేకపోయినా, ఒకరోజున మధ్యాహ్నం నాతోటి ప్రయాణీకుడు చెప్పిన చిత్రమైన, అంతమైన కథను చెబుతాను. ఆ కథకు కనీసం ఓ రూపం, ఆధారమైనా ఉంది.

నేను కాలేజీ ఒదిలేసిన తరువాత, మా కుటుంబ వ్యాపారంలో చేరిపోయాను– మాది రైల్వే కంట్రాక్టర్లవ్యాపారం. అంటే యెప్పుడూ ప్రయాణాలేనన్నమాట. ఒక రోజున పర్లాకిమిడికి వెళ్లాల్సొచ్చింది. పర్లాకిమిడి మద్రాసురాజ్యాని సరిహద్దునున్న గంజాంజిల్లాలో ఉంది. పర్లాకిమిడికి వెళ్లే బెంగాల్ నాగపూర్ రైల్వేను మేమే వేశాం... ఐతే అసలుకథకు వస్తాను...

మా రైలు నేనెక్కిన మరుసటిరోజు మధ్యాహ్నం, పదకొండు గంటలకి బరంపురం జేరుకుంది. ఆ మధ్యాహ్న ప్రారంభంలోనే, నెత్తిమాడ్చే ఎండ! ఆకాశమే ఒక అగ్నిహోత్రంలా ఉంది. అలాంటి కళ్లు మిరుమిట్లు గొలిపే సూర్యకాంతితో, అసలు చీకటనేది ఈ ప్రపంచంలో ఉందా అనిపిస్తూంది. ఆస్థితిలో ఉన్న నా ఆలోచనలకి తీవ్రాభ్యంతరం కలిగింది. ఇంకో ప్రయాణీకుడు నా కంపార్టుమెంటులోకి వచ్చాడు. పొట్టిగా లావుగా వుంటాడు. పాశ్చాత్యుడు. అతడిని చుట్టుముట్టి చప్రాసీలుండటం, అతడు చాల పెద్ద వుద్యోగస్థుడని చెప్పకచెబుతోంది.

రైలు బయలుదేరగానే, నాస్థితి అదోవిధంగా అస్థిమితంగా తయారయింది. ఆ మహోద్యోగి ప్రత్యక్షతవల్లనే అది అని తెలుసుకున్నా. అతనిదో చిత్రమైన ముఖం. ఎఱ్ఱగా కందగడ్డలా ఉంటుంది. నేనది ఎండవల్ల కావచ్చు ననుకున్నా. కాదని తరవాత మళ్లా తెలుసుకున్నా. ద్రాక్షరసపు బుడ్డితీసి, కొంత గ్లాసులో పోసి, దాంట్లో పాళ్లాల ప్రకారం సోడా పోసి, గడగడ తాగి, పెదిమలు చప్పరించాడు. నిజానికి ద్రాక్షరసం చూడ్డానికి బాగానేఉంది.

"మీరు కొంచెం తీసికోరూ?"– అతడు నన్నడిగాడు.

"వద్దు. క్షమించాలి" అన్నాను.

"దానివల్ల మీకు ప్రమాదమేమీ లేదు. మాస్వస్థలపు రసం. మరేం ఫర్వాలేదు, తీసికోండి" అని నాకు అభయమిస్తూ మళ్లా ఇవ్వబోయాడు.

నేను ససేమిరా వద్దన్నా. "నేను ఒట్టి బ్రాందీయే తాగుతాను" అని అన్నాను. సమయస్ఫూర్తికీ, అనుకూలతకీ మాట్లాడిన అబద్ధమేకాని, వేరుకాదు. ఆ అబద్ధంవల్లే నాకా అవస్థ తప్పింది. అందువల్ల మళ్లా నన్నాయన తాగమని ఒత్తిడి చేయలేదు గాని, దానిని పురస్కరించుకొని డోసు ఎక్కువ చేస్తూ, ఆ తాగుడులో మునిగిపోయాడు. రెండు గంటలైన తరువాత, నేను వెళ్లబోయే సమయమైంది. అప్పటికి ఒక బుడ్డి ఖాళీ అయింది. ఆ ఖాళీబుడ్డి కిటికీలోంచి బైట పారేశాడు. రెండో నిండు బుడ్డి పైకి తీసి, దాని కార్కుకూడా ఊడదీశాడు. అప్పటికే చాలా తాగాడు. ఐనా, మామూలు స్పృహలోనే వున్నాడు. ఏ తాగుడైతేనేం, కొంచెం అంతకంటెను వాగుడెక్కువైంది. ఊరికే అదేపనిగా మాట్లాడటం ప్రారంభించాడు. నేనుమాత్రం చాలా ఓపికతో వింటున్నాను. ఆ ప్రసంగ సందర్భంబట్టి, అతనుకూడా రైల్వే ఇంజినీరని తెలిసింది. చాలా చాలా ప్రయాణాలు చేశాడు. దేశదేశాలూ తిరిగాడు కాబోలు. అతని అనుభవాలూ, సాహస కృత్యాలూ వర్ణించటం ప్రారంభించాడు. నిజంగా, వింటానికి చాలా సరదాగా వుంది. బలే కాలక్షేపం కలిగిందనుకున్నా.

గంజాం తరువాత చిన్నపట్నం. చిన్నపట్నం నిండా అందమైన ఆడవాళ్ళేనన్నాడు. "రోడ్లమీద కనిపించే అలికీజాతి మాత్రం కాదుసుమా! పర్దాల వెనకాల ఉండే ఘోషాస్త్రీలు మంచి సౌందర్యవతులు" అని సందేహంతీర్చాడు. "పి. డబ్ల్యు డి. కంట్రాక్టర్లకి వాళ్లెవరో ఎక్కడుంటారో తెలుసు. నేను బెంగాలీ కంట్రాక్టర్ని కావటంవల్ల, అదికాక విదేశీయుణ్ణి కావటంవల్లా అలాటి సౌందర్యవతుల్ని కలుసుకోలేక పోయాను. మామూలువాళ్లే తటస్థించారు. అంతే. రసికత్వం లేని ప్రమాదమన్న మాట!!" అతడు చెప్పిన ప్రకారం, అతని ప్రేమ కలాపాలన్నీ పవిత్రమైనవీ కష్టం లేనివీట! ఆ ప్రియురాండ్రు అప్సరసలో లేక చిన్నపట్నపు సౌందర్యవతులో నేను చెప్పలేను. కాని అతడు చెప్పిన ప్రేమకథలోకల్లా, ఒక కథమాత్రం చాలా బాగుంది. ఆకథ అతని మాటల్లోనే చెబుతాను:

"నేను ఇంటినుంచి తిరిగి వచ్చేరాగానే, నన్నో మహారణ్య మధ్యమంలోకి వెళ్లవలసిందిగా నియమించారు. అదీ చాలాదూరం! అక్కడ నే చేయవలసిందేమంటే, అడవుల్లో కొన్నిరోడ్లు వేయించటం. నాకన్న ముందు పనిచేసిన రోగర్ మహాశయుని స్మారకంగా, ఒకసమాధి కట్టించడం. ఆ చోటికి పని చెయ్యటానికి వెళ్లిన ఇంజనీర్లు చాలా మంది. తిరిగి వచ్చినవాళ్లు చాలా కొద్దిమంది. ఆ స్థలానికి జేరుకోటం అంటే అంతకన్న కష్టం. కొంతదూరం స్వారీమీద, కొంతదూరం నడిచీ, మొత్తంమీద ప్రయాణం పూర్తిచేశాను. చుట్టూ దట్టమైన అడవి. మధ్య చిన్నచిన్న కొండలు. అడవులకీ కొండలకీ మధ్య, కొంచెం నివాసయోగ్యమైన స్థలాలు. ఆ స్థలాల్లో గుడిశలు వేసికొని బ్రతుకుతున్నవాళ్లు మాకు రోడ్లువేసి, కూలీచేసి బ్రతుకుతున్నారు. నా బంగళా, ఒక చిన్న కొండమీద ఉంది. అదీ శిథిలావస్థలో ఉంది. ఎంత ధైర్యశాలినైనా సరే ఒట్టి పిరికిపందగాచేసే భయంకరాకారము! ఐనా దక్షిణదేశపు నా సేవకుని సహాయంతోనూ, ఇతర ఇద్దరు చౌకీదార్లతోనూ, ఆ భయం పోవటానికి ఎంత చేయాలో అంతా చేశాను. ఇదంతా ఐనతరువాత ఒకపెద్ద నిట్టూర్పుకూడా విడిచాను. అలాటి నిస్సహాయస్థితిలో నా స్వస్థలమైన 'పెర్తు' ఎక్కడుందిరా బాబూ అనిపించింది. నా వస్తువులన్నీ కొంచెం సర్దిన తరువాత, నేను భోజనానికి లేవబోయాను. సరిగా అప్పుడే నా రక్షకుల్లో ఒకడు, లోపలికి తొంగి చూశాడు. 'అయ్యా, నీళ్లగదితలుపు ఘడియ గట్టిగా వేయండి. మీరు పడుకుండే గదిలో ఒకదీపం ఉంచుకోండి. ఇదొక చిత్రమైన స్థలం. మీకు నిద్రాభంగం కలిగేదేమైన సంభవిస్తే వెంటనే మమ్మల్ని పిలవండి. మీగది తలుపుపక్కనే మేము పడుకుంటాం' అని చెప్పి నమస్కారంచేసి, బైటికి వెళ్లిపోయాడు. కాని నేను ధైర్యం ఎలాగోలాగు కూడ గట్టుకున్నాను. అనవసరంగా గాభరాపడకుండా ఉండటానికి ప్రయత్నించాను. భద్రంగా నీళ్లగదితలుపు వేశాను. లాంతరు వెలిగించాను. నాపక్క దగ్గర ఉన్న బల్లమీద రివాల్వరు ఉంచుకొని, అప్పుడు పడుకున్నాను.

"ఐనా, నిద్ర అన్నమాట పట్టలేదు. చిత్రమైన వెర్రి ఆలోచనలు, ఒకదాని వెంట ఒకటి రానారంభించాయి. సుఖంలేకుండాపోయింది. కాని బాగా అలసిఉన్నాను. ఎప్పుడు నిద్రపట్టిందో తెలియదు, ఎంతసేపు నిద్రపోయానో కూడా తెలియదు. నేను హఠాత్తుగా లేచాను. ఒక శబ్దంమాత్రం చెవులకు కొట్టొచ్చినట్లు వినిపించింది—ఎవరో తలుపు కొట్టుతున్నట్లు—నీళ్లగది తలుపేనని తెలుసుకున్నా. ఐనా సర్దుకొని పడుకుంటే ఎక్కడిదక్కడ సద్దుమణుగుతుందని, ఒకవైపుకు తిరిగి పడుకున్నా. నిద్రపోవటానికి ప్రయత్నించాను. ఆతలుపు కొట్టటంమాత్రం ఆపేపనిగా వినపడుతోంది. ఇక లాభంలేదని లేచి, రివాల్వరు చేతపుచ్చుకొని, నీళ్లగదితలుపు తెరిచాను. వెంటనే ఒక విచిత్రమైనదృశ్యం నాకళ్లకి కట్టినట్లయింది.

"నాయెదుట ఒక పొడుగాటి దివ్యసుందరి—నీలి రాతిలో చెక్కిన మేనకో, రంభో అన్నట్లుగా—నిలబడి ఉంది. ఆమెకు కెంపురాళ్ల కంఠహారము, చెవులకు పగడపు లోలాకులు ఉన్నాయి. నడిచేతికి, శంఖపుగాజు ఉంది. ఆమె కేశాలు వెనకాల జారుముడివేసి ఉన్నాయి. శ్వేతవస్త్రాలంకృతయై విచిత్ర సంవర్ణనియై, నన్ను ఒట్టి మూగవానిగా చేసింది. ఆమె నావైపు చూచి చిరునవ్వు నవ్వింది. ఆమె ఇలా అంది: 'నీ ఆయుధం నన్నేమీ భయపెట్టలేదు. ఆ ఆయుధం నాపట్ల ఒట్టి నిష్ప్రయోజనమైనది. నేనెందుకు ఇక్కడ ఉన్నానో తెలుసా?' ఆమె ఇంకా చెప్పటం మొదలెట్టింది. 'నేను నీ పూర్వపు సహోద్యోగి సతిని. ఇది నా గది. అది నా శయ్య. అవి నన్ను పరవశమొనరుస్తాయి. అదిగో అక్కడ వున్న శయనాసనంలో పడుకుంటూ ఉండే

దాన్ని. నా భర్త యిచ్చే ద్రాక్షరసాన్ని అప్పుడప్పుడు సేవించేదాన్ని. నేను ఎంతో హాయిగా రోజులు వెళ్ళబుచ్చాను. కాని ఆ సుఖం నశ్వరమైపోయింది' అని ఒక వేడి నిట్టూర్పు విడిచింది. 'నా భర్త ఒకసారి సెలవుమీద ఇంటికి వెళ్ళాడు. ఆయన మళ్లా తిరిగి వచ్చేటప్పుడు మరొకభార్యను తెచ్చుకున్నాడు. దాంతో నా మధుర స్వప్నాల అంతిమ సమయం వచ్చింది. చివరకి నేను అస్మరణీయనైపోయాను. నా పోషణమాత్రం మామూలుగా జరుగుతూనేవుంది- తిండిలేక, మాడ నవసరం లేకుండా. తరువాత ఒక విచిత్రమైనపని జరిగింది.'

"నే నిదంతా శ్రద్ధతో వింటూనే వున్నాను. ఆమె మళ్లా ప్రారంభించింది. 'ఆయన భార్య అకస్మాత్తుగ ఒక మాసంలోనే చనిపోయింది- ఏ రోగం రొష్టూ లేకుండా. నా భర్త ఆశ్చర్యంతో విచారంలో కిల పడిపోయాడు. నన్ను మళ్లా దగ్గరకు తీసుకుంటా డనుకున్నాను. దురదృష్టవశాత్తూ అలా జరగలేదు. చౌకీదార్లలో ఒకడు నాశత్రువు. వాడు నాకు ఇచ్చి, నాభర్త దెవ్వరికో పంపాడో తెలియదు. అదే నా నాశనానికి వచ్చింది. ఐనా ఇంకా మంచిరోజు లున్నాయనుకున్నా. తిరిగి ఆయన ప్రియసతిగా ఉండగలననుకున్నా. నే నాయన నెరుగున్నంత పరిచయంగా మరింకెవరూ ఎరుగరు. ఆయన పగలంతా పనిలో మునిగి ఉన్నా ఆయనకు మామూలైనట్లుగా, పగటి కష్టం అయింతర్వాత, నా సాహచర్యం అవసరం అయ్యేది అని అనుకున్నా. నే నాయన దర్శనం చేద్దామని ప్రయత్నంచేశా. కాని నా భర్త పూర్తిగా మారిపోయాడు.'

"నీళ్ళగది ద్వారం చూపిస్తూ ఆమె ఇలా అంది. 'ఒక రోజు రాత్రి ఈ ద్వారంగుండా నే నీ గదిలోకి ప్రవేశించాను. ఆయన నన్ను చూశాడు. చటాలున పిస్తోలుతీసి నాగుండె కెదురుగా పేల్చాడు. ......తరువాత నా శవాన్ని చౌకీదార్లు తీసికొని వెళ్ళి ఒకచోట సమాధి చేశారు.' ఈ వాక్యం పూర్తి చేస్తూనే, ఆ గదిలో ఒకమూల చేయెత్తి చూపింది. నేను తిరిగి చూశాను. చూచేటప్పటికి, ఆ మూల ఆ శయ్యపక్కన, సాక్షాత్తూ నాపూర్వ సహోద్యోగి మూడు మూర్తులా ప్రత్యక్షమయ్యాడు. అతడు తేలయ్యి చూడటం ప్రారంభించాడు. నాకు నిజంగా అపర మృత్యువుగానే తోచాడు! ఆ శరీరంలో ఏమీ లేదు. ఒట్టి ఎముకలూ, దానికప్పిన చర్మమూ తప్పితే!... అతని పక్కన శయ్యమీద అతని రెండో భార్య మృతకళేబరం పాలరాయివలె పడి ఉంది.

"అప్పుడే, రోగరు నాతో ఇలా అన్నాడు: 'అది ఒక పిశాచం. ఇంకా అది చావలేదు. అది నా భార్యను విషంపెట్టింది. ఇప్పుడు నీవూ కొత్తవాడివి వచ్చావు కాబట్టి, నిన్ను మోహింపు చేద్దామని చూస్తోంది. అరి దేవుడా! అది కర్కశపు పిశాచము. దానికి తెల్లవాళ్లంటే మోహం ఎక్కువ. నీవు బ్రతకదలుచుకుంటే, ఆ నశ్వర సౌందర్యపు బారినుండి నీవు తప్పించుకోనవలెనంటే, దానిని రివాల్వరుతో పేల్చు. అంతే' అన్నాడు.

"నేను చెరోకవైపూ చూచాను. ఆ 'స్వప్న కన్య' ఇలా అంది.

'అది అబద్ధం. నే నెప్పుడూ ఆమెకు విషం పెట్టలేదు. ఆతను నన్ను చంపి, తాను చచ్చేదాకా తప్పతాగాడు.' రోగరు నిర్భయంగా 'దానిని పేల్చవేం? ఊఁ... పేల్చు వెంటనే. లేకపోతే నీ కిప్పుడే మూడింది' అని భయంకరంగా అరిచాడు. నా ఆలోచించుకోడానికేమాత్రం టైము లేకపోయింది. రివాల్వరు తీశాను. స్పృహ లేకుండానే గుడ్డిగా పేల్చాను. దాంతో నా మద్యపు బుద్ధి బ్రద్దలైంది. దీపం ఆరిపోయింది!

"ఆ చప్పుడు విని బైట నా గది ద్వారంవద్ద పడుకున్న చౌకీదార్లు నిద్రలేచారు. హడావుడిగా నా గదిలోకి పరుగెత్తుకొని వచ్చారు. నేను జరిగిందంతా చెప్పి, మళ్లా భయంతో ఒళ్లు తెలియని పరిస్థితిలో పేల్చాను. జరిగిందంతా తెలిసివుండడంచేత నవ్వారు. ఐనా ఏమైనా ఉందేమోనని గదంతా వెదికారు. కాని ఏమీ కనిపించలేదు. అప్పుడు వాళ్లు ఉన్న రహస్యం అంతా చెప్పారు. నాకు పీడకల వచ్చిందనీ, దాంతో ఈ ఒళ్లు తెలియని పనంతా చేశాననీ... అప్పణ్ణుంచీ నేను ఒంటరిగా పడుకోలేను. ఆ స్వప్నకన్య, ఎప్పుడూ నాకళ్ళల్లో కనిపించి నన్ను మృత్యువులాగా పీడించటం మొదలెట్టింది. చివరికి, ఒంటరిగా పడుకోలేక పెళ్లి చేసుకున్నాను."

ఆ ఇంజనీరు కథ పూర్తిచేసి నిశ్చలంగా కూర్చున్నాడు. నిజంగా నా స్నేహితుని ముఖంలో ఒకవిధమైన భయాన్ని గమనించాను. నేనూ చాలాసేపు నిశ్శబ్దంగా ఊరుకున్నాను. రైలు పర్లాకిమిడి చేరుకుంది. అతనివద్దగ్గర సెలవు పుచ్చుకొని నేను రైలు దిగి వెళ్లిపోయాను.

(మాతృక: శ్రీ ప్రమదా చౌదరి...)

* "ప్రజలు పాపం చేస్తున్నారు. అందుచేతనే వర్షాలు కురవడంలేదు." ఇదీ ఒక ప్రజానాయకుని ఇటీవలి ధోరణి. *

# ప్రజానాయకుల చిలక పలుకులు

"గిరి"

రాజకీయ నాయకుల దృష్టికి ప్రజలెప్పుడూ బడి పిల్లలవలె కనిపిస్తూంటారు. సత్ప్రవర్తనం అలవరచుకొని, నలుగురిలోనూ మంచిపేరు తెచ్చుకుని, పైకివచ్చి దేశానికింత ప్రతిష్ఠ తీసుకురమ్మని బుజ్జగిస్తారు. నీతి, ధర్మం, ప్రభుభక్తి, ఆధ్యాత్మిక చింతన- మొదలైనవాటి గురించి తీరిక వేళల బోధిస్తారు. చెప్పుడు మాటలు విని, చెడు సహవాసాలు చేసి యెక్కడ చెడిపోతారో అని ముక్కుమీద వేలువేసుకుని కొప్పడుతూంటారు. "చెయ్యి దాటిపోతున్నారు; ఇక లాభంలేదు" అని అనుమానం కలిగినప్పుడు బెత్తం ఝుళిపించి, తొడపాశం పెట్టి గోడకుర్చీ వేయిస్తారు. ప్రజల నిలా ఒక కంట కనిపెట్టి చూస్తూ, వారికి జ్ఞానభిక్ష పెట్టి, లోకంలో వారు తలెత్తుకొని తిరిగేటట్టు చేసి, తద్వారా తామింత దేశసేవ చేస్తున్నామన్న సంతృప్తి తప్ప, పాపం నాయకులకు మిగిలేది!

దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన దిమ్మట ప్రజల విషయంలో మరీ జాగరూకులై మెలగుతున్నారు, మన నాయకులు. ప్రజల ప్రాణాలకు యీ స్వాతంత్ర్యమనే దేదో కొత్త ఆటవస్తువు దొరికినట్టుగా ఉంది! అందరూ కలిసి దాన్ని యీకకు యీక, తోకకు తోక పూడలాగుతే యిక చేసేదేమున్నది? పైపెచ్చు, యీ సంబరంలో పడి యింతవరకూ నేర్చుకున్న పాఠాలన్నీ గుంటకొట్టి గంటవాయిస్తే ఎలాగ? సత్యం, ధర్మం, అహింస, ప్రభుభక్తి, నియమబద్ధ జీవనం- యీ చదువంతా గంగలో కలిసిపోతే! ఇదంతా చూసే ఆ స్వాతంత్ర్యాన్ని కాసేపు అవతల పెడదామనుకున్నారు, నాయకులు. దానిని యింకా అనుభవయోగ్యం చెయ్యవలసి ఉన్నదని చెప్పి, ఆ భారాన్ని తమ నెత్తిన వేసుకున్నారు. "సామాన్యమైన భారమా అది! సాగరమథనం అంత కార్యకలాపం చేసి, దానినుంచి అమృతం తీసి మీకు పంచిపెట్టాలంటే! అయినా మేము నడుంకట్టాము. మీరుమాత్రం మేం చెప్పిన పాఠాలు మరిచిపోకుండా వర్తించుకుంటూ మాకు అండగా నిలబడండి" అని వినతిచేస్తున్నారు.

"ప్రజలు కలిసివస్తే, వారికీ, మాకూ, దేశానికీ కూడా ఇన్ని చిక్కులుండేవి కావని" నాయకులు పరితపిస్తున్నారు. "ఇదివరకింత పోయికాలం లేదు; నిజానికి కట్టుబడి, నీతిగా బతుకుతూ, చాతనైనంతవరకూ త్యాగం చేసి, నలుగురిలోనూ వన్నెకెక్కేవారు-యీనాడు ఇంత అధోగతి పాలయి, దేశాన్ని నరకంలోకి యీడ్చుకొని పోతున్నారేమో!" అని కలవరపడుతున్నారు. అందుకనే

'ప్రజలు నిజాయితీగా వర్తించాలి'—

'నైతిక పునరుజ్జీవనం జరగాలి'—

అని అనుక్షణం ప్రజల్ని ఉద్బోధించడం.

ఆగష్టు 15 వ తేదీ తర్వాత, దేశంలో మత కల్లోలాలు చెలరేగినప్పుడు బయలుదేరింది యీ 'నైతికపునరుజ్జీవన'నినాదం. "స్వాతంత్ర్యం వచ్చిన వెంటనే దేశంలో యీ ఘోరకృత్యాలు, యీ హింసాకాండ, యీ రక్తపాతం ఏమిటి?" అని ప్రశ్నిస్తే—

"ప్రజలలో నీతి పోయింది. ఉత్తమగుణాలన్నీ నశించిపోయాయి. అందుకే యీ దారుణాలన్నీ" అని నాయకులు బదులు చెప్పారు.

దేశంలో బ్లాక్‌మార్కెట్ వ్యాపారం జరుగుతూంటే అందుకు కారణం ప్రజల అవినీతి. ప్రభుత్వోద్యోగుల్లో లంచగొండితనం ప్రబలుతే ప్రజల దోహదమే దానికి కారణం. ధాన్యసేకరణ సాగకపోతే కారణం ప్రజలు. దేశంలో ఉత్పత్తి తగ్గిపోతే ప్రజల సోమరితనం అందుకు కారణం. కంట్రోల్సు సరిగా అమలు ఎందుకు జరగడంలేదు? ప్రజల దుర్నీతివల్ల! కంట్రోల్సు రద్దు

చేసిన తరవాత ధరలు ఎందుకు పెరిగిపోయాయి! ప్రజలు తమ అవసరాలను మించి వస్తువులను కొనడంవల్ల! అందరి చేతుల్లోనూ డబ్బు బోలెడు మెదులుతూ ఉండడంవల్ల ఇన్‌ఫ్లేషన్ సమస్య బయలుదేరింది! ఆఖరికి వర్షాలు సరిగ్గా కురవడం లేదంటే, ప్రజలు పాపానికి ఒడికట్టడమే కారణం!

ప్రజాసేవ చేస్తున్నామని చెప్పుకునే నాయకులు, సమస్యల్ని పరిష్కరించలేక 'ఆడలేక మద్దెల ఓడన్నట్టు' అన్నిటికీ ప్రజలే కారణమని నింద మోపుతున్నారు.

దోపిడీ విధానమే జీవనంగా గల మిల్లు యజమానులు, పెట్టుబడిదారులు, వర్తకులు, కలిసి ప్రజలను కొల్లగొట్టడానికి బ్లాక్ మార్కెటును సృష్టిస్తే—

"ప్రజల ఆసరావల్లనే బ్లాక్ మార్కెటు వ్యాపారం సాగుతోంది" అని వాదించేవారు నాయకులు మాత్రం కారు.

"బెంగాల్ క్షామంలో ముప్ఫైఅయిదు లక్షల నిండు ప్రాణాలు బలిగొన్న బ్లాక్ మార్కెటుదారులకు స్వతంత్రభారతం ఆశ్రయం ఇవ్వదు" అని ప్రగల్భాలు పలికారు. "స్వాతంత్ర్యం వచ్చిన తరవాత మనల్ని వేధిస్తున్న ఆర్థిక సమస్యలకన్నిటికీ-- యీ బ్లాక్ మార్కెట్ దారులే కారణం. బ్రిటిష్‌వారి రోజుల్లో వారి అండన చేరి దేశాన్ని దోచుకున్న ద్రోహులు వీరు-- మా హయాం వస్తే, వీరందరినీ తుదముట్టిస్తాం" అని బీరాలు పలికారు.

ఆనోటితోనే యీనాడు ఇంకోలా పలుకుతున్నారు. ప్రజలు ప్రభుత్వంతో సహకరిస్తే బ్లాక్ మార్కెట్ సమస్య యింతగా పరిణమించేది కాదు, అని నాయకుల వాదన. సహకరించక ఏం చేస్తున్నారు, ప్రజలు?

పాలడబ్బా లేక పసిపాపకు ప్రాణంమీదకు వస్తే, అర్ధరాత్రి అయినా అప్పో సప్పో చేసి, వర్తకుడు అడిగినంత ఖరీదూ యిచ్చి ఆ పూటకు గండం గడుపుకునే బీద సంసారి బ్లాక్ మార్కెట్‌కి ...డ్డట్టా?

పేద రైతులనే విచక్షణ లేకుండా, పండిస్తు...న్న పంటనంతా ఊడ్చుకొనిపోయి-- మళ్లీ రైతుకు కావలసిన జనప విత్తులూ, ఎరువులూ, ఇతర వ్యవసాయ పరికరాలూ, కంట్రోలు ధరలకు ప్రభుత్వం అమ్మించలేకపోయిన పరిస్థితులలో-- వర్తకుడు అడిగినంతా కక్కి జనపవిత్తుల బస్తా కొంటే-- ఆ రైతు బ్లాక్ మార్కెట్ వ్యాపారంలో పాల్గొన్నట్టా?

ఇలాగే తక్కిన విషయాలలోనూ. కార్మికుల జీతాల సంగతి అంత ముఖ్యం కాదు. వారు ఇంకా కష్టించి పని చెయ్యాలి. ఉత్పత్తి అధికం చెయ్యాలి. అప్పుడూ అధిక వేతనాలు! "తిండిలేక చస్తున్నాం! జీవనానికి ఆసరా చూపించ"మని కార్మికుడు అడగడం నేరం. అన్ని రకాల పన్నులనూ నిరసిస్తూ, స్వంతలాభంమీదనే ఎప్పుడూ దృష్టి ఉంచే పారిశ్రామిక యజమాని దేశభక్తుడు!

కంట్రోలు సడలించారు; ధరలు ఆకాశం ఎత్తు లేచిపోయాయి. అయినా, తొందరపడి ప్రజలు విస్తారంగా బట్టలు మొదలైనవి కొనకుండా ఉంటే, ధరలు వాటంతట అవి పడిపోతాయంటుంది ప్రభుత్వం.

ఇరిగేషన్ ప్రాజెక్టుల నిర్మాణం వాయిదామీద వాయిదాలు వేస్తున్నారు. దున్నేవాడికే భూమి ఉండాలనే సిద్ధాంతాన్ని అమలు పరచడానికి ఎన్నో సంవత్సరాలు పడుతుందన్నారు. అయితే అధికాహారోత్పత్తి ఎలాగ? ఇలాంటి ప్రశ్నలు వేస్తే, "ప్రజలు పాపం చేస్తున్నారు: అందుచేతే వర్షాలు కురవడం లేదు" అన్నారు మన ప్రధాని శ్రీ రెడ్డియార్ గారు!

నాయకులు అప్పుడప్పుడు మన ప్రాచీన నాగరికత గురించీ, సంస్కృతి గురించీ ఉపన్యాసాలు యిస్తూ ఉంటారు. గవర్నర్ జనరల్ శ్రీ రాజగోపాలాచార్యులు గారు మద్రాసు వచ్చినప్పుడు ప్రసంగిస్తూ, "ఆ సంస్కృతి తలుచుకుని గర్వపడండి: దాన్ని యింకా ఉన్నతంగా చేసి భావి తరాల వారికి అందచెయ్యండి. అది మీ పవిత్రమైన బాధ్యత" అని ప్రబోధించారు. వీరి హయాంలోనే మన సంస్కృతికి ఎట్టి సత్కారం జరుగుతున్నదీ- ఇటీవల సుప్రసిద్ధ పత్రికా రచయిత అహమ్మద్ అబ్బాస్ బయట పెట్టాడు. అఖిలభారత ప్రజా నాట్యమండలి ప్రాచీన భారతీయ నాట్యకళను పునరుద్ధరించడానికీ, కళను ప్రజానీకానికి చేరువగా తీసుకురావడానికీ, పూనుకున్న సంస్థ. ప్రభుత్వం అటువంటి సంస్థపై దండయాత్ర సాగించి తనకు గల సంస్కృతి ప్రియత్వం బహిరంగం చేసింది. యీ నాట్యమండలి కార్యక్రమాల్లో

పెట్టాంటున్న నటులకు ప్రజాశాంతి రక్షణ చట్టాలు నాగపాశాలుగా పరిణమించాయి.

ఇంతకూ వీరుచేసిన మహాపరాధం: వీరి నాటకాలలో మత సామరస్యం ప్రబోధించారు; దోపిడీ విధానం ఖండించారు; నిరంకుశత్వాన్ని ఎదుర్కొన్నారు. తెలుగుదేశంలో అందరిమెప్పూ పొందిన 'మాభూమి' నాటకం నిషేధించింది ప్రభుత్వం. యిటువంటి చర్యలు ప్రభుత్వానికి మన సంస్కృతి పట్ల అభిమానాన్ని రుజావు పరుస్తాయి.

ప్రజలలో విద్యావ్యాప్తి కలిగినప్పుడే సంస్కృతి, నాగరికత వృద్ధి చెందుతాయి. కాని నేడు చదువుచెప్పే ఉపాధ్యాయులకు కాఫీ హోటల్ పనివాళ్లకంటె తక్కువ జీతం.

ఆమధ్య పోలీసులు ఒక గ్రామంలోని గ్రంథాలయాన్ని ధ్వంసం చేసివేశారట. పుస్తకాలన్నిటినీ చించివేశారనీ, ఆఖరుకు చేతులు నొప్పెట్టి, ఇక చించలేక, మిగిలిన పుస్తకాలను కత్తెరతో కత్తిరించివేశారనీ వినవచ్చింది. ఇటీవల మద్రాసుప్రభుత్వము, అనంతరం కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు కూడా ప్రజాశాంతి రక్షణ (సవరణ) చట్టాలు చేసినప్పుడు, వాటిలో ఒక నిబంధనను పొందుపరచారు. ఆ చట్టం ప్రకారం డిటెన్షన్ చెయ్యడానికి ఉత్తరవు లివ్వబడినప్పుడు, అతడు పట్టుబడకుండా తప్పించుకొని తిరుగుతున్న [illegible] ఎవరు నిలువ నీడ యిచ్చినా– చివరకు సాహాయ్యా లిచ్చినా కూడా, నేరస్థులుగానే పరిగణింపబడగలరని నిర్దేశిస్తున్నది, యీ నిబంధన. అయితే దంపతులైన వారికి మాత్రం ఇది వర్తించదన్నారు. ఇతరులమాట అటుంచి, ప్రభుత్వం నేరస్థుడుగా నిర్ణయించిన వ్యక్తికి, తల్లి దాహం యిచ్చినాకూడా అపరాధమేనా?

పైగా, న్యాయదేవతకు నిలయము లనతగు కోర్టుల అధికారాన్ని కూడా సంకుచించింది ప్రభుత్వం. హెబియస్ కార్పస్ పిటీషన్‌పై బొంబాయి హైకోర్టుజడ్జీ ఒక డిటెన్యూను విడుదల చేస్తే, మరుక్షణమే పోలీసులు అతనిని ప్రజాశాంతి రక్షణ చట్టంకింద అరెస్టు చేశారు.

ప్రజలను అజ్ఞానంలో ముగ్గచేస్తూ, కలకాలం వారిని కొల్లగొట్టుకోడానికి పెట్టుబడిదారీ వర్గం అనేక సాధనాలు అవలంబిస్తుంది. ప్రజలను బుజ్జగిస్తుంది. ధర్మబోధ చేస్తుంది, బెదిరిస్తుంది. నిరంకుశ విధానాలతో అణచివేస్తుంది. అదికూడా విఫలమైతే, రూపాంతరంలో ప్రత్యక్షమై, లోకోద్ధరణకే తాను పూనుకొన్నట్లు, సంస్కృతి నాగరికతల వికాసానికే తాను కృషి చేస్తున్నట్లు ప్రకటిస్తుంది.

# ఆంధ్రభాషకు దేవనాగరలిపి

* బలుసూరు వేణు *

భారతదేశమునగల వివిధరాష్ట్రీయు లన్యోన్య సంబంధము గలిగి భారతీయులందరికి జాతీయభావము వృద్ధి పొందుటకు, జాతీయభాషయేగాక జాతీయ లిపికూడ నత్యావసరమని యిప్పుడిప్పుడు గుర్తించబడుచున్నది. భారతావనిలో అత్యధికులు మాట్లాడుభాషయగు హిందీ భాష జాతీయభాషగా పరిగణింపబడినది. హిందుస్తానీ విషయమై నేడు జరుగుచున్న కలకలము కాలక్రమమున సమసిపోవచ్చును. హిందీభాష సంస్కృతభాషా పరమగు దేవనాగర లిపిలో వ్రాయబడుచున్నది. హిందీభాషకు తరువాత అధిక సంఖ్యాకులచే మాట్లాడబడు భాషలు ఆంధ్రము, బంగాళము. బంగాళముయొక్క లిపి యించుమించుగ నాగర లిపిని పోలి

యుండును ఆంధ్రమునకు లిపి ద్రావిడ లిపి

ఆంధ్ర, తమిళ, కన్నడ, మళయాళాది ద్రావిడభాషలలో నాంధ్ర మగ్రతాంబూల మందు కొనుచున్నది. ఆంధ్రము 'మ' కారాంత పద సమ్మేళనమగుటయు, సంస్కృత పద భూయిష్ఠమగుటయు, సంస్కృతమునకన్న నెక్కువ యక్షరములు గలిగి యుచ్చారణ విశిష్టతగలది యగుటయు నిందులకు కారణములు కాని యాంధ్రలిపి యాంధ్రభాషకు స్వతస్సిద్ధము గాదు కన్నడ లిపియొక్క యనుకరణము మాత్రమే తమిళభాషాలిపి, స్వతస్సిద్ధమైనను, భాషయం దక్షరసంఖ్య తక్కువ చెవుల కింపుగాని 'న' కారాంతపద జాలము ఉచ్చారణా సౌష్ఠవము లేదు వేలనము ఆంధ్రభాష కిట్టిలోపములు లేవు.

ఆంధ్రభాషయందు లోపములు లేకున్నను, లిపియం దనేక లోపములుగలవు. ఇందు హల్లులకుగూడ నచ్చులకుబోలి గుణింతమునందు సంజ్ఞారూపములుగలవు ఇవి కష్టమగుచున్నవి ముద్రణకు కష్టతరముగనున్నది. 'టైపు'నకు కష్టతమము గూడను. ఉదాహరణకు 'మత్స్యయంత్ర' మను పదమును గమనింపుడు. ఇందు 'స' 'య' 'ర' యను మూడు హల్లులు సంజ్ఞా రూపమున వ్రాయబడియున్నవి ఇటులే 'వై', 'మో' మొదలగు యక్షరముల పరిశీలింపుడు. 'ఐ' కారము పలుకవలసి వచ్చినప్పుడు '౼'ఐత్వము చూపుచు, తోడుత '౼' ఎత్వముగూడ చూపుట యనవసరముగాదా. 'మో' యందు 'ఓ' కారము- 'ఏ' 'ఆ'లు చేరిన 'ఓ' యగుట—సంధియందు సమంజసము గాని, యది యక్షరములమీద సాధించు టేల! ఇట్లు హల్లులకు సంజ్ఞారూపమున చూపవలసిన యవసరము నాగర లిపియం దెక్కువగ నుండదు అవి గుణింతమున యక్షరములకు ముందును, వెనుకను కలిసిపోవును నాగరలిపిలో సంజ్ఞారూప మచ్చులకు మాత్రము వర్తించును. అందును తెలుగునందువలె నొక్కొక్క యక్షరమున కొక్కొక్కచోట గుణింతము చేయుట యెక్కువగ నుండదు 'క' 'ఖ' 'గ' 'మ' 'హ' యక్షరముల కచ్చుగుణింతము నేకముగ నుండును.

ఆంధ్ర లిపి యందలి లోపములను సవరించుట కన్నను, ముద్రణాది కష్టముల నివారించుటకన్నను, నాగర లిపి వలని లాభములు ముఖ్యముగ గమనింపదగి యున్నవి సంస్కృత భాషా సంబంధ మత్యధికముగాగలయాంధ్రభాషను నాగర లిపిలో రచించిన—ప్రతియాంధ్రుడు దేవభాషయగు సంస్కృతమును, జాతీయ భాషయగు హిందీనిచదువగలడు. సంస్కృతాంధ్రభాషా పదజాల మేకమగుటచే నద్దముగూడ చేసికొనగలడు. హిందీ యందుగూడ సంస్కృత పదము లధికమగుటచే యాంధ్రభాష జాతీయ భాషకు సామీప్యమున జేరును. హిందీభాషతో సంబంధ బాంధవ్యములుగల తదితరోత్తర హిందూదేశ భాషా పదజాలముతోగూడ చేరిక గలుగును. ఆంధ్రము పుట్టుకఆదిగా సంస్కృతపద భూయిష్ఠమైనది. కాలక్రమమున ద్రవిడభాషలన్నిటితో స్నేహమలవరచుకొనియున్నది. ఇకమీదఆర్యభాషలన్నిటితోగూడ సంబంధముకలిగియుండుటకు నాగర లిపి మార్గము కాగలదు. అనగా భారతదేశమునగల ప్రతిభాష

[illegible] నాంధ్రు లొక్కరే. ఇతరుల కిట్టి యవకాశము లేదు. ఎందువలన ననగా నితర ద్రవిడభాషలకు సంస్కృత సంయోగము తక్కువ. అందుచే నవి యార్యభాషల నలవరచుకొన లేవు, ఆంధ్ర భాషోన్నతినందుకొన లేవు ఇక నార్య భాషలన్ననో వానికి ద్రవిడభాషలతో చేరిక యపలేలేదు. అవి యేవియు నాంధ్ర భాషకు సరితూగవు. స్వతంత్ర భారత భూమియందు జాతీయ భాషయగు హిందీ సర్వతోముఖవృద్ధి నొందగలదనుట నిస్సంశయము అట్టి వృద్ధి యాంధ్రభాషకుగూడ నందుబాటులో నుండవలయునన్న నాగరలిపి తెలిసియుండవలయును. దేశమునకు సంబంధించిన వార్తా పత్రికలు, ప్రభుత్వ కార్యక్రమము తెలియవలయునన్న నేకలిపికి మించిన మార్గము లేదు.

తమిళనాడునందు హిందీ నేర్చుకొనుటకే వ్యతిరేక ప్రచారము జరుగుచున్నది. అటువంటి సమయమున నాగరలిపి ఆంధ్రులనుసరింతురా యనవచ్చును. తమిళ భాష వేరు. అందలి యుచ్చారణాశబ్దములు వేరు. నాగరలిపి ఆంధ్రమునకు బోలి తమిళమునకు సరిపడదు. ఇక భాషాపరిజ్ఞానమన్ననో, ఆంధ్రదేశమున సంస్కృతపండితులెక్కువ. ఆంధ్రులలోగల హిందీనెఱిగిన వారు దక్షిణ హిందూస్థానములో మఱియే భాష మాట్లాడువారిలోను లేరనవచ్చును ఆంధ్రభాషా లిపి వేరైనప్పటికీ, ఆంధ్రులకు నాగరలిపి క్రొత్తదిగాదు. ఆంధ్రలిపి యందముగా నుండుట నిజమే. కాని నాగరలిపి యందమున నాంధ్రలిపికేమాత్రము తీసిపోదు నాగరలిపి యనుసరించుటచే, నాంధ్ర కవితాలక్షణములందు నే యక్షర మాత్రము మార్పుగాని

కాదు. భారత భాగవత [illegible] గ్రంథములందు, మను వసుచరిత్రాది ప్రబంధములందే మార్పును గలుగదు అలంకార ఛందోలక్షణములు మక్కికి మక్కిగానే యుండును. అంతియేగాక ముఖ్యముగా బాలురకు గుణింతము సులభసాధ్యము కాగలదు.

ఆంధ్రభాషకు నాగరలిపి వాడుటచేత నెట్టిలోపముగాని, నష్టముగానియుండదు. మీదు మిక్కిలి భాషాలిపి యుత్కృష్టమగుటయేగాక, ఆంధ్రజాత్యభివృద్ధి కత్యధిక లాభకరమగును. సంగీత సాహిత్య రాజకీయములందు ముందు కాలిడిన ఆంధ్రు లీ విషయమున మార్గదర్శకులు కావలసియున్నారు ముఖ్యముగ విద్యార్థులు తమ మిత్రులకు లేఖలను నాగర లిపిలో వ్రాయుటతో మొదలిడవచ్చును. వార మాస పత్రికలు కొన్ని కొన్ని వ్యాసములను నాగర లిపిలో ప్రకటించుచు మార్గము చూపవచ్చును. దేశీయభాషలన్నిటికి నాగరలిపి యవసరమైనను కాకున్నను, తెలుగుభాష కది యవసర మగుచున్నది.

---



# మేనక వేదాంతం



"గోపాల చక్రవర్తి"

వెల్లి విరిసిన వెన్నెల, రాధికాదేవి తెల్లచీరవలె బొండుమల్లియ పూలవలె వెల్తురు వానవలె, ధాత్రినంతా ఆక్రమించుకొన్న రేయి. ఒంటిగంట అయిందేమో! మనుష్యుల్నీ, మహాపట్టణాన్నీ విడిచి మానసాన్ని ఏదో మహత్తర నిశ్శబ్దం మ్రింగి వేయగా మాలతినీ, మాధవినీ తలుచుకుంటూ మత్తుగా నడుస్తున్నాను. మస్తిష్కపు మారు మూలల్లో సుమధుర ప్రాచీనస్మృతులు వేడిగా పాటలు పాడుతున్నాయి.

ప్రశాంత వాతావరణం, మిలమిలా మెరిగెత్తే ఏటినీరూ, ఊహాలోకపు సుఖజీవితాన్ని రంగుల్లో చూపిస్తున్నాయి. రంగుల అతివాస్తవికపు టర్థాల్ని విడమర్చి చెప్పేందుకు నాకు శక్తిలేదు.

...నడుస్తున్నాను.

"చూడు వెన్నె లెంత ప్రశాంతంగా వుందో. ప్రపంచ కల్మషాన్నీ పాపాల్ని తుడిచిపెట్టడానికి వొచ్చింది" అన్నాడు, వెనకటికి కవి మిత్రుడు. ఈచెట్లూ, వెన్నెలా, అమ్మాయిలూ, ఏళ్లూ, జల పాతాలూ లేకపోతే ఎంతఘోరం, ఎంతఘోరం. అందంతో, దివ్యానుభూతులతో సుఖపడవచ్చు, తృప్తిపడవచ్చు- వేదకాలపు ఋషుల నాయు భక్షణంవలె.

తల పైకెత్తి చూశాను. రెండు కొబ్బరిచెట్ల మధ్యనుంచి నింగి దొరసానిపీపువలె గోచరిస్తున్నది. దూరంగా ఎవరో ఇసుకలో పడుకొని చంద్రుణ్ణి చూస్తున్నారు. 'చందురుని చాతకము వలచేనా'—

నడుస్తున్నాను. అర్థంకాని జీవిత సమస్యల గూర్చి ఈ సమయంలో ఆలోచించకూడదు. అవన్నీ లోకాంతర గాథలు. "దూరపు మానిసి" లేచాడు. పరికించి చూశాను. పరిచయమైన ముఖం మళ్లీ గోచరించింది. మానసికాకాశంలో మబ్బులు లేవు.

ఎవరది, చక్రపాణి కాదుకదా.

ఆహా! నే ననుకున్నది నిజం. నా రసజగత్తుకు చక్రవర్తి చక్రపాణి. నా ప్రతి మాటకూ పుష్టినిచ్చి ప్రాణంపోసిన చక్రపాణి.

'ఇక్కడికెట్లా వచ్చావు'

'ప్రపంచ భ్రమణంలో శాంతికోసం పరిశోధించాను. ఎచ్చటా గోచరించలేదు. నేడీ రమ్య బృందావనానికి వచ్చాను"

'ఎంతకాలానికి, ఎన్నేళ్లకు మళ్లీ! నీ శ్రావ్యమైన గొంతుక!'

ఒక్కసారిగా మనోవల్మీకంలోని జ్ఞాపక సర్పాలు పడగలన్నీ విప్పి బుసలుకొట్టాయి. యుంగ యుగాల తమము అస్థిపంజరాన్ని విడిచిపెట్టింది. పాత కథలన్నీ (చుట్టూ పాడువడ్డ గోడలు లేవు గాని!) మళ్లీ వికసించాయి.

నిజానికి నేనే ఖర్మంకాలి నా జీవిత చరిత్ర ప్రకటిస్తే ఆరోజులనుగూర్చి తీవ్రంగా, దీర్ఘంగా వ్రాసేవాణ్ణి. ఊహా త్రివర్ణచిత్రాలు యథార్థానికి వర్ణరహితంగా వుండొచ్చు. ఆ దినాల్లో ఎన్ని ఆశయాలు? అప్పటి జీవితానికీ, మోయలేని బరువులతో ఈడ్చే ఈ జీవితానికి ఎంత వ్యత్యాసం!

"ఎంత వెదికినా కాన్పించదు మేనక" అన్నాడు చక్రపాణి. ప్రక్కన నేను లేనట్టుగా భావించాడేమో.

"ఎవరోయి మేనక"

"సాధారణమైన అమ్మాయి" అన్నాడు చక్రపాణి.

"ఆస్కార్ వైల్డు" అనంతంలో మెదిలి "ఏ వుమన్ ఆఫ్ నో ఇంపార్టెన్స్" అన్నాడు.



"మూడో సంవత్సరంలో మేనక కళాశాలలో చేరింది...సన్నగా,
నాజూకుగా, యక్షకన్యవలె"

"సమాజ పురోగతికి సాధారణ పరికలే పునాది రాళ్లు"- వేదాంతి నాలో పలికాడు.

వెన్నెల మరీ ఎక్కువైంది. రాధికాదేవి వలపు వలె. సుమకన్నియల శరీర వాసనల్ని సావధానంగా ఆఘ్రాణిస్తున్న నన్ను "అట్లా కూర్చుందామా" అన్నాడు చిన్ననాటి మిత్రుడు.

నాకు నిద్రవస్తున్నది. ఒడలువిరిచి ధూమంలో వ్యోమాన్ని కానిస్తూ మంచుపొగల పొలాలవైపు చూస్తూ, చిక్కని నీలినీడలమధ్య ఇద్దరమూ కూర్చున్నాం. ఆకుల్నీ, కొమ్మల్నీ, వాటిని తాకే చంద్రకిరణాల్నీ చూస్తూ చక్రపాణి రాగాలాపన చేసి నా నరాల్ని నమలివైచాడు.

"చూశావా, మనమిద్దరమూ ఒక గదిలో వుంటూ వుండేవాళ్లమా. నువ్వు వెళ్లిపోయిన తరువాత కూడా నేను అక్కడేవుంటూ చదువుకుంటు న్నాను. రెండు సంవత్సరాలు గడిపాను ఆ గదిలో. కాబట్టి దాన్ని విడిచిపెట్టడానికి మనస్కరించ లేదు.

మూడో సంవత్సరంలో మేనక కళాశాలలో చేరింది. సన్నగా, నాజూకుగా, యక్షకన్యవలె. పాఠాలులేని తొలిరోజుల్లో విలాసంగా, విహారాలు చేసేవాళ్లం. రోజూ ఆమెను చూసేవాణ్ణి. ఆమె కూడా చూసే దనుకుంటాను నన్ను.

గదికి మరలుతున్నా ఒక సాయంకాలం. ఆకసం నిండా మేఘాలు. వ్రేలాడే కారునల్లని ఏనుగుల వలె. దేవవేశ్య ఊర్వశి శిరోజాలవలె.

క్రమంగా, క్రమంగా వాయుదేవుడూ, వరుణ దేవుడూ సరసాలాడుకోవటం ఆరంభించారు. బాటకిరువైపులా నిల్చి వున్న వృక్షమూర్తులు బాంధులను చూసి నవ్వుతున్నాయి.

ఆశ్చర్యం!

మేనక నా వెనకనే వస్తున్నది. గువ్వపిట్టవలె ఒదుచుకొని వస్తున్న ఆమెను చూసి స్మికం చేశాను, అనుకోకుండా. చిర్నగవుతో "పూర్తిగా తడిసిపో యాను" అన్నది తోయజాక్షి.

బీథోవెన్ నా నరాల్ని మీటుతున్నాడు. పార్వతి ఒంటికాలి ఆంగ్లనృత్యంలా నా గుండె పాటలు పాడింది. నిశ్శబ్దపు హృదయగోళంలో చందురుని చూసిన గభీర సాగర కల్లోలాన్ని విన్నాను.

"ఇంటికి పోదాం రండి" అన్న మేనకాదేవిని బలవంతాను. కొన్ని పందుల పద్మవ్యూహాలను దాటి ఒక "సాన్మిక్ కేఫ్" చేరుకున్నాం. వర్షంలో తడిసిన ఒక నగ్నమూర్తి ఆయిల్లు.

"ఇట్లా కూర్చో రామూ" అని నన్ను కూచో పెట్టి లోపలికి వెళ్లింది. మండోదరీ రావణుల (రాక్షస) ప్రణయంనుండి భరతాచార్యు డెవడో శిష్యులకు పాఠం చెప్తున్న సున్నితమైన వస్తువు దాకా గోడలనిండా చిత్రాలున్నాయి. ఒకమూల ఎన్నో పుస్తకాలు ముచ్చటగా సింగారించుకొని కూర్చున్నవి. దగ్గరకు వెళ్లాను. తొలి పుట తీయడం తోటే మేనకకు—అని వ్రాయబడి వున్నది.

మెరుపు కన్నియల నృత్యం విపరీతంగా వున్నది బయట. మౌనంగా యథాస్థానంలో కూర్చు న్నాను.

మూర్ఛపోయినంత పని అయింది. పాలసముద్రపు నురు కెరటాలవలె, ధవళమైన మడతల చీరతో, లవంగపు గులాబీరేకులతో, నక్షత్ర మండలాలనుండి ఒక జవ్వని దిగి వచ్చింది. తలనిండా విరిసిన పూలతో ఇంద్ర ధనుస్సులా వంగిన మేనకను చూడ్డంతోనే రసజీవనంలోని రహస్యం నాకు గోచ రించింది.

'ఎవరమ్మా నీవు? ఈ గదిలోకి ఎందుకు వచ్చావు'

'ఒక అమ్మాయి తీసికొని వచ్చింది'

'అమ్మాయిని రమ్మంటే వెళ్లిపోతావా వాళ్లతో. అసాధ్యుడి వింతకీ' అన్నది మేనకా దేవి.

ఇద్దరం నవ్వుకున్నాం. చిక్కని పాపికొండలూ, గోదావరీ ఎదురుగుండా వున్న చిత్రంలో కానిపిం చాయి.

ఆ మూడు సంవత్సరాలూ అట్లాగే గడిచి పోయాయి. చిత్రంగా చిత్రాలను చూపిస్తూ నా చేత చిత్రకవిత్వం చెప్పించింది. తాను చెప్పింది.

మా ఇద్దరిలో లోలోపల లోతుగా వున్న సాహిత్యశక్తి ఇద్దరినీ ఒకటిగాచేసి సారస్వత గానం చేయించింది.

నీవులేని కొరత తీర్చింది గోపీ! మనుష్యులకూ, మనీషులకూ దూరంగాతిరిగే నన్నుకదిపి ఇది చీకటి, ఇది వెలుతురు. ఇది అబద్ధం, ఇది నిబద్ధం అని చెప్పింది మేనకాదేవి.

స్మృతినాలరి శైశవంలో నా మాతృమూర్తి దూరతీరాలకు పయనించింది. అప్పటినించి ఆద

రించి ప్రేమతో చూసే స్త్రీమూర్తి కరవయింది నాకు. కాని మేనకమాటలు, జోలపాటలు నాకు వెన్నెల మాటలు. అప్పటి నా ప్రపంచానికి పరిధిలేదు.

ఇంతకూ మేనక ఏమయిందని నీ సందేహం. ఎవరో ఒక ఎనుబోతుల రామదాసుని కోరి పెళ్ళి చేసుకుంది. వెళ్లిపోతూ మేనకాదేవి పల్కిన వాక్యాలివి.

"చూడు, రామూ- సుందరమైన వస్తువులకూ, ఆర్టిస్టులకూ దూరంగా వుండాలి. జీవితాన్ని ఊహించేవాని కది సుఖం, అనుభవించినవానికి దుఃఖం సుమీ! చిరకాలం వుపయోగిస్తే వస్తువు మీద అభిమానం నశిస్తుంది. సుప్రసన్నతా రోచిస్సు తెల్లవేళలా తాండవంచేయు నీ వదనాన్ని ఎట్లా మర్చిపోతాను? నా గుండెల్లో హోరుమని, ఘోరుమని నువ్వు కురిపించిన ముత్యాలవానను ఎట్లా మర్చిపోతాను. కాని వెళ్లిపోవాలి రామూ, అశాంతి, ఆకలీ, కరువూ, కాటకంతో నిండిన ప్రపంచంలోకి వెళ్లాలి."

శ్వేతద్వీపపు ఏకరాణి ఆమె నవ్వుతూ నిష్క్రమించింది. జలపాతాల మీద చంద్రకన్యల నాట్యదరహాసంతో ఆమె నిష్క్రమించింది. ఇట్లా నేనుమాత్రం సెలయేళ్లతో, చెట్లతో నవ్వుతుంటూ, తెలియనిబాధలో పాడుకుంటూ సంచరిస్తున్నాను."

చక్రపాణి ఆగిపోయాడు. మొహంలో అస్పష్టపు విచారరేఖలు చూశాను.

నిశ్శబ్దాపరచుకొన్న రాత్రి. తియ్యని చంద్రకిరణాలు మరీ తెల్లనైపోతున్నాయి. ఆ విశాల సైకతాల్లో తొలిజీవితపు నిషా గురించి చక్రపాణి చెప్పిన మాటలనీ, మేనకాదేవినీ టెక్నికలర్‌లో ఊహిస్తూ, మరోసిగరెట్టు మైకంతో వెలిగించానేమో.

# ఆంద్రీ జదనోవ్: ఒక సింహావలోకనం

సోవియట్ రష్యా అగ్రనాయకుల్లో ఆంద్రీ జదనోవ్ ఒకడు. స్టాలిన్ తరవాత రష్యా నాయకత్వం ఎవరికి వస్తుంది?- అనే ప్రశ్న వచ్చినప్పుడల్లా, ప్రతివారికీ జదనోవ్ పేరు తప్పకుండా స్ఫురించేది. అతడి మరణానికి సంతాపం తెలుపుతూ సోవియట్ దేశమూ, సోవియట్ కమ్యూనిస్టు పార్టీ ఒక అమూల్యమైన నాయకుణ్ణి కోల్పోయామని రష్యా ప్రభుత్వం యిటీవల అంది.

జదనోవ్ ఇంత అపారమైన పలుకుబడీ, అధికారం దేశంలో ఎలా సంపాదించగలిగాడు? అతడి జీవితం గురించి చదువుతుంటే, ఆ ప్రశ్న సహజంగా వస్తుంది. ప్రభుత్వంలో మంత్రిగా పని చెయ్యలేదు; కఠినతరమైన ఏ ఉన్నత రాజకీయోద్యోగమూ చెయ్యలేదు. పెద్ద పరిశ్రమల్ని నిర్మించిన వాళ్లలో ఒకడు కాదు. మొన్న మొన్నటి దాకా, మరుగునే ఉంటూ వచ్చాడు. అయినా మొన్న అతడు చనిపోయినప్పుడు సోవియట్ అధికారులు చేసిన ప్రకటన గమనిస్తే, జదనోవ్ ప్రాముఖ్యం తెలుస్తుంది.

కమ్యూనిస్టు పార్టీ ఆమోదం లేకుండా సోవియట్ రష్యాలో ఏ పనీ జరగదు. స్వదేశంలోనే కాక, కమ్యూనిస్టు పరిపాలనలో ఉన్న అన్ని దేశాలమీదా ఆ పార్టీ ప్రాబల్యం ఉంది. అటువంటి పార్టీకి రాజ్యాంగశాఖ అయిన పాలిట్ బ్యూరోకి జదనోవ్ అగ్రనాయకుడు. అందుచేతనే నిజమైన అధికారం చేతిలో ఉన్నవాళ్లల్లో ముఖ్యుడయాడు. పరిపాలన దినదిన వ్యవహారాలతో సంబంధం పెట్టుకోకుండా, ఇంకా ఉన్నత విషయాలపై దృష్టి కేంద్రీకరించాడు. మార్షల్ స్టాలిన్ పర్యవేక్షణక్రింద-ప్రభుత్వ ఆదర్శాలు నిర్దేశించడంలోనూ, మార్క్సిస్టు సూత్రాలు ఆచరణలో పెట్టే మార్గాలు అన్వేషించడంలోనూ కృషిచేశాడు. అందుకే ప్రత్యేకమైన స్థానం సంపాదించుకున్నాడు.

రెండవ యుద్ధం ముగిసిన తర్వాత సోవియట్ ప్రభుత్వం, తన విధానంలో అనేక మార్పులు చేస్తోందని కొందరు అభిప్రాయ పడ్డారు. ప్రభుత్వపు వ్యవహారాలు కొన్నిటిలో కమ్యూనిష్టుపార్టీ జోక్యం చేసుకోవడం లేదనీ, క్రమంగా సోవియట్ ప్రభుత్వం పరిణామం చెందుతోందనీ కొందరన్నారు. మంత్రుల సంఖ్య పెరిగింది. పార్టీ అధికారం తగ్గిపోయిందనుకోడానికి అదొక సూచనగా భావించారు. మిలిటరీ సర్వసేనానులకుండే పలుకుబడి, దేశభక్తికి ప్రభుత్వం ఇచ్చిన ప్రాముఖ్యము, పారిశ్రామికులు చురుకుగా పని చెయ్యాలని పదే పదే చేసే ప్రబోధనలు—ఇవన్నీ సోవియట్ ప్రభుత్వ విధానంలో మార్పులు వస్తున్నాయనే ఆలోచనకి దోహదం ఇచ్చాయి.

అయితే, అందరూ భ్రమించినట్టు అసలు వైఖరిలో మార్పులేమీ రాలేదు; మంత్రుల సంఖ్య అరవై వరకూ పెరిగింది; అయినా, వాళ్లు అంతర వర్గానికి మరింత బలాన్నే సమకూర్చారు. కమ్యూనిష్టుపార్టీ పాలిట్‌బ్యూరోలే అంతరవర్గం. దానికి నాయకుడు స్టాలిన్: అతని అనుచరులు- మాలటోవ్, మాలెంకోవ్, బెరియా, ఆండ్రియెవ్, కగనోవిచ్, మికోయాన్, మొదలైనవారంతా అందులో ముఖ్య సభ్యులు.

ఈ సోవియట్ బ్యూరోలోనే సోవియట్ ప్రభుత్వ విధానం నిర్ణయింప బడుతుంది. తరవాత కేంద్రకమిటీ ఆమోదించాలి. అందులో సుమారు డబ్బయిమంది సభ్యులున్నారు. కేంద్రకమిటీ ఆమోదించిన తరవాత, ఏ నిర్ణయమైనా విధిగా అంతా అనుసరించి తీరాలి.

పాలిట్ బ్యూరో ఒక శిఖరంలాంటిది. సైన్యమూ,స్థానిక ఉద్యోగులూ,మంత్రులూ,వీరందరి మీదా ఒక పక్క అధికారం చెలాయిస్తుంది. ఇంకొక పక్క దేశంలోని ఆరు మిలియన్ల కమ్యూనిష్టుపార్టీ సభ్యులమీదా అజమాయిషీ చేస్తుంది. కార్యాలయాలు, కర్మాగారాలు, ప్రతిచోటా పార్టీ మెంబర్లు కమ్యూనిష్టుపార్టీ ఆదర్శాలు అంతా అనుసరించేటట్టు చూస్తారు. యీ పార్టీ శిక్షణకి లోబడే సోవియట్ రష్యాలో అన్ని పనులూ జరుగుతాయి. దేశంలో నలుమూలలా అల్లుకున్న కమ్యూనిష్టుపార్టీకి మెదడులాంటిది పాలిట్ బ్యూరో. పార్టీలో క్రమశిక్షణ, అప్రమత్తత, సామర్థ్యంతో పనిచెయ్యడం- ఇవన్నీ జదనోవ్ వృద్ధిచేశాడు.

"స్వవిషయాల గురించి ఎంత మాటాడినా, రష్యనులకు విసుగు అనేది వుండదు. తమ వ్యక్తిత్వము గురించిన తీయ అభిప్రాయాలు సరి అయినవే నని బయటివాళ్లెవరైనా హామీ యిస్తేగాని తృప్తి ఉండదు" అన్నాడు గోర్కీ. అటువంటి హామీయే దేశ ప్రజలకి జదనోవ్ పదేపదే ఇస్తుండే వాడు. కొమిన్ ఫారమ్‌కి నాయకత్వం ఇతడే వహించాడు. అతని తత్వానికి సరిపోయిన పని అది. యుద్ధానంతరం రష్యా అవలంబిస్తూన్న విదేశాంగ నీతికి జదనోవ్ బాధ్యుడని కొందరి అభిప్రాయం. పశ్చిమ ప్రజాస్వామిక ప్రభుత్వాలతో కలిసి పని చెయ్యడంలో జదనోవ్‌కి ఏమాత్రమూ విశ్వాసం లేదని కొందరి వాదన. కాని అది పూర్తిగా నిజం కాదు. సోవియట్ రష్యా విదేశాంగనీతి బోధ పరుచుకోవడం అంత సులభం కాదు. ఇంతవరకూ వారి వైఖరిపట్టి చూస్తే, సోవియట్ రష్యా తన ప్రాబల్యాన్ని విస్తరింప చెయ్యడానికి నిరంతరం ప్రయత్నిస్తోంది; ఆ ప్రయత్నంలో సామ దాన భేద దండోపాయాలన్నీ ప్రయోగిస్తోంది. తమను ఢీకొన్న తక్కిన ప్రభుత్వాల పలుకుబడులతో సంఘర్షిస్తూ, మళ్లీ ఆ ప్రభుత్వాలతో కొన్ని ఒడంబడికలు చేసుకుందికి ప్రయత్నిస్తోంది. యీ పరస్పర విరుద్ధ వైఖరులు ఏకకాలమందే ప్రదర్శిస్తోంది.

తక్కిన శక్తులతో సంఘర్షించే కార్యకలాపం జదనోవ్ పాలబడింది. కొమిన్ ఫారమ్ ముఖ్యమైన ఆయుధంగా చేసుకుని, తూర్పు యూరప్‌లో తమ ప్రాబల్యం స్థాపించాడు.

"కజ్జలరేఖ"



# ఇల్లలుకగానే పండుగ కాదు

కె. సన్యాసయ్య

హైదరాబాదు సంస్థానంమీద ఇండియా ప్రభుత్వం తీసుకున్న సైనికచర్యల ఫలితంగా ఆ సంస్థానం కూడా ఇండియాలో చేరడానికి నిశ్చయించుకోవడంతో అక్కడ మన ప్రభుత్వం పరిష్కరించవలసిన సమస్యలు ప్రాముఖ్యం వహించాయి. భారతదేశం మధ్యభాగంలో మధ్యయుగంలోని నాగరకతను తలపునకు తెచ్చే ఒక సంస్థానం, దేశం అంతటితోటి సమానంగా ముందుకు సాగే అవకాశం సంపాదించుకుంది. ఈ హైదరాబాదు సమస్య పరిష్కారం అయిన పరిస్థితులూ, మార్గాలూ, ఫలితాలూ ముస్లిం ప్రజలకు ద్విజాతి సిద్ధాంతం, పాకిస్తాన్ నిర్మాణాలవల్ల కలిగిన, కలగబోయే నష్టానికి సూచకాలు. పాకిస్తాన్ నిర్మాణం కాకపోతే ఇండియా అంతటా, ముఖ్యంగా హైదరాబాదు వంటి ముస్లిం సంస్థానాలలోనూ, మహమ్మదీయులు రాజకీయంగా వారి జనసంఖ్యకు మించిన ప్రాముఖ్యాన్ని పొంది ఉండేవారు. కాని దేశ విభజనతో అలాంటి విధానానికి అవసరం లేకుండా పోయింది. పాకిస్తాన్ నిర్మాణం, ఇండియాలోనూ, హైదరాబాదువంటి సంస్థానాలలోనూ ఉన్న మహమ్మదీయులకు ఎంతవరకూ లాభకరంగా పరిణమించినదీ, క్రమంగా ముందు ముందు స్పష్టపడగలదు.

హైదరాబాదులోని సమస్య మతసమస్యకాదు. హైదరాబాదు నవాబు మహమ్మదీయుడైన కారణంచేత ఇండియా ప్రభుత్వం అతడిమీద యుద్ధం ప్రకటించలేదు. అక్కడి సమస్య ముఖ్యంగా రాజకీయ సమస్య. రజాకార్లు ప్రత్యేక సైనిక సంస్థగా ఏర్పడి, అక్కడి ప్రజానీకానికి శాంతిభద్రతలు లేకుండా చేశారు. అక్కడ వారు చేసిన దుండగాలు ఏ నాగరక ప్రజలకేనా అవమానకరాలు. వారు నైజాం పాలకునికూడా తమ అధీనంలోకి తెచ్చుకుని, అక్కడి ప్రభుత్వాన్ని వశపరచుకొని, ఫాసిస్టు మార్గాలద్వారా ప్రజలమీద దుండగాల్ని సాగించారు. హైదరాబాదులోని హిందువులేకాక, రజాకార్ల రాజకీయ సిద్ధాంతాలని అంగీకరించని కొద్దిపాటి మహమ్మదీయులుకూడా వారి హింసలకి లోనయ్యారు. అంతేకాదు. సరిహద్దు ప్రాంతంలో ఉన్న ఇండియా గ్రామాలుకూడా వీరి బారినుండి తప్పించుకోనలేక పోయాయి. అక్కడ శాంతి నెలకొల్పడానికి ఇండియా ప్రభుత్వం తన సేనలని సికిందరాబాదు, బొలారం, తిరుమలగిరి మొదలైన చోట్ల నిలపడానికి నిర్ణయించి కృతార్థత పొందింది.

హైదరాబాదులో బాధ్యతాయుత ప్రభుత్వం నెలకొల్పడానికి హైదరాబాదు సంస్థాన కాంగ్రెస్, ఆంధ్రమహాసభ, కమ్యూనిస్టులూ, ఏకముఖంగా ఆందోళన జరుపుతూవచ్చారు. కాని అలాంటి ప్రభుత్వం రావడంతోటే సంస్థానంలో మహమ్మదీయుల ప్రాబల్యం తగ్గిపోతుందనే భయంతో వారు ఆ ఆందోళనని ప్రతిఘటించారు. జనసంఖ్యలో నూటికి పదిహేనుగా మాత్రం ఉన్న మహమ్మదీయులు రాజకీయంగా ప్రజలందరికీ ఏకైక ప్రాతినిధ్యం వహించి, మిగతా మతాలకి చెందిన ప్రజలమీద అధికారం చెలాయించడం అన్యాయం, అక్రమం. అందువల్ల హైదరాబాదు ప్రభుత్వంలోనూ, ఉద్యోగాలలోనూ మహమ్మదీయులకు గల అన్యాయ ప్రాతినిధ్యం తీసెయ్యడం మొట్టమొదట చెయ్యవలసిన పని. మహమ్మదీయుల జనసంఖ్యకు తగినట్లుగా వారికి ప్రభుత్వంలోనూ, ఉద్యోగాలలోనూ స్థానాలు నిర్ణయించాలి. ఆపని వెంటనే చెయ్యడం కష్టం అయితే, క్రమంగా ఈ పరివర్తనం కలిగేటట్లు చెయ్యాలి.

ఇక, నైజాం పాలకుడుకూడ అన్ని అధికారాలతోనూ ఉన్న నిరంకుశ పాలకుడుగా కాక, ప్రజాస్వామ్యంలో ఒక అంగంగామాత్రం ఉండాలి. అతనికిగల నిరంకుశాధికారాలు అన్నీపోయి, అధికారం యావత్తూ వయోజనులచేత ఎన్నుకోబడ్డ ప్రజాప్రతినిధుల హస్తగతం కావాలి. మిగతా సంస్థానాధీశ్వరులు ఏవిధంగా ప్రజాభిప్రాయం ప్రకారం నడచుకోవాలో, నైజాం పాలకుడుకూడా

ఆవిధంగానే నడుచుకోవాలి. ఇందుకుగాను ప్రజాభిప్రాయం ప్రకారం నూతన రాజ్యాంగవిధానాన్ని తయారుచేయించి అమలులో పెట్టాలి.

హైదరాబాదులో అన్నిటికంటే ముఖ్యంగా చెయ్యవలసినది వ్యావసాయిక విధానాలలో మార్పు. హైదరాబాదులో అనేక జాగీర్లు ఉన్నాయి. ఈ జాగీరుదార్లు సంస్థానంలోని ఫ్యూడల్ విధానానికి పట్టుగొమ్మలు. జాగీరుదార్లు హిందువులైనా, మహమ్మదీయులైనా వారి జాగీర్లని రద్దు చెయ్యాలి. సంస్థానంలో మధ్యయుగానికి సంబంధించిన పద్ధతుల్ని సంస్కరించాలంటే ఇది చాలా అవసరం. అక్కడి నౌకర్లు, తదితర పరిచారకులు చేసే ఊడిగం అమానుషంగా కనిపిస్తుంది. ఈ దుర్భర పరిస్థితులే ఇంతవరకూ వ్యాపించిఉన్న అరాచకాన్ని ఆధారంగా చేసుకుని జరిగిన కమ్యూనిస్టు ప్రచారాన్ని బలపరచాయి. ఉన్నతశ్రేణికీ, మధ్యతరగతికీ చెందిన ప్రజలపై దాస్యవృత్తిచేత జీవించే శ్రామికులకి అవిశ్వాసం, అసహ్యం ప్రబలమయాయి. ఇలాంటి దుర్భర జీవిత పరిస్థితులే ఎక్కడేనా కమ్యూనిజం మొదలైన తీవ్ర రాజకీయ సిద్ధాంతాలికి సారవంతమైన ప్రదేశాలు. మనం రాజకీయాభ్యుదయాన్ని విప్లవమార్గాలవల్ల కాకుండా సంస్కరణ మార్గాలవల్ల సాధించాలంటే విప్లవ జనకాలైన స్థితిగతుల్ని చక్కబెట్టుకోడం అవసరం. శ్రామికులని బానిసలుగా కాకుండా సౌఖ్యానికి స్వేచ్ఛకీ హక్కుగల మానవులకింద చూచే టట్లుగా మనం అక్కడి ఆర్థిక విధానాల్ని సంస్కరించాలి.

సంస్థానం అంతటిలోనూ ప్రజాస్వామ్యాన్ని స్థాపించాలి. ఇంతవరకూ అక్కడి గ్రామోద్యోగులకూ, పోలీసులకూ ఉన్న అధికారాలికి అంతం లేదు. వారికి ప్రజా సామాన్యంమీద గల అధికారాలు ప్రజాప్రతినిధులకి ఒప్పచెప్పాలి. సామాజిక స్వాతంత్ర్యం ప్రజలకి ఇయ్యాలంటే తరతరాలుగా వస్తూన్న సామాజిక సంబంధాల్ని సంస్కరించవలసి ఉంటుంది. ప్రజాసామాన్యానికి వారి బాధ్యతలూ, హక్కులూ బోధించవలసిన అగత్యం, హైదరాబాదు మిగతా ఇండియాకంటే విద్యావిషయకంగా చాలా వెనకబడి ఉందని గుర్తిస్తే స్పష్టమవుతుంది.

హైదరాబాదు మనదేశం ఆర్థికజీవితంలో సముచిత పాత్ర నిర్వహించాలి. కొన్ని చారిత్రిక సంఘటనల ఫలితంగా నేటి హైదరాబాదు ఒక రాజకీయవిభాగంగా ఏర్పడింది. నిజానికి భూవిభాగరీత్యా హైదరాబాదు ప్రత్యేకరాష్ట్రంగా ఉండవలసిన పనిలేదు. హైదరాబాదు ప్రజలకీ, చుట్టూరాష్ట్రాలలోని ప్రజలకీగల సన్నిహితత్వాన్ని మనం గుర్తిస్తే, హైదరాబాదును మూడు భాగాల కింద విభజించి, నూతన రాజ్యాంగంలో ఏర్పడబోయే మహారాష్ట్ర, కర్నాటక, ఆంధ్రరాష్ట్రాలలో కలపాలనే సూచన ఎంత బలిష్ఠమైనదో మనకి గోచరిస్తుంది. కాని అంతవరకూ హైదరాబాదుని మన దేశంలోని ఆర్థికజీవితంలో ఒక భాగంకింద పరిగణించాలి. వ్యాపారం స్వేచ్ఛగానూ, నిరాటంకంగానూ జరగాలంటే, హైదరాబాదులోని ప్రత్యేక సుంకాలిని రద్దుపరచాలి. అదేవిధంగా అక్కడి ప్రత్యేక నాణేలనికూడా రద్దు చెయ్యాలి. ఈ రెండూ హైదరాబాదు సంస్థానం సర్వస్వతంత్రమైనదనే భ్రమని కలిగించడానికి ఉపకరించే బాహ్యచిహ్నాలు. దక్షిణాపథంలో ఆర్థిక సమస్యలను సమగ్రంగా పరిష్కరించడానికి, ఈ రెంటినీ రద్దుపరచడం అత్యంతావసరం.

హైదరాబాదు సమస్య సక్రమంగానూ సులభంగానూ ముగిసినందుకు ప్రభుత్వం అభివందనీయం. ఈ విషయంలో ప్రదర్శితాలైన సామదాన దండోపాయాలు ఏదేశం రాజనీతికేనా గర్వకారణాలుగా ఉండగలవు. మన ప్రభుత్వం ప్రదర్శించిన క్షమ, సహనం, హైదరాబాదు సంస్థానం అవలంబించిన మొండితనం, దుడుకూ చరిత్రలో ఆశ్చర్యజనకాలైన వృత్తాంతాలుగా నిలుస్తాయి. కాని ఈ సంఘటనలు హైదరాబాదుపై సైనికచర్యతో అంతంకాక, పైని ఉదాహృతాలైన రాజకీయ, ఆర్థిక సంస్కరణలకి దారితీస్తే దండోపాయం కూడా భారతదేశం అభ్యుదయంకోసమే ఉపయోగిస్తుందనడానికి తార్కాణం అవుతుంది.

---

# వ్యక్తిప్రభావం : రాజకీయపరిణామం

## సర్ ఆర్థర్ సాల్టర్ అభిప్రాయాలు

ఒక మనిషి లేక ఒక చిన్న కూటం ఏమీ లేకుండా ప్రారంభించి, హిట్లరు ముస్సోలినీల వలె, అంతవరకు స్వతంత్ర ప్రజా ప్రాతినిధ్య పద్ధతులపై నడుస్తున్న ప్రభుత్వ సంస్థలను నియంతృత్వ సంస్థలుగా మార్చగలగడంగాని, లేక లెనిన్ వలె ఒక నిరంకుశ పద్ధతిని మరొక నిరంకుశ విధానంగా పరివర్తించడం గాని ఏవిధంగా జరిగింది అనేది ఆధునిక రాజకీయానుభవా లన్నిటిలోకీ ఎక్కువ నిశిత బుద్ధితో పరిశీలన చేయవలసిన విషయం. అట్టి విప్లవకారులు పనిచేసే సంఘంయొక్క మన స్థితి, అక్కడి రాజకీయ విధానంయొక్క దౌర్బల్య స్థితి ఆయా పరిస్థితులకు హేతుభూతం అవుతా యన్న మాట స్పష్టమే. జర్మనీదేశంలో మొదటి ప్రపంచ యుద్ధంలో ఓటమివల్ల కలిగిన మనో వైకల్యం, ఆర్థికమైన దివాలావల్ల కలిగిన అరాజక పరిస్థితీ- ఇటలీలో అప్పటికి ఏర్పడ్డ రాజకీయ అవినీతి, ప్రాతినిధ్య ప్రభుత్వపు దౌర్బల్యం, యుద్ధ పర్యవసానంగా కలిగిన వైఫల్యం- రష్యా దేశంలో జారిస్టు ప్రభుత్వపు దుష్పరిపాలన, ఓటమి వలన సైన్యంలో కలిగిన విచ్ఛిత్తి- ఈ పరిస్థితులు రాగల నియంతృత్వ బీజాలకు అనుకూల క్షేత్రంగా ఉపకరించాయి.

అరాజక పరిస్థితులనుంచి అధికారాన్ని వశపరచుకోడానికి ప్రయుక్తమైన పద్ధతులను, కౌశల్యాన్ని పూర్తిగా అవగతం చేసుకోవలెనంటే లెనిన్, ముస్సోలినీ, హిట్లర్లు ప్రథమంలో ఆచరణలో పెట్టిన చర్యలను బహు సూక్ష్మంగా పరిశీలించవలసి వుంటుంది. ఈసందర్భంలో ట్రాట్స్కీ వ్రాసిన 'రష్యన్ విప్లవ చరిత్ర'లో వర్ణితమైన "ప్రొలిఫెరేటింగ్ సెల్సు" అనే పేరిట పిలువబడిన పద్ధతిని గురించిన వివరాలు ముఖ్యంగా గమనీయం. ఇటలీ, జర్మనీ, రష్యాల అనుభవాలను బట్టి ఇప్పుడు ఇంకా విపులమైన అంశాలు తెలుసుకోడానికి అవకాశ మున్నది కూడా. అన్ని వివరాలు తెలుసుకున్న పిమ్మట ఆయా దేశాలలో ఆయా సమయాలలో గల భిన్న పరిస్థితులనుకూడా గణనలోకి తీసుకోవలసిన అవసరం గుర్తించవలసి వున్నప్పటికీ ఈ విప్లవాలన్నిటికీ సమానంగా వర్తించే సందర్భాలు కూడా తగినంతగా ద్యోతకం కాగలవు.

నియంతృత్వ విధానాన్ని స్థాపించి, తామే నియంతలు అగుటకు వీలైనంత విజయశక్తిని హస్తగతం చేసుకోగలిగిన ఆయా వ్యక్తుల యథార్థ వ్యక్తిత్వ విశేషాన్ని పరిశీలించడం కూడా చాలా ముఖ్యం. స్వతంత్రమైన స్థిర ప్రభుత్వంలోని బలవత్తర వ్యక్తులను గురించిన పరిశీలనకంటె నియంతృత్వ స్థాపన కారకులైనవారి వ్యక్తిత్వంలోని అంతర శక్తిని నిర్వచించడం కష్టతరమైనవిషయం. నిశితమైన మానవ స్వభావ వివేచనా శక్తిగలవాడెవడు గాని ఒకసారి గ్లాడ్‌స్టన్, లాయిడ్ జార్జి, రూజ్‌వెల్టు, చర్చిల్, క్లెమెన్సూలవంటి రాజకీయ నాయకులతో సన్నిహిత పరిచయలాభం పొందిన యెడల వారి వ్యక్తిత్వంలో విశిష్టతను సులభంగా గుర్తించ గలుగుతారు. కాని లెనిన్, ముస్సోలినీ, హిట్లర్లను వారి ఉచ్చదశకు పూర్వం సన్నిహితంగా ఎరిగిన వారిలో చాలామంది ఆ ముగ్గురిలోను అచిరకాలంలో లోకాన్ని కూకటివేళ్లతో కుదుపజాలిన విశిష్ట శక్తి సామర్థ్యాల సూచనలను వేటినీ గుర్తింపజాలక పోయారు.

లెనిన్ ఆకర్షణీయమైన రూప రేఖా విలాసాలుగాని, విశిష్టమైన శక్తి సామర్థ్యాలుగాని కలవాడుగా కనిపించేవాడుకాడు. చిన్న సామంత కుటుంబంలో పుట్టి, నిరంకుశత్వ సంప్రదాయంలో పెరిగినాడు. జెనీవా నగరంలో అతనిని చూచిన వారికి బహు సామాన్య వ్యక్తిగా తోచేవాడు. అతనిలోని ధైర్యసాహసాలుగాని, తరుగని పట్టుదలగాని, విప్లవ కార్యకలాపంలోని నైపుణ్యంగాని తరువాతి రోజులలో అతని విజయవంతమైన చర్యలద్వారానే అభివ్యక్తమైనాయి.

ముస్సోలినీమాత్రం చూచిన వెంటనే కొన్ని విశిష్టమైన శక్తులను, ముఖ్యంగా ఆకర్షణీయమైన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించ గలిగేవాడు. కాని అతడి విషయంలోకూడా రోమునగర దండయాత్రకు ఒక

సంవత్సరం ముందు వరకూ అంత ఉన్నతికి రాగల సూచనలు గోచరించేవికావు.

హిట్లరు పదిసంవత్సరాల వృథా విప్లవోద్యమ కార్యం నిర్వహించిన పిమ్మట కూడా— పూర్ణాధికారం కరగతం ఒనర్చుకునే సమయందాకా— జర్మనీ రాజకీయాలలో అనుభవజ్ఞులైనవారికి కూడా చాలా అప్రధానమైన వ్యక్తిగానే కనిపించాడు. అతని విద్యారాహిత్యం, అతని అల్పోద్యోగానుభవం, హేతుబుద్ధి కోల్పోనివారికి నచ్చచెప్పి కూడబెట్టుకోగల సామర్థ్యం అతనిలో పూర్ణంగా లోపించడం— వీటినిబట్టి అతడు తనకంటె బలవత్తరమైన నాయకునిక్రింద తాబేదారుగా తప్ప స్వతంత్ర నాయకుడుగా నిలబడలేడనే లోకమంతా అనుకున్నారు. కాని అతడియొక్క తరువాతి కాలప కార్యాన్నిబట్టి ప్రాతినిధ్య ప్రభుత్వ వాతావరణంలోనే కనుక అతడు వుంటే రాణించదగిన శక్తిసామర్థ్యాలు కలిగివున్నట్లు బుజువయింది. ప్రాతినిధ్య ప్రభుత్వంలో అయితే అతనిలోని అతివాదం, వైకల్యం అరికట్టబడి మిగిలినశక్తులకు తగిన లక్ష్యం దొరికేది. ఉన్మాదస్థితికి పోతేమాత్రం వెంటనే పదవీచ్యుతుడు కావలసి వుండేది. కాని అప్పుడు సంపూర్ణాధికారాలు కైవసం కాకపోవడంవల్ల అధికారోన్మత్తత కలగడానికికూడా సాధ్యత ఉండేదికాదు. అయితే ప్రజలు ఆరోగ్యకరమైన మానసిక స్థితిలో వున్న ప్రాతినిధ్య ప్రభుత్వ వాతావరణంలో అతనికి అధికారం కరగతం అయ్యేదే కాదేమో అనీ, అప్పుడాతనిలో ఆయా శక్తులు ద్యోతకం అయ్యేవే కావనీ కూడా అనిపిస్తుంది.

విజయవంతులైన విప్లవకారు లందరిలోను చూపట్టే సాహసమూ, ఏదో ఒక లక్ష్యంపట్ల మానసిక కేంద్రీకరణశక్తి కాక హిట్లరులో చూపట్టే విశిష్టశక్తి ఆకాలంలోని జర్మను ప్రజాహృదయంలోని వైకల్యాన్ని అవగాహనచేసుకు, తదను

కూలమైన రాజకీయ వివాదాలను, ఉపద్రవాలను సృష్టించడంలోను, అప్పటి ప్రజానీకంయొక్క విపరీత దృక్పథానికి ఆకర్షణీయమైన ప్రదర్శన ప్రచారపద్ధతుల ననుసరించ గలగడంలోను గోచరిస్తుంది. అతడు ఉచ్చస్థితికి రావడానికి ఆధారం ఈవిధమైన స్వీయవ్యక్తిత్వం ఒకటి-బహుముఖాల విస్తృతంకాగల ఉద్భిజ్జశక్తి (ప్రోలిఫరేటింగ్ సెల్) కేంద్రంగాను ప్రజానీకాకర్షణశక్తి అంచుగాను గల నిర్మాణవిధానం రెండవది. రష్యా ఇటలీలలో జరిగిన మార్పులు తేలినప్పటికీ, జర్మనీలో జరుగనున్న పరిణామాలను ముమ్ముందుగా లోకం ఊహించుకోడానికి తగిన ఆధారాలు ఆరోజుల్లో అందుబాట్లోలేవు. ఇప్పుడు పైమూడు దేశాల అనుభవాలను కలిపి సరిపోల్చుకుని పరిశీలించడానికి తగినంత ఆధారాలు ఏర్పడ్డాయి.

నిరంకుశ ప్రభుత్వంయొక్క స్వభావమున్నూ, దాని నిర్మాణానికిగాని విధ్వంసనానికిగాని అనుకూలమైన పరిస్థితులున్నూ అట్టి ప్రభుత్వాధికారాన్ని ఒకసారి కరగతం చేసుకున్నవారికి ప్రస్తుతకాలంలో లభ్యంకాగల శాస్త్రీయ ఆయుధ సామగ్రినిబట్టి పూర్తిగా మార్పు చెందాయి. ఈ ఆయుధ బలంవల్ల అట్టివారు తాము సాయుధులు కావడానికి, పరులను నిరాయుధులను చేయడానికీ పూర్వంకన్న అనేకరెట్లు సావకాశం ఏర్పడింది. ప్రజానీకంలో నూటికి తొంభైమంది అట్టి ప్రభుత్వాన్ని కూలద్రోయాలని అభిలషించినప్పటికీ, అల్పసంఖ్యాకమైన సాయుధకూటం వారందరినీ అణగద్రొక్కడం సుసాధ్యమయింది. ఒక క్రొత్త స్వతంత్ర ప్రభుత్వం స్థాపించదలిచినా, పోయిన దానిని తిరిగి సంపాదించదలిచినా ఆధునిక ఆయుధ సంపత్తివలన కలిగే ఆటంకాలను, కార్యసాఫల్యతా సాధనయొక్క క్లిష్టతను, అట్టి ఆయుధశక్తికి ప్రత్యామ్నాయమైన ఇతరశక్తుల పరిశీలనావసరాన్ని గుర్తించడం అత్యవసరం.

నియంతృత్వం అనేదానికి హేతువాదాన్ని పెడచెవిని బెట్టడం, సైనిక బలాన్ని నిర్దాక్షిణ్యంగా ప్రయోగించడం ముఖ్యలక్షణాలు. అయితే దానికి ఎదురొడ్డి చేయగల కర్తవ్య విధాన మేమిటి?

పైన చెప్పిన పరిస్థితులలో, విప్లవం అనేది-సాయుధ సైన్య దళాలలో చొచ్చుకొన గలిగితే తప్ప విజయవంతం కావడం అరుదు. కేంద్ర ప్రభుత్వం శక్తి సామర్థ్యాలు [illegible] వుండి సంఘీభావం కలిగివున్న పక్షంలో విదేశ దండయాత్రవలన ఓటమి పొందినప్పుడు తప్ప సాధారణ పరిస్థితులలో విప్లవ బీజాలకు అస్కారం కలగదు.

దీనినిబట్టి ఒకసారి కోల్పోబడిన స్వాతంత్ర్యం తిరిగి పొందడం అనేది విదేశపు దండయాత్ర ఫలితంగా దాస్య శృంఖలాలు తెగగొట్టబడుటవలన తప్ప, స్వదేశంలోని అంతర్యుద్ధ ఫలితంగా తిరిగి లభ్యం కావడం సుసాధ్యం కాదనీ, అప్పుడైనా అది నిలద్రొక్కుకోడం కష్టసాధ్యమనీ తేటతెల్లం అవుతుంది.

ఆధునిక ఆయుధ సామగ్రివల్ల నియంతృత్వం యొక్క బలం ఇంత దుర్జేయం కావడం వలన ఒకసారి ఉన్న స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన దేశాల భవిష్యత్తు ఎంత నిరాశా భూయిష్టం అయేదీ వేరుగా చెప్పనక్కరలేదు. అందువల్ల, ఇంకా స్వతంత్రంగా ఉన్నవారు తమ స్వాతంత్ర్యాన్ని కాపాడుకోడానికీ, దానికి విపత్కరమైన పరిస్థితులు ఏర్పడకుండా చూచుకోడానికీ మిక్కిలి జాగరూకత వహించి ఉండాలి.

దురదృష్టవశాత్తు ఒక స్వతంత్ర ప్రభుత్వాన్ని నిలబెట్టడంకంటె కూల్చడం చాలా సులభసాధ్యమైన పని. బుద్ధిపూర్వకం కాకుండానే, ప్రజా జీవితంలో అజ్ఞాతంగా ఏర్పడే దౌర్బల్యాల వలన కనిపించకుండానే నెమ్మది నెమ్మదిగా ఫాసిస్టు విప్లవ బీజాలకు అనుకూలమైన పరిస్థితి ఏర్పడవచ్చును. అంతపనీ జరిగిపోయేదాకా ప్రజాజీవితాంతర్యంలో నిద్రితమై ఉండే ధర్మశక్తి, స్వాతంత్ర్యోత్సాహమూ మేల్కొనకుండా అలసత్వం వహించవచ్చును.

ఇంతవరకు మాత్రమే చెప్పి ఊరుకుంటే ప్రపంచ భవిష్యత్తు కేవలం నియంతలదే అని చెపుతున్నట్టు అనిపించవచ్చును. కాని అల్లా అనుకోడం చాలా పొరపాటవుతుంది. భావికాలంలో స్వతంత్ర రాజ్యాంగ విధానాలకే చాలా అవకాశాలున్నాయి. స్వతంత్ర ప్రభుత్వాల పరిణామపు తొలి దశలోనే నియంతృత్వ విధానం బలవత్తరం కావడానికి అవకాశాలుంటాయి. విశిష్టమైన శక్తి సామర్థ్యాలు, సాహసం, క్రౌర్యం గల ఒక కూటం ఉన్మత్త ప్రతిభుడైనవాని నాయకత్వం క్రింద

పూర్ణాధికారాన్ని వశంచేయడం చేసుకోవచ్చును. స్వాతంత్ర్య దశలో పెంపొందిన శక్తి సామర్థ్యాలను, పోటీ ప్రోత్సాహంవల్ల ప్రవృద్ధమైన పారిశ్రామిక సంస్థలను వారు తమ అధికారాన్ని బలపరచుకునేందుకు సాధనాలుగా ఉపయోగించుకోవచ్చును. ప్రజలకు నచ్చచెప్పి పాలించే ప్రజాస్వామిక విధానంకంటె వేగంగాను, సమర్థంగాను వారు అన్ని శాఖలలోను ఒకే ఒక పాలనవిధానం అమలు జరుప గలగవచ్చును. కాని నిరంకుశత్వం యొక్క ఆంతర్యంలో పైకి కనిపించని ఒక సహజమైన దౌర్బల్యచిహ్నం ఇమిడివుంది. ఈ దౌర్బల్యమే తుట్టతుదకు దాని పతనానికి హేతుభూతమవుతుంది.

ప్రజలలో సహజమైన కార్యోత్సాహంగాని, నూతనోపకరాలను కనిపెట్టే శక్తిగాని, పృథమైన సంఘీభావంగాని తాము చేసే కృషియొక్క సార్థకతను గూర్చిన చైతన్యం కలిగివుండే స్వతంత్ర జీవిత వాతావరణంలోనే గాని నిరంకుశ పరిపాలనలో పెంపొందజాలవు. స్వతంత్ర ప్రభుత్వంలో పాలన శాఖలలో ఏర్పడే అవినీతిని, చేతగానితనాన్ని తొలగించి శుభ్రపరచడానికి బహిరంగ విమర్శ, పోటీపద్ధతి ఉపకరిస్తాయి. నిరంకుశ ప్రభుత్వంలో అట్టి ప్రక్షాళన ప్రక్రియలకు తావుండదు. కాలక్రమేణ పాలనశాఖలలో దౌర్బల్యాంకురాలు నిరంకుశంగా పెరిగి ప్రభుత్వబలాన్ని నిర్వీర్యం చేయడం జరుగుతుంది. ప్రజాస్వామికత తన ప్రజలను బహిరంగంగా ప్రశ్నిస్తే, నియంతృత్వం తన సమాధులను సున్నం పులిమి తెలుపు చేస్తుంది!

ఇప్పుడు హిట్లరు పాలనయొక్క రహస్యాలు అనేకం బట్టబయలై వున్నందున, ఈ నిరంకుశత్వం అనే వేరుపురుగు ఏరీతిగా పుట్టిపెరిగినదీ మనం విశదంగా తెలుసుకోడానికి వీలుంది.

అందువలన మొత్తం మీద భవిష్యత్తులో స్వాతంత్ర్యానికే మంచి అవకాశాలున్నాయని నొక్కి చెప్పవచ్చును. కాని ఈ మధ్యలో చాలా దేశాలు తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోయిన సంగతి, ఈ క్షణాన్ని స్వాతంత్ర్యం పరులదాడికి తట్టుకోగల బలవత్తర స్థితిలో ఇంకా లేదనీకూడా



కౌంట్ బెర్నడాట్. పాలస్తీనా సమస్య పరిష్కరించడానికి ఐక్య రాజ్య సమితి నియమించిన ఇతడిని క్రిందటిసారం యూదు పక్షీయుడొకడు హత్య చేశాడు.

గుర్తించాలి. ప్రపంచపు భవిష్యత్పరిణామం ఎట్లా వున్నప్పటికీ, పైనచెప్పిన కారణాలనుబట్టి ఒకసారి కోల్పోయిన స్వాతంత్ర్యం తిరిగి పొందడం అనేది కష్టసాధ్యం, అనుమానాస్పదం అని మాత్రం తెలుసుకోడం మంచిది. స్వాతంత్ర్యం అనేది తిరిగి సంపాదించడం అనేదానికన్న ఉన్నది నిలుపుకోడం సులభతరం. పూర్వం ఎన్నటికన్నా ఈనాడు "నిరంతర జాగరూకతయే స్వాతంత్ర్యపు మూల్యం" అన్న సంగతి గమనీయం. ప్రజాస్వామ్యాలలోని అంతర దౌర్బల్యాలను వియుగుడు కనిపెట్టడం ప్రస్తుతం ప్రముఖమైన అవసరం. అది చేయనిపక్షంలో ఆ దౌర్బల్యబీజాలే స్వజాతీయుడైన నియంతృత్వ పేక్షునికిగాని, విజాతీయుడైన శత్రువునకుగాని ప్రలోభనాన్ని కల్పించడమే కాక, విజయావకాశాలనుకూడా కలిగిస్తాయి.




సంపాదకునికి ప్రకటనార్థము పంపబడిన లేఖలు యీ శీర్షికక్రింద ప్రచురింపబడతాయి. లేఖలు క్లుప్తముగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపవలెను.

## ఇది మతరహితరాజ్యమా?

ఇండియా మతరాజ్యం కాదని, మత ప్రాతిపదికపై దీని రాజ్యాంగం ఏర్పడదని మన నాయకులు పదేపదే చెబుతూ వస్తున్నారు. అంచేత ఇక్కడ హిందూ న్యాయశాస్త్రమే గాని, లేక ముస్లిం న్యాయశాస్త్రంగాని వుండటానికి వీల్లేదు గదా! ఒక్క "ఇండియన్ లా" మాత్రమే అనుసరించాలి.

అట్లాంటి సమాన ప్రజారాజ్యములో శాసనాలు కూడా పౌరులందరికీ సమానంగా వర్తించాలి కదా! ఈసందర్భంలో ప్రత్యేక మత సిద్ధాంతాల్ని గుర్తించవచ్చా?

మరి యిప్పుడు, మద్రాసు ప్రభుత్వం హిందువులొక్కరికే బహుభార్యాత్వాన్ని నిషేధిస్తూ శాసనము చేసిందని వార్తాపత్రికల్లో చూచాం. ఈశాసనం ఏమతంవారైనా ప్రజలందరికీ చెందాలి గదా! ముస్లిం లా ప్రకారం బహుభార్యాత్వాన్ని కలిగివుండే ముస్లింలకు ఈ శాసనం అక్కర్లేదన్న మాట. ముస్లింలుకూడా దీనిని అనుసరిస్తారా? హిందువులకేనా ఏక భార్యాత్వము కావలసింది? మతరహిత సర్వసమాన ప్రభుత్వంలో ఒక ప్రత్యేక తరగతికే శాసనాలుండవచ్చును గాబోలు. మరి ఇట్లాంటి విషయాల్లో మతోన్మాదాన్ని సహించవని, ఇది మతరాజ్యం కాదని చెప్పే ప్రధాని నెహ్రూ, మతంతో సంబంధం లేకుండా, పౌరులందరికీ సమానమైన శాసనాన్ని చేస్తాడా?

మతప్రాతిపదికలేని ఇండియాలాంటి రాజ్యంలో ప్రభుత్వం మతసంస్థలజోలికి పోకూడదే! క్రైస్తవ ముస్లిం మతసమాఖ్యల విషయంలో తటస్థంగా వుంటూ హిందూదేవాలయాల యాజమాన్యాలకే శాసనాలేమిటి? ఆమధ్య పూరీ జగన్నాథదేవాలయ యాజమాన్యాన్ని ప్రభుత్వం వశపరచుకోవాలని ఒరిస్సాలో శాసనం చెయ్యబడింది. మతంతో సంబంధంలేని ప్రభుత్వంచేసే పనులేనా ఇవి? హిందూప్రజల ధనమాన ప్రాణాలు మత సంస్కృతులు రక్షించవలసిన సమయాల్లో అది మతోన్మాదమని, ఇది మతరాజ్యం కాదని, మిగిలిన "మైనారటీలని" రక్షించాలని తప్పుకుంటుంది ప్రభుత్వం. హిందూ ధర్మసిద్ధాంతాల్ని తామూ గొప్ప సంస్కర్తలమని చెప్పుకోడానికి సంస్కరించడానికి, హిందూమత దేవాలయాల్ని కొల్లగొట్టుకోడానికి మాత్రం, ప్రభుత్వానికి మత విషయాల్లోకూడా హక్కున్నదంటూ జోరబడటమా? రెండువిధాలా హిందువులే నష్టపడేది. ఈ హైందవేతర పక్షపాతాన్ని ప్రభుత్వ మతోన్మాదం అనవచ్చేమో?

కనిగిరి — రాజారావు

---

## చెన్నపురి సమస్య

చెన్నపురి ఆంధ్రులకో, అరవలకో, చెందవలెను గాని ప్రత్యేక రాష్ట్రముగ నుండరాదను తమిళ కాంగ్రెసు సూచనకు ఆంధ్రమంత్రుల అంగీకారమును ఖండించుచు యిటీవల శ్రీ అయ్యదేవర

కాళేశ్వరరావుగారు పత్రికా ప్రకటన గావించిరి. దీనికి సమాధానముగ శ్రీ కళా వెంకట్రావుగారొక ప్రకటన చేయుచు, కాళేశ్వరరావుగారు చెన్నపురి ఆంధ్రమున చేరుట కిష్టపడరనియు, బెజవాడయే ఆంధ్రరాజధాని కావలెనని వారి పట్టుదల యనియు అందుచే వారు చెన్నపురిని ప్రత్యేక రాష్ట్రముగ చేయగోరుచుండిరనియు తెలియజేసిరి. ఈ వాదోప వాదము లటుండగా చెన్నపురిని వదలుకొనుట కెవ్వరును యిష్టపడరను విషయము నిర్వివాదాంశమే. అందుకై ఆంధ్రులు, అరవలు కూడ గట్టి యత్నములు సల్పుచుండిరి. పూర్వచరిత్ర నాధార ముగా తీసికొన్నచో చెన్నపురి తెలుగువారిదేయని స్పష్టమగుచున్నది. అయినను ప్రస్తుతము చెన్నపురిలో మన ప్రాబల్యము తక్కువగ నుండుటచే నది మనకు లభించునా? లేదా? అను సంశయము ప్రతి ఆంధ్రుని కలవరపఱచుచున్నది. మన దురదృష్ట వశాత్తు ఒకవేళ అది మనకు లభించని పక్షమున దానిని ప్రత్యేక రాష్ట్రముగ నుంచుట మంచిదా? అరవల హస్తగతము చేయుట మంచిదా?

ఈప్రశ్నకు ప్రత్యేకరాష్ట్రముగ నుంచుటయే మంచి దని సమాధానము వచ్చితీరును. అయినను వెంకట్రావుగారు చెప్పినట్లు అసలుకోర్కె ఫలింపని పక్షమున సీప్రత్యామ్నాయమును బలపఱచ వలెనుగాని, ఆదినుండి యట్లు ప్రారంభించుటకూడ మనకే ముప్పు తేగలదు. మఱొక విషయ మేమనిన వెంకట్రావుగారు ప్రకటించినట్లు బెజవాడరాజధాని నగరము కావలె ననుతలంపుతో కాళేశ్వరరావుగారు చెన్నపురిని ప్రత్యేకరాష్ట్రముగ నుంచవలెనని కోరుచున్నచో నదికూడ సమంజసము కాదని చెప్పవచ్చును. ఇట్లుకాక చెన్నపురి మనకు లభింపనిచో దానిని ప్రత్యేక రాష్ట్రముగా చేయుటంగాక తప్పులేదు.

మననాయకులలో నొకరిపై నొకరి కిట్టి భేదాభిప్రాయములు, వాదోపవాదములు సంభవించి, అవి ముఠా రాజకీయములుగ పరిణమించి తుదకు యావదాంధ్రజాతినే అధోగతి పాలుచేయుచున్నవి. కనుక యికనైన, మనవారు సమైక్యతతో సంచరింప యత్నించి, 'యీముఠా రాజకీయముల మర



స్వర్గీయుడైన మహమ్మదాలీ జిన్నా (ఎడమపక్క) స్థానే కె. నజముద్దీన్ (కుడిపక్క) పాకిస్తాన్ గవర్నర్ జనరల్‌గా నియమింపబడ్డాడు.

వర్షమునుండి ప్రజలను తప్పించని చో-ముత్తము జాతికే మహోపచారము చేసినవా రగుదురు.

దంటు కృష్ణమూర్తి

---

## డిటెన్యూల కుటుంబపోషణ

తమ కుటుంబాలకు ఆదరువైన వారిని నిరంతరంగా కేసు విచారణ శిక్ష లేకుండా- డిటెన్యూలుగా నిర్బంధించిన ఫలితంగా, తమకు జీవనాధారం లేక, పలు బాధలకు గురియగుతున్నామనీ, ఈ విషయం ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసినా, ఎట్టి సాయమూ చేయుట లేదనీ, అనేకమంది మహిళామణులు మాకు తెలియజేస్తున్నారు.

డిటెన్యూలుగా నిర్బంధించినవారి కుటుంబాల బాధ్యత నెరవేర్చటం ఏ నాగరిక ప్రభుత్వానికయినా కనీసధర్మం. యీమాత్రం బ్రిటిషు సామ్రాజ్యవాదం చేసింది. ఈ విషయం ప్రభుత్వం నిర్లక్ష్యం చేయటం అన్యాయం.

ఆంధ్రరాష్ట్ర మహిళాసంఘం ఈ బాధితుల తరఫున మద్రాసువర్గానికి, రాయబారం నడుప దలచింది. కనుక డిటెన్యూల కుటుంబానికి చెందిన మహిళలందరూ తమ భర్తలను నిర్బంధించిన తేదీ, నెలసరి నష్టమైన ఆదాయం— కుటుంబంలో పోషించవలసిన వారి సంఖ్య, ఎన్నో తేదీన ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసింది, వివరంగా పూర్తి చిరునామాలతో సహా వెంటనే ఈ దిగువ అడ్రసుకి పంప గోరుతాను.

బెజవాడ మోటూరి ఉదయం

(రాష్ట్ర మహిళాసంఘ జాయింట్ సెక్రటరీ)

---

## ఎరువు బోనసు—సవరణ

ఆగస్టు 20 వ తేదీ సంచికలో మైత్రికతో ప్రచురించిన లేఖలో "సుమారు 700 యకరాల మాగాణి భూమి వున్న తెనాలితాలూకాలో గ్రామం ఒకటింటికి 77 వేరుసెనగపిండి బస్తాలను అక్టోబరుమాసంలో కోటావేశారు" అని వుంది. అది అట్లుకాదు. తెనాలితాలూకాలో 700 యకరాల మాగాణిభూమి వున్న ఒకగ్రామానికి 77 బస్తాలు అని.

ఇంతవరకు ఎరువు కూపన్లపై యిచ్చుటలేదు. కోఆపరేటివు సంఘములకు, వ్యవసాయశాఖనుండి మార్చిరట. సహకార సంఘములవారు, ఎవరెవరికి ఎంతయివ్వాలి అనే విషయం ఇప్పు డాలోచిస్తు జరుగనిది, ఏమి ప్రయోజనం! సప్టెంబరు నెల దాటినపిమ్మట, మాగాణిభూములకు ఎరువువేసి ప్రయోజనంలేదు.

కొన్నికొన్ని చోట్ల ఫాక్టరీవారు 60% వేరుసెనగపిండి సర్కారుకు ఇవ్వవలసియుండి అట్లివ్వక హెచ్చుధరలకు బహిరంగముగ అమ్ముచున్నారు. 40% వచ్చు తమవాటాను, రాబోయే నెలల వాటాలనుకూడా-సర్కారు కివ్వక ముందుగాతరుణము వాసి ఫాక్టరీవారే బస్తా 1కి 17 రూపాయలకు అమ్ముకుని, ఎరువువేయు తరుణము దాటినాక సర్కారుకు కోటా యిస్తామంటున్నారు. అంటే-యీ నెలలో ఫాక్టరీదారు, మొత్తం దిగుమతి అయిన సరకు వెయ్యి బస్తాలుంటే అందులో 600 బస్తాలు సర్కారు కివ్వవలెను. అట్లుచేయక పై నెలలో సర్కారువారి కిచ్చి, యీనెలలో సరకంతయు అమ్ముకుని హెచ్చులాభములు సంపాదించి, అధికాహారోత్పత్తికి ఆటంకము చేయుచున్నారు. ఇట్టి పనులు కాంగ్రెసుసభ్యులై పేరుగల్గిన పెద్దలే చేయుచుండ - ప్రభుత్వాధికారులు చూచుచు వూరకుంటున్నారు.

జనపవిత్తుల తరుణముకూడ ఇంక త్వరలో వస్తున్నది. నిరుటి అనుభవము గమనించి అయినా, సర్కారువారేమైనా ఇప్పటినుంచీ మేల్కొని, నవంబరురాగానే, జనపవిత్తుల సేకరించి అదనులో రైతులకు ఇస్తారని ఆశించుచున్నాము. ఇప్పుడు జనములు బస్తా 1కి రు. 125-0-0 దాకా వున్నవి.

శిష్ట్లా పూర్ణానందశర్మ

---

## తెలుగు రేడియో స్టేషను

బెజవాడలో తెలుగు రేడియో స్టేషను పెట్టెదరని చాలాకాలము క్రిందట పత్రికలలో చిన్న ప్రచురణ చూచాము. ఆంధ్రరాష్ట్రము, రామపాద సాగరము లాగుననే మన ప్రస్తుత మంత్రుల ఆధ్వర్యముక్రింద పాతాళమునకేగిన దనుకొందును. దానికన్న వెనుకను మొదలుపెట్టిన రేడియో స్టేషనులు పని ప్రారంభించి ప్రజలకు సేవ చేయుచున్నవి. ఈ చిన్న విషయములోకూడ భవతి తల్లి ప్రేమ ఆంధ్రులమీద చూపక త్వరితగతిని పనులు చేయించి అధికారులు ప్రజల మన్ననలకు పాత్రులగుదురు గాక.

మ. రాజీవాక్షమ్మ



# తెలుగు స్వతంత్ర
## విషయసూచిక

సంపుటి 2. సంచిక 9.

శుక్రవారం, సెప్టెంబరు 30, 1949

పుట



శిల్పి: దేవీప్రసాద్ రాయ్‌చౌధురీ

గౌ॥ ప్రధాన న్యాయమూర్తి పా. వెం. రాజమన్నారుగారి ప్రతిమ

# తెలుగు స్వతంత్ర

సంపుటి-2
సంచిక- 9

సెప్టెంబరు 30, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం


## నైతికరంగంలో సంఘర్షణ

నేటి ప్రపంచ రాజకీయాల్లో ఒకదాని కొకటి ముక్కెదురుగా నిలుచున్న రెండు బలవత్తరమైన వర్గాలు. కమ్యూనిస్టులు, వారి వ్యతిరేకులు,—వీరి సంఘర్షణ రెండు రంగాలకే చెందినట్లు వార్తాపత్రికలు చూస్తే గోచరిస్తుంది. ఒకటి ఆర్థికరంగం, రెండవది మిలిటరీ రంగం. ఒకపక్క పశ్చిమ ప్రజాస్వామ్య రాజ్యాల వారి అట్లాంటిక్ ఒడంబడిక, మార్షల్ ప్రణాళిక, పశ్చిమ యూరప్ రాజ్యాలకు అమెరికా చేసే ఆయుధసహాయం—యిలాంటివి. రెండోపక్క వీటిని భగ్నం చెయ్యడానికి కమ్యూనిస్టులు చేసే ప్రయత్నాలు. ఎవరూ తమ ఆశయాల్లో యింకా కృతకృత్యులు కాలేదు. చైనా అంతర్యుద్ధంలో కమ్యూనిస్టులు యించుమించు దేశం అంతటినీ తమ స్వాధీనంలోకి తెచ్చుకున్నారు. వాళ్ళ ప్రతికక్షులకి కమ్యూనిస్టు వ్యతిరేకులు చేసిన సహాయం ఫలించలేదు. కాని యూరప్‌లో కమ్యూనిజం అరికట్టబడింది.

అయితే, యీ రెండురంగాలూ కాక మూడోరంగం యింకోటి ఉంది. ఈ రంగంలో సోవియట్ రష్యా, తదితర ప్రపంచ కమ్యూనిస్టులూ రోజుకిరోజుకీ ఓడిపోయి అడుక్కి వెళుతున్నారు. అదే నైతికరంగం. కమ్యూనిస్టు పరిభాషలో చెప్పవలసివస్తే సిద్ధాంత రంగం.

ఒకానొకప్పుడు ప్రపంచంలోని సమాజ సంస్కర్తలకూ, విప్లవకారులకూ రష్యా ఆశాచిహ్నంగా ఉండేది. కాని, రానురాను సోవియట్ రష్యా స్నేహితులందరికీ క్రమంగా మార్షల్ స్టాలిన్ నియంతృత్వం బలపడడం, ఆ "నూతన సమాజం"లో జీవితం స్వేచ్ఛావిహీనమై దుర్భరం అవడం-యివి కనువిప్పు అయాయి. వ్యక్తి స్వతస్సిద్ధమైన స్వేచ్ఛ, ఆత్మగౌరవం- యివి క్రమంగా సోవియట్ పరిపాలనలో అర్థంలేని పదాలుగా మారిపోయాయి. ఈ సందర్భంలో ఒక్క విషయం స్ఫురణకి తెచ్చుకోవడం అవసరం: మొన్నటి యుద్ధకాలంలో, ప్రపంచంలో అన్నిమూలల్లోనూ రష్యావట్ల గౌరవం హెచ్చింది. ఆవిధంగా ప్రపంచానికి నైతికంగా నాయకత్వం వహించడానికి రష్యాకి అవలంబించింది. కాని దాన్ని సోవియట్ రష్యా సద్వినియోగం చేసుకోలేకపోయింది. యుద్ధానంతరం రష్యా ప్రదర్శించిన వైఖరి, తన స్నేహం వాంఛించిన దేశాల్ని సైతం దూరం చేసుకుంది. నేడు సోవియట్ రష్యా అధ్వా

ర్యాన సాగుతున్న అంతర్జాతీయ కమ్యూనిస్టు ఉద్యమం సరి కొత్త నిరంకుశోద్యమంగా తయారై, అందరి సానుభూతినీ కోల్పోయి ఏకాకిగ నిలిచింది. ప్రస్తుతం ప్రపంచరాజకీయాల్లో ఏర్పడిన ప్రతిష్టంభన ముమ్మందు తాల్చబోయేరూపాన్ని నిర్ణయించడంలో నేటి రష్యావైఖరి చాలావరకూ పనిచేస్తుంది.

నైతికంగా రష్యా ఓటమి యొక్క కారణాలు చాలా స్పష్టమైనవి మొన్నటి ప్రపంచ యుద్ధం ముగిసిన తర్వాత ప్రపంచంలోని వామపక్షీయులంతా గతాన్ని విస్మరించి, చిత్తశుద్ధితో సోవియట్ రష్యాతో సహకరించడానికే తోడ్పడ్డారు. కాని కమ్యూనిస్టులు చరిత్ర నుండి పాఠం నేర్చుకోలేకపోయారు. మొదట్లో బ్రిటిష్ లేబరు పార్టీ అందించిన స్నేహపూర్వకమైన హస్తాన్ని కమ్యూనిస్టులు తృణీకరించారు. యూరప్ దేశానికి సామ్యవాద బ్రిటన్ నాయకత్వం వహిస్తుందేమో ననే భయమే ఇందుకు కారణం. పాతకాలపు రాజకీయ కుతంత్రాలతో జోడించి నిరంకుశమైన "విప్లవ" సూత్రాల్ని ప్రచారం చెయ్యడమే నేటి కమ్యూనిజం ప్రధానలక్షణం. దానికి నిజానికి కేపిటలిస్టు విధానంలోని యంత్ర విజ్ఞానం, భారీయెత్తున వస్తువుల ఉత్పత్తి, తద్వారా మానవుణ్ణి బానిసగా మార్చడం- యివన్నీ కావాలి; కాని మానవత్వపు ఉత్తమ సంప్రదాయాలు, విశాల దృక్పథం, ప్రజాస్వామ్యపు జీవన విధానం, యీ శతాబ్దపు ఉత్తమ సంస్కృతికి చెందిన నైతిక విలువలు- యివేమీ అక్కర లేదు; వాటిని "బూర్జువా" భావాలని తృణీకరించడం జరుగుతూంది. సోషలిస్టుల వంటి అభ్యుదయ కాములతో చేతులు కలిపి సమాజాన్ని పునర్నిర్మించడంలో తోడ్పడడానికి బదులు, ముఖ్యంగా ఆసియా రాజ్యాలలో విద్రోహకరమైన తిరుగుబాట్లు లేవదీసి నూతనంగా స్వాతంత్ర్యం పొందిన దేశాల్ని అమిత కష్టాలపాలు చేసింది. ఆసియాలో ఇండోనీషియా, యూరప్‌లో చకోస్లోవాకియా కమ్యూనిస్టుల అమానుషమైన నిరంకుశత్వానికి ఉదాహరణలు. నేడు ప్రపంచంలోని కమ్యూనిస్టులకు ఎక్కడైనా రెండే రెండు ఆశయాలు— విద్రోహకరమైన తిరుగుబాటు, నియంతృత్వ స్థాపన. ఆ లక్ష్యసాధన కోసం ఎటువంటి సాధనాలను ఉపయోగించడానికైనా సరే, వేలాది ప్రజానీకాన్ని హింసించడానికైనా సరే వెనుదీయరు.

"ఆచరణలో కమ్యూనిజం ఎలా స్వేచ్ఛా ప్రతిబంధకంగా ఉంటుందో, మార్క్సిజమ్ లోని కుతర్కాలేమిటో మనకి అనుభవ పూర్వకంగా రష్యా విప్లవం వల్ల తెలిశాయి" అన్నాడు, యం. యన్. రాయ్. నైతికరంగంలో ఏ విధంగా రష్యా ఓడిపోయిందో మనకి నేటి చరిత్ర రుజువు చేస్తున్నది. స్వాతంత్ర్య పిపాసువుల సానుభూతి యీ విధంగా కమ్యూనిజం కోల్పోయిన నాడు, నేడు ఆ సిద్ధాంతానికి లభించిన విజయం ఏదైనా ఉంటే అది తాత్కాలికంగానే ఉంటుంది. నిరంకుశత్వం అనేది—అది ఎంత బలవత్తర కమ్యూనిస్టులదైనా—కలకాలం నిలువదు. మానవుడి ఆత్మౌన్నత్యం ఏ నిరంకుశత్వానికీ లొంగదు.




సుమారు దశాబ్దం క్రితం నాటి హిందీ సినిమా ఒకదానిలో, చిలకా గోరింకల్లాంటి నాయికా నాయకులు అకస్మాత్తుగా వెల్లబాదుకుంటారు. అప్పుడు నాయికతో అంటాడు నాయకుడు: "మళ్ళా కాకపోతే నిన్ను మించిన వాళ్లనిమరో అందమైన దానిని పెళ్లాడుతాను. నీవెనక ఏడుస్తూ తిరగడానికి నేనేం 'మజ్నూ' ని కాదు"-అని.

నిజమే, "ప్రేమ" అనే అనుభూతిని పై వ్యాఖ్య అపహసిస్తోంది: దేన్నైనా తృణీకరించడం సులభం. అవగింపి అర్థం చేసుకుందికి ప్రయత్నించడం కష్టం. అందులో మన అనుభూతికి దూరమైనదీ, జీవితంలో మనం నోచుకోనిదీ అయితే మరీ కష్టం. దూరమైన ఏ అనుభూతినైనా మన హృదయానికి చేరువగా తీసుకువచ్చి, శాశ్వతమైన ముద్ర వేయగలిగేది ఒక్క కళాశిల్పి మాత్రమే. "భరణీ పిక్చర్సు" వారి సరికొత్త తెలుగు ఫిల్మ్ "లైలా-మజ్నూ" చూసిన ప్రేక్షకుడిలో నిర్మాతలు అనుకున్నంతగా సానుభూతి మొలకెత్తించడంలో కృతకృత్యులు కాలేకపోయారంటే, అది వారి ప్రయత్నలోపం కాదు: కథావస్తువులోనే అంతర్వాహినిగా ఉన్న దౌర్బల్యం.

కథాకాలం యీనాటిది కాదు: శతాబ్దాల క్రిందటిది. నాటి సమాజపు సంస్కృతి మనకు చేరువైనది కాదు. ఆదర్శ ప్రేమకు కాలమూ, స్థలమూ అనే పరిహద్దులు లేవనే వాదన యిక్కడ అన్వయించదు. అంతటి ఉదాత్త ప్రేమ అర్థం చేసుకుందికి ఆదర్శ ప్రేక్షకులూ, ప్రదర్శించడానికి ఆదర్శ నటీనటులూ కావాలి. అవి రెండూగా ప్రస్తుతం గగన కుసుమాలు కనక, యితరేతర మార్గాల ద్వారానే సంతృప్తి పొందాలి. "లైలా-మజ్నూ" లోని యితివృత్తం యిది (సినిమాలో ప్రకారం):

కొన్ని వందల సంవత్సరాల క్రితం, అరబ్బీ దేశంలో మక్కానగరానికి సమీపంలో ఉన్న ఒక పరగణాలో యిద్దరు అమీర్లు—సర్వార్, ఉమ్రా—నివసిస్తూండేవారు. సర్వార్ కూతురు లైలా. ఉమ్రా కొడుకు ఖైస్. బాల్యంనుండి వీరిద్దరూ ఒకరి నొకరు గాఢంగా ప్రేమించుకున్నారు. లైలా తండ్రికి యీ ప్రణయం నచ్చలేదు. తరుణ వయస్కులైన లైలా—ఖైస్‌లు రాత్రివేళల చెరువు దగ్గర విహారాలూ, వలపు సల్లాపాలూ—అతనికి ఒళ్లు మండింది. ఖైస్ తండ్రికి చెప్పిచూశాడు. లాభం లేకపోయింది. ఖైస్‌ని కసిరించాడు. అంతకంతకే లాభం లేకపోయింది. చివరికి విసుగెత్తి అక్కడినుండి మకాం ఎత్తేసి కుటుంబంతోసహా మక్కాకు తరలిపోయాడు. వెనువెంటనే ఖైస్ కూడా మక్కా ప్రయాణం కట్టాడు. ఇంట్లో బందీ అయిన లైలా యిరవై నాలుగు గంటలూ ఏడవడం తప్ప యింకేమీ చెయ్యదు. కూతురు ప్రణయంపట్ల తల్లికి పూర్తి సానుభూతి ఉంది. కాని ఏం చెయ్యగలదు! లైలా ఎట్టకేలకు చెలికత్తె సహాయంతో ఖైస్‌ను రహస్యంగా తోటలో కలుసుకుంటుంది, ఒకసారి. లైలా మహల్‌కే ఒకసారి ఖైస్ ధైర్యం చేసి వెళ్లి లైలా తండ్రి చేతిలో చిక్కుకుని మళ్లీ దెబ్బలు తింటాడు. అక్కడితో లైలా యింక ఎన్నడూ ఖైస్‌ను కలుసుకుందికి వీలులేని ఏర్పాటులన్నీ చేస్తాడు అమీర్ సర్వార్. ఖైస్ ప్రేమోన్మాదుడై మక్కా వీధుల్లో తిరుగుతుంటాడు. ఈ ప్రేమగాథ మక్కా

నగరంలో అబాల గోపాలానికీ తెలుస్తుంది. అంతా అతన్ని "మజ్నూ" (ప్రేమోన్మాది) అంటారు.

కొడుకును వెతుక్కుంటూ ఉమ్రీ సైతం మక్కా చేరుకుంటాడు. ఖైస్ అవస్థ చూడలేక తనే స్వయంగా నవ్వార్‌ని ప్రార్థిస్తాడు-లైలాను మజ్నూకిచ్చి పెళ్లి చెయ్యమని. కాని, అంతలోకే మక్కా యాత్రకి వచ్చిన ఇరాక్ షాజాదా లైలా అపురూప సౌందర్యవతి అనే కీర్తి విని, నవ్వార్‌ని కోరుతాడు-తనకి లైలానిచ్చి పెళ్లి చెయ్యమని. నవ్వార్ అంతపనీ చేసేస్తాడు. పెళ్ళి కూతుర్ని తీసుకుని షాజాదా తనవూరు వెళ్ళిపోతాడు. కాని లైలా షాజాదాకి అస్వాధీన. ఒక సుముహూర్తాన షాజాదా హృదయంలో పరివర్తన కలుగుతుంది. లైలా పవిత్రప్రేమ గుర్తించి, ఆమెను సోదరిగా భావించి, రాజ లాంఛనాలతో మజ్నూ వద్దకు పంపిస్తాడు. అటు ప్రక్కనుండి మజ్నూ లైలాను వెతుక్కుంటూ వస్తాడు. తీరా యిద్దరూ కలుసుకునే ఘడియకి ఎడారిలో పెద్ద యిసుక తుఫాను రేగుతుంది. అందులో యిద్దరూ చెయ్యీ చెయ్యీ పట్టుకుని మరణిస్తారు.

నిజామీ మహాకవి రచించిన యీ కథ ప్రపంచంలో శాశ్వతంగా నిలిచిన ప్రేమగాథల్లో ఒకటి. అందులో సందేహంలేదు. కాని, యీనాడా కథ తెలుగులో సినిమా తీయడానికి ఎంత అనుకూలమైనదన్నదే సందేహం. ఆ సందేహమే యీ ఫిల్ములో నటించినవారు తమ నటనలో అంతర్లీనంగా వెలిబుచ్చారు.

అయితే, ప్రేక్షకుణ్ణి రంజింప చెయ్యడానికి కావలసిన తెలుగు సినిమాలలోని హంగులన్నీ యిందులోనూ ఉన్నాయి. ఆకర్షణీయమైన విగ్రహాలు గల ప్రేమికులు, రాత్రి వేళల యిద్దరూ చెరువుదగ్గిర చందమామా-కోయిలా అంటూ జంటగా పాడటం, నాయిక చెలికత్తెతో హాస్యగాని ప్రణయం, నాయిక విరహం, దర్బారులో నృత్యం-అన్నీ ఉన్నాయి.

చిన్నతనంలో బడిలో చదువుకుంటూన్న లైలా-ఖైస్‌లు మనకి మొదట గోచరిస్తారు. తెరమీద కనబడేసరికే వాళ్ళు పరిణతిపొందిన ప్రేమికులు. అంత చిన్నతనంలోనూడా ప్రౌఢమైన ప్రేమ అంటే ఏమిటో వాళ్ళకి తెలిసిపోయింది. అపాంగ వీక్షణాలు, కరగ్రహణ మాత్రాన పులకరింపులు, కిలికించిత ధ్వనులు — వారి ప్రణయం ప్రౌఢంగా ఉంది. అంతకంటె యింకొంచెం చిన్నతనపు చేష్టలద్వారా వాళ్ళ ప్రణయం నిరూపిస్తే బాగుండేదేమో! కథ నాటక ప్రాతిపదిక లోపించడానికి యిదొక కారణం. ఏ పద్ధతులవల్ల వాళ్ళ స్నేహం ప్రణయంగా మారింది? ఈ పరిణామం కథలో గోచరించదు. లైలా-మజ్నూల ప్రేమ నిష్కారణమైతే, లైలా తండ్రి అభ్యంతరం సైతం నిష్కారణంగానే నిరూపించబడింది. వాళ్ళ వివాహానికి ఎందుకడ్డు తగులుతాడు? వంశ మర్యాద అంటాడు నవ్వార్.











దానికి ఏవిధంగా భంగకరం?—అది చెప్పదు. అతని అభ్యంతరం అనే ఏక సూత్రంమీద యీ విషాదాంత కథనం ఆధారపడి ఉంది. కాని ఆ సూత్రం చాలా బలహీనమైనది.

చిత్రంలో లైలా భూమిక ధరించినది అభినేత్రి భానుమతి. పాత్రపోషణ విషయంలో యీమె ఎక్కువ శ్రద్ధ తీసుకున్నట్టు చిత్రం స్పష్టం చేస్తోంది. ప్రేమ, అనురాగం, ప్రణయం, హృదయం వాంఛించింది పొందలేనప్పుడు కలిగే వేదన—యీ అనుభూతులన్నీ యీమె ఎంతో నేర్పుతో ప్రదర్శించింది. అసలు సన్నివేశమే కృత్రిమమైన ఘట్టాల్లో, అంతకంటె అసహజమైన సంభాషణలు పలకవలసి వచ్చినప్పుడు—ఎంత తెలివైన నటి మాత్రం ఏం చెయ్యగలదు? పాత్రపోషణా, సంభాషణలూ తోడుపడి ఉంటే, "లైలా" యింకా సహజంగా గోచరించి ఉండును. బలహీనమైన "లైలా" వ్యక్తిత్వాన్నే శ్రీమతి భానుమతి యింత చాకచక్యంతో నిర్వహించినప్పుడు. సిద్ధహస్తుడైన దర్శకుడూ, ఉత్కృష్టమైన కథా లభించి ఉంటే ఎంత బాగుండును! ఏనాటికైనా "కన్యాశుల్కం" చిత్రంగా రాగలిగిన భాగ్యం తెలుగు దేశానికి లభిస్తే, మధురవాణి పాత్ర భానుమతి తప్ప యింకెవరూ నిర్వహించలేరనిపిస్తుంది. (కాని, మన తెలుగు నిర్మాతలకి కన్యాశుల్కం చిత్రం తియ్యడానికి పనికిరాదు. వారు సర్వజ్ఞులు.)

"మజ్నూ" గా నటించిన శ్రీయుత నాగేశ్వరరావు, కేవలం ప్రేమించడం తప్ప యింకో పనిలేని ఘట్టాల్లో—చాలా అమాయికమైన ప్రేమ ప్రకటిస్తాడు. అంత బొత్తిగా చక్కని లేని ప్రేమ ఎలాగు నిర్వహించినా అసహజంగానే ఉంటుందేమో! ప్రేమ సార్థకం చేసుకోవలసి వచ్చినప్పుడు మాత్రం నాగేశ్వరరావు ప్రతిభ వికాసం చెందింది. ఏమైనా, పాఠం నేర్చుకున్న చిలకవలె పాత్ర యొక్క సంభాషణలు అప్పచెప్పేశాడు. మజ్నూ మనోవృత్తి యీయన కవగాహన అయినట్టు గోచరించదు.

ఇతర పాత్రధారుల్లో ముఖ్యంగా పేర్కొనవలసింది సి. యస్. ఆర్. రంగస్థలం మీద అద్వితీయ కీర్తి నార్జించిన యీయన రంగస్థలం వదలకుండా ఉంటేనే బాగుండును అనిపిస్తుంది. సినిమా అంతటిలోనూ యీయన ప్రేక్షకుల వేపు తిరిగి, వాళ్ళ నుద్దేశించే ప్రతిపదం ఉచ్చరించాడు.

చిత్రంలో వేర్వేరు భూమికలు నిర్వహించిన యీ అతిరథులందరి మధ్యా, స్వయంప్రతిభతో ప్రకాశించిన యింకో అజ్ఞాత తార ఉంది. ఆమె సురభి బాలసరస్వతి. "లైలా" చెలికత్తె "జోరా" గా యీమె శ్లాఘనీయంగా నటించింది. నిర్మాతలీమె నొక కంట కనిపెట్టి ప్రోత్సహించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

మొత్తంమీద చిత్రానికి వన్నె తెచ్చేవి భానుమతి అభినయం, ఘంటసాల నేపథ్య సంగీతం—యీ రెండింటితోనూ చిత్రం తప్పకుండా విజయవంతం అవుతుంది. "లైలా మజ్నూ" సినిమా మొత్తం పూర్తయాక ప్రేక్షకుడు తెలుసుకుని తృప్తి పడేది అదే—తిరువాన్కూరు సోదరీమణుల ఆమోఘమయిన [illegible] కమూ కాదు, సముద్రాలవారి పటాటోపమైన పదాల ప్రేమా కాదు.—(గోరా.)

# శ్రవ్యకావ్యాలు

ఆరుద్ర

ఆనేకథకుడు సూతుడు శౌనకాది మహామునులకు భారతాన్ని వినిపించిన విధానాన్ని శ్రద్ధగా పరిశీలిస్తే చాలా సంగతులు బయట పడతాయి. సాహిత్యం ప్రజలకోసం అన్న విషయం ఎప్పుడూ నిర్వివాదాంశమే. వేదవ్యాస ప్రణీతమైన భారతాన్ని అతని శిష్యప్రశిష్యులు ఎక్కడెక్కడ యజ్ఞయాగాదులు జరుగుతున్నాయో అక్కడక్కడ అందరికీ వినిపించేవారు. లోగడ సర్పయాగాన్ని విరమించిన జనమేజయునికి వేదవ్యాసుని ఆదేశం ప్రకారం వైశంపాయనుడు భారతాన్ని వినిపించాడు. అలాగే సూతుడు నైమిశారణ్య పుణ్యక్షేత్రంలో బ్రహ్మర్షిగణ సమూపాసితుడైన కులపతి శౌనకుడు సత్రయాగం చేస్తుండగా వినిపించాడు. నాడు యజ్ఞయాగాదులు జరిగే సమయంలో అశేషజనగణాలు ఒక చోట సమీకరించబడేవి. అటువంటి సమయంలో కావ్యకథనం జరగడం ప్రజలకోసం సాహిత్యం అన్న విషయాన్నే చెపుతుంది.

శౌనకాది మహామునులు అప్పటికే భారతాన్ని వినలేదు. సూతుణ్ణి చూసి అతనివల్ల వివిధ పుణ్యకథలు వినవేడ్క చూపెట్టేరు. సూతుడు వాళ్లని "మీకే కథ వినాలని ఉంది" అని అడిగేడు. వాళ్లు తడుముకోకుండా చాలా చక్కటి సమాధానం చెప్పేరు.

"ఏ యది హృద్యమపూర్వం
బే యది యద్దానివలన నెఱుక సమగ్రం
బై యుండు నఘనిబర్హణ
మే యది యక్కథయ వినగ నిష్టము మాకున్"

అని అన్నారు. పరిశీలిస్తే నిజంగా ఇదే కావ్యానికి అసలైన నిర్వచనం అని తెలియగలదు. కావ్యం హృద్యంగా ఉండాలి. అపూర్వంగా ఉండాలి. దానివలన విజ్ఞానం సమగ్రం అవాలి. అది అఘనిబర్హణం కావాలి. అదే నిజంగా ప్రజలు వాంఛించే కావ్యం. (కావ్యాన్ని హృద్యంగా రచించడానికి కావలసిన సంవిధానం, చాతుర్యం మొదలైనవి కవి యొక్క వ్యక్తిగత సమస్యలు.)

శౌనకాది మహామునులు పైవిధంగా జవాబు ఇవ్వగానే సూతుడు "సరే- మీకిష్టమైన కథ చెప్తాను వినండి" అని మొదలెట్టేడు. భారతం సంగతి చెప్పేడు. నేటి అమెరికన్ సినిమాలకి ట్రయిల్ పార్టులు చూపెట్టే విధంగా చెప్పేడు. సుదీర్ఘమైన వచనాలతో కూడుకొన్న నలభై మూడు పద్యాలలో ఈ సంగతిని నన్నయ గారు వ్రాసేరు. అంటే సూతుడు శౌనకాది మహామునులకు భారత ప్రాశస్త్యాన్ని ఎంతబాగా ముందుగా తెలియచేశాడో చూడవచ్చు. ప్రతి ముఖ్య ఘట్టాన్ని ఆయువుపట్టుని ముందే కొద్దికొద్దిగా చూపెట్టి ఉత్సాహాన్ని రేకెత్తించాడు. ఇంత అయిన తరువాత శౌనకాది మహామునులు శ్రీ మహాభారత కథాశ్రవణ పరులైనారు. గానీ వాళ్ళు [illegible] శ్రోతలు. నిజంగా ప్రజలకి ప్రతినిధులు. సూతుడు ట్రయిల్ పార్టులో కొన్ని కొత్తమాటలు వాడేడు "శమంత పంచకం అక్షౌహిణీ" అనేవి. వాళ్ళకి వాటి వివరాలు తెలియవు. కాబట్టి నిక్కచ్చిగా "మునివరా శమంతపంచకం, ఆ అక్షౌహిణీ సంఖ్య ఏమిటో చెప్పినతరువాత అసలు భారత కథ ప్రారంభించి కారణం చెప్పు..." అంటూ అడిగేరు. సూతుడు సవిస్తరంగా చెప్పేడు.

ఆదికాలంలో కావ్య ప్రచురణ పౌరాణికుల కథనంద్వారా జరిగేది. నాడు పుస్తక విస్తరణ లేదు. నేడు నిరక్షరాస్యత. నాడు ప్రజలంతా కావ్యాలని సమిష్టి ప్రయోజనాలకోసం ఎలాగ ఉపయోగించుకొన్నారో అలాగే నేడుకూడా ప్రజలు కావ్యాలవల్ల లాభాలను పొందవచ్చు. శ్రవ్య కావ్యాలకి సూతుడులాంటి వ్యాఖ్యాతలుండడం అవసరం. నాడు తమకి తెలియని మాటలకు వివరణ శౌనకాది మహామునులు కోరినట్టే నేటి ప్రజలుకూడా నిర్మొహమాటంగా అడుగుతారు. నిజమైన కావ్యంవల్ల తమ ఎరుకని సమగ్రం చేసుకొంటారు.

అభ్యుదయ సాహిత్యంలో నమ్మకం ఉన్న వాళ్ళు హృద్యమైన అపూర్వమైన ఎరుకని సమగ్రంచేసే శ్రవ్యకావ్యాలని నేటి శౌనకాది మహా జనులకు వినిపిస్తే-నమ్ముతున్న 'సాహిత్యం ప్రజలకోసమే, అన్న సత్యాన్ని ఆచరించినట్టవుతుంది.




(గతసంచిక తరువాయి)

## మల్లికార్జున రాయలు

(క్రీ. శ. ౧౪౪౬-౧౪౬౫)

మల్లికార్జునరాయలు తనతండ్రి మరణ కాలమున పసివాఁడు; పితృవ్యుఁడగు నిమ్మడి విజయరాయలతో బోట్లాడి సామ్రాజ్యమున కంతటి కేకాధిపతి యాయెను. ఇతని కిమ్మడి లేక ముమ్మడి ప్రౌఢదేవరాయలనియు, ముమ్మడి దేవరాయలనియు నామాంతరములు గలవు. *

మల్లికార్జునరాయలు దుర్బలుఁడు; కావున నితని కాలమున సంగమవంశ నృపాలుర బలము సన్నగిల నారంభించినది. రాయలకును గజపతులకును గల ద్వేషము హెచ్చినది; ద్వేష కారణము రెడ్డిరాజుల యేలుబడికి లోనై యుండిన తీరాంధ్ర దేశము. ఒకప్రక్క విజయనగరరాయలును మఱియొక ప్రక్క కళింగగజపతులును తీరాంధ్ర దేశము దమకు దమకని పోట్లాడ సాగిరి. బహమనీ సుల్తాను దోసిరాజు గాఁడు; అతఁడును ముందుకు వచ్చి వీరితో బెనఁగులాడ నారంభించెను. అంతట ప్రారంభమైనది మూఁడుసింహాసనముల దొరలకును పోరాట. శ్రీనాథకవిసార్వభౌముఁడీ యంశమును జక్కఁగ విశదపఱచియున్నాఁడు.

> 'పరిపంథిరాజన్య బలముల బంధించు
> కొమరుమించినబోడు కొండవీడు
> ముగురురాజులకును మోహంబు పుట్టించు
> గుఱుతైన యుంటిత్రాడు కొండవీడు'

అని రాయ రాజధానియందు చాటి చెప్పినాఁడు. ఈ వైరము ముగురు రాజులతో నాగిపోలేదు. ప్రజలయందు నైకము ప్రాకెనది; వీరిలో నెవరి కంటె నెవ్వ రధికులని వాదులాడువారు; ఉద్రేకము హెచ్చఁగా జేతులు కలుపువారు.

'రయమున వృష్టికై యొరిగి రచ్చలపై విధి యింతు రుగ్రతన్ । † హయపతిమీఁద దంతిపతి

---

* మొదటి దేవరాయలు గాఢాధిక్యముగ ప్రౌఢదేవరాయలని పేర్కొనఁబడి యుండుట వలన, నితఁడు కొన్నిసమయముల ముమ్మడి ప్రౌఢదేవరాయలని చెప్పఁబడియున్నాఁడు; కాని యీ పేరు సర్వసామాన్యముగ నితని తండ్రి ఇమ్మడి దేవరాయలకు శాసనములందు గానవచ్చుటవలన నితఁ డిమ్మడి ప్రౌఢదేవరాయలను పేరునుగూడ వహించినట్లున్నది.

† హయపతి యనఁగా బహమనీ సుల్తాను, అశ్వబల మధికముగ గలవాఁ డగుటచే నతని కా పేరు వచ్చినది; దంతిపతి యనఁగా కళింగదేశాధిపతి, గజబలాధిక్యుఁ డగుటవల్ల నతఁడు గజపతి నాఁబరఁగెను; నరపతి యనఁగా విజయనగర రాయలు, అతని బలము ముఖ్యముగ కాల్బలముపై నాధారపడి యుండినందున నతనికి నరపతి యని బిరుదు కలిగెను.

శాతనిపై నృపతిక్ గజాది ని। ర్ణయముల మొత్తగాడుదురు...'

అని కృష్ణదేవరాయలు వీరి చర్యను వర్ణించి యున్నాడు.

నరపతి గజపతి యశ్వపతుల కొండొరులతో తీరాంధ్ర భూమికై పోరాటము మొదటి దేవరాయల కాలముననె యారంభమాయెను. కాటయ వేమునకు సహాయుడై దేవరాయలు గోదావరీ తీరమునకు పోవుట నెఱిగి, యతడు దన యధికారము నచట నెలకొల్పునని సంశయపడి, బహమనీసుల్తాను ఫీరూజుశాహు అన్నదేవచోడునికి బ్రాపై తానును సైన్యములతోగూడ నచటికే పోయి కర్ణాటక సైన్యములతో బోట్లాడెను; కాని యతడు నిర్వహించుకొనజాలక వెనుదిరిగి పోవలసివచ్చెను; అతని మిత్రు డన్నదేవచోడుడు యుద్ధమున నిహతుడాయెను. కర్ణాటక విజయమును సహింపక గజపతి నాల్గవ భానుదేవుడు రాజమహేంద్ర రాజ్యముపై దండెత్తివచ్చెను. అల్లాడరెడ్డి మధ్యవర్తియై వారిని సఖ్యపఱచి నిజ రాజ్యములకు వారి నంపివేసెను. ఇది తీరాంధ్ర దేశము కొఱకు నరపతి గజపతి యశ్వపతుల మధ్య నడచిన ప్రథమ యుద్ధము. తరువాత మొదటి విజయరాయల కాలమున రాయలు బహమనీ యుద్ధమున నిమగ్నుడై యుండుటను గని గజపతి నాల్గవ భానుదేవుడు తీరాంధ్ర దేశముపై దండు వెడలివచ్చి రాజమహేంద్రవర కొండవీటిరెడ్డి రాజ్యముల రెంటి నాక్రమించుకొని నాల్గేండ్లకాలము పాలించెను; కాని క్రీ. శ. ౧౪౨౭వ సంవత్సరమున నిమ్మడి దేవరాయలు తీరాంధ్రముపై దండువెట్టి గజపతిని వెడలనడచి, కొండవీటి రాజ్యమును స్వాధీనము చేసికొని రాజమహేంద్ర రాజ్యమున నల్లయవేమ వీరభద్రులను పునః ప్రతిష్ఠించెను. ఇది నరపతి గజపతుల మధ్య జరిగిన రెండవ యుద్ధము.

క్రీ. శ. ౧౪౩౪వ సంవత్సరమున నాల్గవ భానుదేవుడు స్వర్గస్థుడాయెను. అంతట పూర్వ గాంగరాజవంశ మంతరించినది. సూర్య వంశజుడగు కపిలేశ్వరుడు గజపతి యాయెను. క్రీ. శ. ౧౪౪౪-వ సంవత్సరమున కపిలేశ్వర గజపతి రాజమహేంద్రవర రెడ్డిరాజ్యముపై నెత్తి వచ్చెను; కాని మల్లప్ప ఉడయుల నాయకత్వమున నిమ్మడి దేవరాయలు లోకసైన్యము నంపి యాతని దిశాపట్టుని గావించెను. ఇది కళింగ రాయ సామ్రాజ్యముల మధ్య నడచిన మూడవ యుద్ధము.

కపిలేశ్వరుని రాజ్యాభిషేకముతో రాయ గజపతుల పరస్పరస్పర్థ యుత్కటమై హద్దుమీఱినది. ఉభయరాజ్యముల వారికిని కళ్యారణమున సంభవించిన ద్వంద్వయుద్ధమున యుద్ధకారణభూతమైన రెడ్డిరాజ్యము మాత్రమే కాక తీరాంధ్రము సర్వమును రాయల చేతినుండి దుసికిలిపోయినది. ఆ గంగాపినాకినీమధ్యస్థిత తీరభూమి యంతయు గజపతుల యేలుబడి క్రిందికి వచ్చినది.

మల్లికార్జునరాయలు గద్దెనెక్కిన వెంటనె కపిలేశ్వరుడు బహమనీ సుల్తాను అల్లావుద్దీను శాహుతో మైత్రి చేసికొని రాయ సామ్రాజ్యమును సాధించుటకు మరల ప్రయత్నమొనర్చెను. సమకాలిక సంస్కృత నాటకకర్త గంగాదాసుని గంగాదాస ప్రతాపవిలాస ప్రస్తావనయందీ దండయాత్ర ప్రసక్తి కొంత కలదు. 'విజయనగర పురందరుడు శ్రీమత్ప్రతాప దేవరాయలు మహేంద్ర సభ నలంకరించినంతటనె అతని పుత్రుడు మల్లికార్జునరాయలు సామ్రాజ్య సింహాసనము నధిష్ఠించెను; దానిని విని పూర్వము పరాభూతులైన దక్షిణసురత్రాణ గజపతు లిరువురును మితిలేని హయగజపదాతులతో గూడ నెత్తివచ్చిరి. విజయనగరమును చుట్టుకొని యుండిన అంతటి యపరిమాణసైన్యగజబలమును గిరికందరమునుండి సింహపుపిల్లవలె విజయనగరి నుండి శ్రీ మల్లికార్జునరాయలు వెలువడి తన వాడికత్తి నాదర యనెడు నీటివెల్లువ వల్ల బుట్టిన యేటివరదయందు హయపతి గజపతి సైన్యముల నంతటిని ముంచివేసెను. స్వదేహమాత్రావశేషుడైన గజపతి పలాయితుడాయెను; యవనాధిపతియును బాఱిపోయెను.' ఇందువల్ల గజపతియు బహమనీ సుల్తానును మల్లికార్జునరాయలు సింహాసనము నధిష్ఠించిన వెంటనె దండెత్తి వచ్చి విజయనగరమునకు ముట్టడివేసినట్లు తెలియుచున్నను, అది వాస్తవమని నమ్ముటకు వీలులేదు. అంత క్రమముగ హయపతి గజపతుల దండయాత్ర సాగి

పట్లు తెల్పు సూచనలెవ్వియు గానరావు. గంగాదాసు వర్ణించిన విజయనగర సమావృతి ప్రాయశః క్రీ. శ. ౧౪౪౦ వ సంవత్సరమున జరిగి యుండవలయును. ఏలనగా మల్లికార్జునరాయ లా సంవత్సరమున మహమ్మదీయులపై విజయమును బొందినట్లు శాసనములందు చెప్పి యున్నది; ఆ సంవత్సరమందే రాజమహేంద్రరాజ్య పూర్వసీమయందు కపిలేశ్వర గజపతి యాగమన మీ యూహకు దోహదమిచ్చుచున్నది. కృష్ణా గోదావరుల మధ్యదేశము నత డింకను జయించి స్వాధీనము చేసికొనజాలక పోయినను, మిత్రులగు వెలమవారి యేలుబడి క్రింది తెలింగాణముమీద సైన్యమును నడపుకొని విజయనగరముపై నెత్తిపోయి యుండవచ్చును. తత్కారణమున నేమొ యతడు వెలమవారి కధిరాజగు బహమనీ సుల్తానుతో మైత్రి సల్పినది. ఈ దండయాత్రయందు కపిలేశ్వరాములకు సంపూర్ణవిజయము చేకూడినట్లు తోచదు. ప్రతాపరుద్ర గజపతి తన పితామహుడైన కపిలేశ్వరుడు రాయల నోడించి యతని కడనుండి యింటిబాడవు ధనరాసిని కప్పము గొనెనని చెప్పి యున్నను, ఆతని మాటల నంతగ పాటింపదగదు; ఏలనగా నటుతరువాత నాలుగైదేండ్లవఱకును ఆంధ్రదేశమం దెచ్చటను గజపతివారి పొడ కానరాదు. కొండవీటి రాజ్యముపై మల్లికార్జున రాయల స్వాధిపత్యము క్రీ. శ. ౧౪౪౪-౫ పర్యంతము జెల్లుచువచ్చినది. ఈ ముట్టడి ప్రస్తావను మహమ్మదీయ చరిత్రలందు కానరాదు; దీనికితోడు పైజెప్పినట్లు శాసనములు క్రీ.శ.౧౪౪౦వ సంవత్సరప్రాంతమున మల్లికార్జున రాయలు మహమ్మదీయుల నోడించినట్లు సాక్ష్యము బల్కుచున్నవి. బహమనీ చరిత్రకారుల మౌనమును శాసనోక్త రాయవిజయమును విచారించి చూడగా, గంగాదాస ప్రతాపవిలాసమున జెప్పినట్లు, మల్లికార్జున రాయలు దన రాజధానికి ముట్టడివేసిన వైదేశిక దండయాత్రికుల నోడించి తఱుమగొట్టుటయే కాక సామ్రాజ్యమున సర్వత్ర తన యధికారమును నెగ్గించుకొనజాలెననియు దోచుచున్నది.

రాయ సామ్రాజ్యముపై గజపతి దండయాత్ర క్రీ.శ. ౧౪౪౪ వ సంవత్సరమునుండి పట్టుదలతో ప్రారంభమైనది. క్రీ.శ. ౧౪౪౦-౧౪౪౪ సం॥ ల మధ్య కపిలేశ్వర గజపతి రాజమహేంద్రవర రెడ్డి రాజ్యమును సాధించెను; మఱియు దన జ్ఞాతియగు గణదేవుని యాధిపత్యము క్రింద నొక గొప్ప సైన్యమును కృష్ణకు దక్షిణమున విజయనగర సామ్రాజ్యాంతర్గతమై యుండిన కొండవీటి రాజ్యమును జయించి స్వాధీనపఱచుకొనుట కంపెను. గణదేవుని యుద్ధయాత్ర జయప్రదముగ గొనసాగినది. రాయ సైన్యము లాద్దెవారిధాటి కాగజాలక కొండవీటి సీమను పరిత్యజించి పాఱిపోయెను. కొండవీడు, వినికొండ, అద్దంకి మొదలైన ముఖ్య దుర్గములును దత్ప్రాంత రాష్ట్రమును గపిలేశ్వరునికి హస్తగతమాయెను. తరువాత నాలుగేండ్లవఱకు విశేషాంశములు మఱియెవ్వియు సంభవించినట్లగపడవు. గణదేవుని స్థానమున కపిలేశ్వరుడు దన పుత్రుని, కుమారహంవీర మహాపాత్రుని, కొండవీటి దండపాట కధిపతిగ నియమించి, విజయనగర సామ్రాజ్యముపై దండు వెడలి జయింప నాజ్ఞాపించెను.

హంవీర మహాపాత్రుడు గొప్ప యోధుడు; నేర్పరియగు దళనాయకుడు; ఆతని యాధిపత్యముక్రింద గజపతి దళములు దాక్షిణాత్య శత్రువులనెల్ల నిర్జించి యశస్సును గడించినవి. దక్షిణ దేశముపై నొక గొప్ప దండయాత్రను నేర్పుతో గొనసాగించి, యుద్దె సామ్రాజ్య వైశాల్యమును విశేషముగ పెంపొందించి హంవీరుడు వన్నెకు వాసికెక్కెను.

ప్రప్రథమమున హంవీరుడు దేవరకొండ వెలమవారికి సహాయముగ తెలింగాణముపై దండు వెడలెను. వెలమవారిపై దురకల యొత్తిడు రానురాను దుర్భరము గాజొచ్చినది. వారి స్వయంకృతాపరాధమున కిది ఫలము. కాపయ నాయకునితో విగ్రహించి వెలమనాయకులు బహమనీ సుల్తానుయొక్క సహాయము నపేక్షించిరి. తెలింగాణము నెట్టయిన దమ యేలుబడి క్రిందికి దెచ్చుకొనవలయునని ప్రయత్నము సల్పుచుండిన బహమనీసుల్తాను లందులకు సంతసించి కాపయనాయకుని యధికారమును గూలద్రోయుటకు వెలమవారికి దోడ్పడిరి. తదనంతరము తెలింగాణమందు చాలభాగము వెలమ

వారియధికారముక్రిందికి వచ్చినను, స్వాతంత్ర్యము వారికి దక్కినది కాదు. బహమనీ సుల్తానులకు వారు కప్పము గట్టుచుండినట్లు మహమ్మదీయ చరిత్రకారులు చెప్పుదురు; కాని ఇది యెంత సత్యమో తెలియదు. హిందూ ప్రభువు లెంతటి పరాక్రమాతిశయముగలవారైనను దురకల కరిగాపులై యుండిరని వ్రాయుట వారికలవాటు; కావున వారి మాటలంతగ పాటింపదగినవి కావు. కాని విజయనగర బహమనీ యుద్ధములందు వెలమవారు ప్రాయికముగ సుల్తాను పక్షమున నె పోరాడుట జూడగా, వారు కప్పముగట్టినను గట్టకపోయినను వైదేశిక వ్యవహారములందు మాత్రము స్వేచ్ఛావర్తులుగాక సుల్తానుల మార్గము ననుసరించి యుండిరని తెల్లమగుచున్నది. వెలమవా రిట్లు బహమనీ సుల్తానులకు వశవర్తులై యుండినను దమ ప్రభుత్వమును నిలుపుకొనజాలకపోయిరి. తురకలకు కాఫరులయెడ విశ్వాసమెక్కడిది! ఎంతటి సాధువగు మహమ్మదీయుడైనను సమయము జిక్కినప్పుడు కాఫరుల కుత్తుకలు గోయుటకు వెనుదీయరు. రాజ్యతృష్ణాపీడితులైన బహమనీ సుల్తానుల మాట చెప్పవలయునా! వెలమల యధికారమును గూలద్రోసి తెలింగాణమును బహమనీరాజ్యమున గలుపుకొను ప్రయత్న మహమదుషాహు కాలమున ప్రారంభమైనది. క్రీ. శ. ౧౪౨౪-౨౫ వ సంవత్సరమున నహమదుషాహు తెలింగాణముపై దండెత్తిపోయి దక్షిణమున వెలమల నోడించి యోరుగల్లు భువనగిరి రాజాచల దుర్గములను, నుత్తరమున మాహురప్రభువు నోడించి మాహురు రామగిర్యాది దుర్గములను, కల్లను వజ్రపు గనులను స్వాధీనము జేసికొనెను. క్రీ. శ. ౧౪౩౫ వ సంవత్సరమున సుల్తాను తన కుమారులకు రాజ్యము పంచియిచ్చినప్పుడు తన రెండవ కుమారుడగు మహమ్మదుఖానునకు రామగిర్యాది దుర్గములతో గూడ నుత్తర తెలింగాణమును, మూడవ కొడుకగు దావూదుఖానునకు రాజాచలాది దుర్గములతో గూడ దక్షిణ తెలింగాణమును విభజించి యిచ్చెను. దేవరకొండ యొక్కటియె తురకలకు వశపడక మిగిలి యుండినది. తండ్రి ప్రారంభించిన కార్యము ముగించుటకిమ్మడియల్లాఉద్దీను పలుమారులు ప్రయత్నము గావించెను; కాని యుత్తర తెలింగాణమున దురకసర్దారుల తిరుగుబాటువలన యతని కోరిక నెఱవేరినది కాదు. దేవరకొండ వెలమలు గజపతి కపిలేశ్వరునితో సఖ్యము గావించుకొని సుల్తాను అధికారమును ధిక్కరించిరి. ఇమ్మడి అల్లాఉద్దీను కాలము క్రీ.శ. ౧౪౫౮ వ సంవత్సరమున కాలధర్మము నందెను; అతని తరువాత బీదరు సింహాసనము నధిష్ఠించిన యతని జ్యేష్ఠపుత్రుడగు హుమాయూను వెలమలను నిర్మూలము గావింప నిశ్చయించి గొప్ప సైన్యమును దేవరకొండపైకంపెను. బహమనీ సైన్యములు వచ్చి కోటను ముట్టుకొన్నవి. వెలమవారికి తల ప్రాణము తోకకు వచ్చినది. 'త్రాహి త్రాహి' యని గజపతికి సందేశ మంపుకొనిరి. వారిని సంరక్షించుటకొఱకే తండ్రి యాజ్ఞ చొప్పున హంవీరుడు దేవరకొండపై నడచినాడు. ఒడ్డెదండు సమీపమునకు వచ్చి చేరువఱకును దురకల కీ సంగతి తెలియదు; కావున వారు అడకొత్తుగాని పోకలవలె శత్రువులమధ్య జిక్కుకొనిరి. వెనుక ఒడ్డెలు. ముందు వెలమలు. హంవీరుని దళములు పొడచూపి నంతటనె, వెలమలు కోట ద్వారాలను దెఱచుకొని బహమనీ ఫౌజుపై బడిరి. వెనుక నుండి హంవీరుని దండు తాకినది. ఆనాడు దేవరకొండ రణక్షేత్రమున దురకలు దన వలమున బడిన మిడుతలవలె మ్రందిరి. హతశేషు లాహిరి యున్న నుప్పుగల్లమ్ముకొని బ్రతుకుదమని పాఱిపోయిరి. దేవరకొండ నుండి హంవీరుడు ఓరుగంటికి బోయి యాపట్టణమును వశము గావించుకొనెను; ఓరుగంటి తరువాత మాహురు; అటువెనుక క్రీ. శ. ౧౪౬౦ వ సం॥న తెలింగాణమంతయు స్వాధీనపడినది. తురకలు పటాపంచలై యడపొడ గానరాక పోయిరి. ఈ విజయములకు సూచకముగ కపిలేశ్వరుడు 'నవకోటి కర్ణాటక కలుబరిగేశ్వర' యను బిరుదును వహించెను.

తెలింగాణము నిట్లు జయించి స్వాధీనపఱచుకొన్న పిమ్మట హంవీరుడు దక్షిణమున విజయనగర సామ్రాజ్యముపై దండెత్తిపోవ సమకట్టెను; సన్నాహమంతయు సంపూర్ణమైన పిదప క్రీ. శ. ౧౪౭౦ సం॥న దండు కొండవీటినుండి బయలువెడలి విజయనగరముపై బోవలయునని యేమొ శ్రీశైలమునకు పశ్చిమాభిముఖముగ నడచినది; కాని యటుమీద దండయాత్ర సాగలేదు; శత్రుప

లచే బరాజయ మందెనేమో హంవీరు దంకట నా యుద్ధమును చాలించుకొనెను; మఱి మూడు సంవత్సరములదాక యుద్ధవార్త లేదు. క్రీ.శ. ౧౪౬౩వ సంవత్సరమున నతడు మఱియొక సైన్యమును సమకూర్చి తనపుత్రుడగు కుమార కపిలేశ్వర మహాపాత్రుని యాధిపత్యము క్రింద దక్షిణ దిగ్విజయార్థం బంపెను. విజయనగర దండయాత్రవలె గాక నిది యవ్యాహతముగ కొనసాగినది; కుమార కపిలేశ్వరుని ధాటికి మార్గమున నెచ్చటను నిరోధము గల్గినట్లు కాన్పించదు; పూర్వసముద్రతీర దేశమందలి ముఖ్యదుర్గముల నన్నిటిని జయించెను. ఉదయగిరి, చంద్రగిరి, పడైవీడు, కంచి, వలుదలంపట్టి, తిరువారూరు, తిరుచినాపల్లి మొదలగు దుర్గములన్నియు నతని కొకదాని వెనుక నొకటికై వశమైనవి. దక్షిణ సముద్రమున రక్తసిక్తమైన తన కరవాలమును కుమార కపిలేశ్వరుడు గడిగి పరిశుద్ధము గావించెనని గజపతుల శాసనములందు చెప్పఁబడియున్నను, నతడు కావేరిని దాటినట్లగపడదు. ఏకారణము వల్లనో తెలియదుగాని, యతడెంత వేగిరముగ దండు నడుపుకొనిపోయెనో యంతకంటె సత్వరముగ వెనుదిరిగి పోవలసివచ్చెను; అతడు ద్రావిడ దేశమున జయించిన దుర్గములును రాష్ట్రములును వెంటనె రాయలకు స్వాధీనపడినవి. ఉదయగిరి దుర్గము మాత్రము గజపతుల స్వాధీనమున నిలిచి పోయినది. కుమార కపిలేశ్వరపాత్రుని దక్షిణ దండయాత్ర వల్ల తుండీర చోళమండలములందు చాల యలజడి కలిగినది; గాని రాజకీయార్థిక పరిస్థితులు మారలేదు. తీరాంధ్రమునం దాయపట్టు స్థానములగు నుదయగిరి కొండవీడు దుర్గములును దదాశ్రయరాష్ట్రములు నష్టమై పోవుటవలన, సామ్రాజ్యమునకు బలిమి చెడెను; శత్రు వారిని ప్రతిఘటించి మరల్పజాలక పోవుటవలన రాయల పరువు ప్రతిష్ఠలకు లోటు వాటిల్లెను.

కుమారకపిలేశ్వరుని దండయాత్ర ముగిసిన పిమ్మట మల్లికార్జునరాయలు చాల కాలము జీవించి యుండలేదు. క్రీ. శ. ౧౪౬౭ వ సంవత్సరమునం దతడు మృతినందిన ట్లున్నది. మల్లికార్జునరాయలు బలాత్కారముచే మృతిబొందెనని యెంచుట కవకాశము గలదు. ప్రపన్నామృతమను వైష్ణవమతగ్రంథమునందు మల్లికార్జునరాయలను నిద్రితుడై యుండగా నతని పితృవ్య పుత్రుడగు నిమ్మడి విరూపాక్షరాయలు వధించి సింహాసనము నాక్రమించుకొనెనని యొక యైతిహ్యము గలదు. ఇది యసంగతము గాదు. ఏలనగా, రాజశేఖరు డను పుత్రుడొకడు మల్లికార్జునరాయల కుండగా నాతని గాదని ఇమ్మడి విరూపాక్షరాయలు సింహాసనము నాక్రమించుకొనుటయును, విరూపాక్షునికి బద్ధశత్రువైన సాళువ నరసింగరాజును రాజశేఖరరాయ లాశ్రయించుటయును నైయాయిక ప్రోద్బలముగ నున్నవి; మల్లికార్జునరాయలకు బుత్రు డుండునప్పు డతని జ్ఞాతియగు నిమ్మడి విరూపాక్షునికి సింహాసనము నెక్కు హక్కు గలిగియుండదు. కావున, నిమ్మడి విరూపాక్షరాయలు ప్రపన్నామృతమున జెప్పిన విధమున మల్లికార్జునరాయలను వధించి యున్నను లేకపోయినను, సింహాసనమును బలాత్కారముగ నాచికొని సామ్రాజ్యము నాక్రమించుకొనె ననుటకు సంశయ మందఁ బనిలేదు.

(సశేషము)



పిల్ల : నీకు జ్ఞాపకం ఉందిలే అమ్మా, ఆ గాజు కూజా!

తల్లి : ఏ గాజు కూజా?

పిల్ల : అదే, నువ్వు తరతరాలనుంచీ వస్తూందని చెప్పిన గాజు కూజాయే—

తల్లి : ఆc, యిప్పు డేమొచ్చింది దాని మాటా?

పిల్ల : అబ్బే, దాన్ని యీ తరం ఎత్తేసిందిలే.

# పాముల సీతయ్య ప్రస్థానం

అంగర వెంకటకృష్ణారావు

కృష్ణపులీకరి ఒయ్యారంగా వంపు తిరిగిన చోటును ఆనుకొని, ముచ్చటగా మూడు వందల యిళ్లతో మురిసే పాటజారీ గ్రామంలో, గ్రామీయుల ముఖాలన్నీ ఆవేళ చిన్నబోయి వున్నాయి. సాయంకాలపు నీరెండలో కర్ణపులి కొత్త రూపాయిలవలె మిలమిల మెరసే కన్నీళ్లు కారుస్తూంది.

కారణం, ఆవూరికి క్రొత్తగా కాపరానికి వచ్చిన ఒక కాపు పడుచు పాముకరిచి చని పోయింది. ఏక కుటుంబంలాగున్న పల్లెవాసు లందరూ, కరణం మొదలు కూలీకనకూ, యీ దుఃఖాన్ని సమానంగా పంచుకొన్నారు. గతిం చిన కాపు పడుచు శరీరం మట్టిలో కలిసిన గం టకే ప్రతి జీవిలో పుట్టిన సద్యోవైరాగ్యం సన్నగిల్లి, చీకటిలో నదీ జలాలలా, అజ్ఞాన తిమి రంలో ఐక్యమైపోయింది.

కాని ఒక్క మనిషిమాత్రం రాత్రి పది గంటలైనా యింకా యీ విషయాన్ని తనలో వితర్కించు కొంటున్నాడు. అతని పేరు సీతయ్య.

సీతయ్య, గౌరి హరిజన దంపతులు. వీళ్ల కుటీరం వూరికి కొంచెం దూరంగా, నదికి కొంచెం దగ్గరగా వుంది. సీతయ్య వూరికి కూలికాడు, ఉద్యోగం చేయలేదు. అతడికి పిల్లలు లేరు. కరణంగారి ప్రపితామహులు తన ప్రపితామహు లకి ఎప్పుడో తన యింటి వెనకని నదిని ఆనుకొని వున్న చిన్న మడిచెక్క దున్నుకోమని యిచ్చేరు. దానిమీద కూరలు కాపించి ఆవూళ్లో వాళ్లకే, ఖరీదుకని కాకుండా యిస్తూ, వాళ్ల దగ్గరనుంచి గూమూళ్లు పుచ్చుకొంటూ కాలుమీద కాలు వేసుకొని కాలక్షేపం చేస్తున్నాడు.

కరణం మొదలైన పెద్దలమీద సీతయ్యకి ఎంత భక్తివుందో వాళ్ళకి అతడిమీద అంత ప్రేమ వుంది.

కరణంగారి అబ్బాయి పెంకితనం చేస్తే కళ్లెఱ్ఱ చేసి గద్దిస్తాడు. కరణంగారికి కాలు బెణి కితే దూరంనుంచే మంత్రిస్తాడు మాయమై పోయేలా.

అయితే సీతయ్యదగ్గర మరొక విద్య వుంది. అందరికీ ఎర్రచీమలు, చలిచీమలు అంటే ఎలాగో అతడికి పాములంటే అలాగ. అతడి యింట్లో పాములు కోడిపిల్లలలా తిరుగుతుంటాయి. అతడు వాటితో ఆడుకొంటాడు. వాటిని చిరు బూతులు తిడుతూ ముద్దు పెట్టుకొంటాడు.

అతడు మంత్రించడం మహా తమాషాగా వుం టుంది. కాటు తిన్న మనిషివద్దకు వచ్చి 'ఓరీ! తెగవయ్యా, మా [illegible]డివి'' అంటాడు నవ్వుతూ. యముడిని విఫల మనోరథుడిని చేసి లేచి తీరాలి ఆ మనిషి.

కొత్తపాముని పట్టడానికి కన్నంలో భుజం వరకూ చేయి దూర్చి మహాకోపంతో, రౌద్రాకా రంతో, అల్లల్లాడుతూ బుస్సలుకొట్టే నాగన్నని నిలువునా పైకిలాగినప్పుడా దృశ్యం చూసి తీరాలి. అతడి శరీరంనిండా లెక్కలేనన్ని పాముకా ట్లున్నాయి. అతడి రక్తమే పాము విషానికి విరుగు డేమో. అంత సీతయ్యా ఆ రోజున కాపు పడుచును బ్రతికించలేకపోయాడు. అదే అతనికి ఆరని ఉక్రోషం; తీరని సమస్య.

పదిరోజులు గడిచాయి. తన పరాజయాన్ని సీతయ్య కొంచెం మరచిపోతున్నాడు. ఇంతలో మళ్ళీ వూరికి బయటనున్న ఆ మైదానంమీదే కరణంగారి ఏకైకకొడుకుని కాటేసింది పాము. సీతయ్యకి కబురొచ్చింది. కన్నీళ్లతో కరణంగా రొచ్చి సీతయ్యని తాకి రెండుచేతులూ పట్టుకొని తన ఒక్కగాని ఒక్కకొడుకుని బ్రతికించవలసిం దని ప్రార్థించారు.

"ఏ పేర్నె పిలుచుకొంటాం సీతయ్యా వాణ్ణి" అంటే, సీతయ్య నిర్భయంగా నవ్వుతూ ధీమా

యిచ్చాడు. సంతానంలేని యీ వైద్యశ్ర సీతయ్యకు పేగుతీపు తెలీకపోయినా, ఆత్మ విశ్వాసం ఎక్కువ కావడంచేత చలించలేదు.

అతడు మంత్రం ప్రారంభించి ఎనిమిదిగంటల నుంచీ విశ్వప్రయత్నం చేస్తూంటే సూర్యుడు నడి నెత్తిమీద సూదులు గ్రుచ్చుతూన్నా పిల్లవాడు కదలలేదు, మెదలలేదు.

సీతయ్యకి రానురాను ధైర్యం తగ్గిపోయింది. సాయంత్రం నాలుగుగంటలకు కుర్రవాడు మరణించాడు. ఊరల్లా వలవల ఏడ్చింది. కరణం గారి దుఃఖం వర్ణింపరానిది.

ఈ పరాజయానికి సీతయ్య తట్టుకోలేక పోయాడు. ఇద్దరి పొట్టపెట్టుకొని తనకీర్తికి మాయనిమచ్చ ఆపాదించిన ఆ పామును పట్టి తీరవలసిందే అని నిశ్చయించాడు. అసలు పగకు పాము మిక్కిలి ప్రసిద్ధి. పాముకన్నా ఎక్కువ పగగలవాడు సీతయ్య. గౌరి ఎంత బ్రతిమాలినా అన్నం తినలేదు. అతనికి నిద్రపట్టలేదు. కూర్చొని, లేచి, ఇటుఅటు ఒత్తిగిలి, పాము బుస్సవలె దీర్ఘమైన నిట్టూర్పు విడిచాడు. గౌరి చాలా విసుక్కుంది.

మనసు కుదుటబట్టక సుమారు పదకొండుగంటల రాత్రికి గౌరి వారిస్తున్నా వినకుండా తలుపు తెరచుకొని సీతయ్య తిన్నగా మైదానందగ్గరకు వెళ్లేడు.

శుక్ల చతుర్దశినాటి కరిగిన వెండిలాంటి తళుకు వెన్నెలలో మెరిసే ఆకుపచ్చ మైదానం మీద నిశ్శబ్ద రాత్రీ దేవతను ఆరాధిస్తున్న నాగ రాజును కళ్లార చూశాడు. చుట్ట పీల్చేసరికి ఎర్రగా వెలిగిన వెలుగు, మెల్లగా అతడు దగ్గిన దగ్గు నాగన్నని ఆకర్షించాయి. ఇది సమయం కాదని సీతయ్య ఇంటిముఖం పట్టాడు. ఇది కాలంకాదని నాగరాజు పుట్టముఖం పట్టాడు.

మిగిలిన రాత్రంతా సీతయ్య కలవరిస్తూ కలత నిద్రతో వున్నాడు. తొలికోడి కూయగానే పిల్లిలా లేచినప్పటికి "ఎక్కడికిరా మావా" అంటూ గౌరికూడా లేచింది. "గౌరీ, నీ కివాళ గొప్ప బహుమానం తెస్తాను" అన్నాడు వేడుకగా నవ్వుతూ సీతయ్య.

"మావా-యివాళ నువ్వు బయటకి వెళ్లొద్దు, నాకు మనస్సులో పెద్ద బాధగా వుంది" అని గౌరి అంటూంటే నోట్లో చుట్టకి నిప్పంటిస్తూ వెకిలినవ్వు నవ్వేడు సీతయ్య, గౌరివెంపు ఓరగా చూస్తూ.

పంచ కట్టుకొన్నాడు. పొడుగు చేతుల చొక్కా తొడుగుకొన్నాడు. నాగులచవితికి కరణంగారు బహూకరించిన పెద్ద నాగులు గావంచా తలకి చుట్టేడు. గౌరి ఎంత వారించినా వినకుండా మైదానం చేరుకొన్నాడు.

మైదానానికి తూర్పు వైపున స్వర్ణపురిని ట్రంకురోడ్డులో కలిపే రోడ్డు వుంది. మిగిలిన మూడువైపులా ముండ్లకంచెల ఆవరణ వుంది. పడమటివెంపు ఎప్పుడూ నీరు చేరివుంటుంది. ఆ నీటికీ ఆవరణకీ మధ్యను ఎక్కడనో కాపురముంటున్నాడు నాగరాజు. సీతయ్య మైదానం చేరుకొనేసరికి మైదానం మధ్యభాగంలో నాగన్న వున్నాడు.

చంద్రాస్తమయం అప్పుడే అయింది. సూర్యుడి సప్తాశ్వాలు కక్కుతూన్న డిండీర కాంతికి ఆకాశం మెరుస్తున్నాది. ప్రకృతి ప్రశాంతంగా, రమణీయంగా వుంది. చల్లని రివట గాలి ఏటిమీంచి వచ్చి హాయి హాయి మనిపిస్తూంది.

నాగరాజు యీ ప్రకృతి రామణీయకతలో తన్మయంచెంది పడగవిప్పి రెండడుగుల యెత్తు లేచి నిశ్చలంగా యోగివలె వున్నాడు.

పామును చూసి సీతయ్య మొట్టమొదట ముక్కుమీద వేలేసుకొని ఒక నిట్టూర్పు విడిచాడు. అది మహానాగం. దాని బుస, యమ ధర్మరాజు మహిషపు బుస. దాని దృష్టి లోకాంతరం నుండి పిలుపు. దాని కాటుకు తిరుగులేదు.

సీతయ్య తల పంకించాడు. మళ్లీ నిట్టూర్పు విడిచాడు. ఆవరణచుట్టూ తిరిగి పాముకు వెనుక వైపునుండి వచ్చి రెండుగజాల దూరంలో ఊపిరి బిగపట్టి అరనిమిషం నిల్చొని ఆలోచించాడు. నెమ్మదిగా అడుగులో అడుగువేసి నడిచి వెళ్ళి దాని కంఠభాగాన్ని కుడిచేత్తో, నడుమును ఎడమచేత్తో గట్టిగా అదిమి పట్టుకొంటే అంత నాగరాజూ మేకపిల్లలా అణిగిపోయి మణిగి

చూర్చొన్నాడు. సీతయ్య సగర్వంగా బుజ్జగింపుగా దాన్ని తీదుతూ తన నాగులు గావంచా మడతలో పెట్టి యథాప్రకారంగా ఆ గావంచా తలకి చుట్టుకొన్నాడు.

మైదానం విడిచి అతడు రోడ్డెక్కేసరికి యేటివద్ద కాలకృత్యాలు తీర్చుకొని వస్తూన్న కరణంగారెదురై సీతయ్య దండంపెడితే పలకరించారు. పాముని పట్టిన సంగతి విని ఆశ్చర్యపోయి ఎక్కడుందని ప్రశ్నించారు. అతడు పాగావెంపు చూపెట్టగానే లోపలనుండి నాగన్న వున్నాను సుమీ అన్నట్టు బుస్సుమంది.

కరణంగారి గుండె జల్లుమంది. "సీతయ్యా, ఏమిటి నీ ధైర్యం? ఒక కర్ర లేదు, కంప లేదు, తోడైనా ఎవరూ లేరు. పైగా ఆ మృత్యుదేవతని తలమీద ధరించేవు. నీవు మనిషివేనా లేక సాక్షాత్తు సుబ్రహ్మణ్యస్వామివా! ఈ పని నిన్న జరిగివుంటే నా గోడుకు" అని కంట నీరు పెట్టుకొని కరణంగారు వెళ్ళిపోయారు.

సీతయ్య తలుపు తట్టేసరికి గౌరి ముఖం చిట్లించుకొంటూ వచ్చి "దొరికిందిరా మామా పాము?" అని ఎగతాళిగా నవ్వింది. వెంకిరిసానికి సీతయ్య లేదన్నట్టు బుర్ర వూపేడు. గౌరి పాగా లాగబోయి గావంచా పట్టుకోవేసరికి నాగన్న బుస్ మంది. ఆఖరి కోడి కొక్కొరోకో మని కూసింది.

గౌరి నానాతిట్లూ తిట్టింది. ఇల్లంతా గెంతింది, కాని సీతయ్య నవ్వుతూ నేలని చతికిలబడి గంజి పట్టుమన్నాడు. పాగా తీసి జాగ్రత్తగా ప్రక్కన పెట్టి, ఊరగాయ నంచుకొంటూ గంజి తాగుతూ గౌరితో కబుర్లు చెబుతున్నాడు సీతయ్య. అతడన్న వాటన్నిటికి అపార్థంగా వింటూ తిడుతూ తనపని చేసుకొంటూ గౌరి అతడివెంపు చూడడమే లేదు.

ఈలోగా నాగన్న చడిచప్పుడు లేకుండా, గావంచాలోంచి బయటికి వచ్చి సీతయ్య వెనుకకు చేరి ఒక్కసారి నడుమొప్పంత ఎత్తెగిరి సింహాపు పంజా దెబ్బవలె సీతయ్య వెంట్రుకలులేని నడినెత్తిమీద టస్ అని కాటు వేసింది. తను కదలకుండా తాడులా పడిపోయింది.

"తీర్చుకొన్నావురా పగ" అని సీతయ్య అరచాడు. బయటనున్న గౌరి గాభరాగా వచ్చింది. సీతయ్య మంత్ర ప్రయోగం చేసుకొన్నాడు. కాని స్పృహ తప్పిపోతూంది. గౌరి పామును తిట్టింది. సీతయ్యను తిట్టింది. తనను మరీ తిట్టుకొంది.

సీతయ్యదగ్గరొక మణి వుంది. అది అమూల్యమైనది. ఆమణి తీసుకురమ్మని సంజ్ఞ చేశాడు. కుటీరమల్లా వెతికింది, ప్రతీసామానూ తీసిచూసింది. ఆ వెర్రిలో వస్తువులను చిందరవందరచేసి అలసిపోయి చెమటపోసి నెత్తిమీద రెండు చేతులూ పెట్టుకొని బావురుమని ఏడవసాగింది. మణి దొరికి వుంటే సీతయ్య బ్రతికేవాడు.

మరొక్క అరగంటలో గ్రామం జనం అందరూ సీతయ్య కుటీరం చుట్టూ మూగారు. పాములాంటి సీతయ్యను, సీతయ్యలాంటి పామునూ చూసి ఆశ్చర్యపోయారు.

కొందరు చివరకు పగ సాధించాడురా సీతయ్య అనుకొన్నారు. మరికొందరు చివరకు పగ సాధించాడురా నాగన్న అనుకొన్నారు. నిజంగా ఎవరు సాధించారో పగ?



ఒకమారు ఒక సినీమా తారా, ఒక కవీశ్వరుడూ కలిసి కాఫీ తాగుతున్నారు. ఆ సినీమా తారకి వల్లమాలిన గర్వం, మధ్యలో అనుమానం వచ్చి ఆమె కవిని యిలా అడిగింది: "నా సినీమా రోజులు అయిపోయాక, నన్ను ప్రేక్షకలోకం అభిమానిస్తుం దంటారా?"

"ఇంకా అనుమాన మేమిటి?" అని టక్కున సమాధాన మిచ్చాడు కవి.

కథానిక

# అపస్వరాలు

"దుర్గానాథ్"

స్వయంనిశ్చితాలయిన ఉన్నతాదర్శ, ఆశయాలను- యెంతో పట్టుదలతో, కార్యనిర్వాహక దీక్షతో ఆచరిస్తున్నా- ఆచరించటానికి ప్రయత్నిస్తున్నా చివరికి ఒకోసారి మనిషి నిస్పృహతో నిండిన హతాశతో చతికిలబడవలసి వస్తుంది. జీవి- తన మానసిక, భౌతిక శక్తుల్ని స్వాధీనం చేసుకోలేక వాటి హస్తగతమయిపోవటమే దీనికి నిర్దిష్టమైన జవాబు అవను. వ్యక్తి వాతావరణం కూడా ఈ చతికిలబడిపోవటంలో బాగా పని చేస్తుంది.

ప్రపంచంలో ప్రతి వ్యక్తీ కూడా తన దృక్పథాన్నే కొలబద్ద చేసి యెదుటి వారిని కూడా పరిశీలించి, తన గుణగణాల్లోనే వారిని కూడా ఊహించుకోవటం వల్ల కూడా ఈ విషయం సంభవమే. లోకానుభూతికి అనుగుణంగా దాసోహమనీ స్వయంనిర్ణీతాలయిన ఆశయాదర్శ శిఖరాల్నుంచి దిగజారమాడటం- అజ్ఞానం.

అనేక వ్యక్తిత్వాల బహుముఖాదర్శాలకు నిశ్చితనిర్ణయాల్ని బలియివ్వబూనటం కేవలం- వెర్రితనం.

అమ్మాయిని చూసుకుందుకు వచ్చిన అబ్బాయిని, అబ్బాయి తరఫు పెద్ద మనుషుల్ని చూసి అన్నపూర్ణమ్మగారు అదరా బాదరా వంట చెయ్యటమారంభించారు. బంగాళా దుంపలకూర, రవ్వపాటోళీ...ఒక్కొక్క వంటకాన్నే దింపుతున్న దన్నమాటేగాని సమయానికి నారాయణగారు ఊళ్ళో లేకే అన్న బాధ ఆవిడ మనస్సుని ఓ పక్కనుంచి పీకుతూనే వుంది.

"మీరు వచ్చినట్టుగానే ఆయనా ఊళ్ళో లేకుండా వెళ్ళారు...ఆయనకి దావాల గుమాస్తా పేరు వుండనే వున్నది లెండి-" అంది నెయ్యి అభిఘరిస్తూ వచ్చిన పెద్ద మనుషులతో.

"అలాగా-! ఫర్వాలేదు లెండి- ఎవరికైనా వస్తూంటాయ్ తొందరపన్లు-" పెద్దలు తలలు పంకించి అన్నం కలపటం ప్రారంభించారు. చేతులు నేతులతో నింపి ఆవిడ అడిగింది అబ్బాయికేసి చూస్తూ-

"అబ్బాయి- ఏం చదువుతున్నాడండి?"

మాట వినీ వినటంలోనే అబ్బాయి క్రాపు జుట్టులో సమ్మిళితమయిన పొడుగు వెంట్రుకల కుచ్చుని ఎడమ చేతితో పైకి తీసి సకల శాస్త్ర పారంగతుడైన పండితుని మాదిరి సవరించుకున్నా డొకసారి కీచుని వెళ్ళగక్కుతూ. అన్నపూర్ణమ్మగారి కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవై చూస్తున్నాయి. గది తలుపు సందుల్లోంచి ఓరగా చూస్తున్న కళ్ళు ఒక్కసారిగా మాయమయాయ్.

పక్కనున్న పెద్దమనిషి గొంతు సవరించుకుంటూ సకిలించి- "సయూపేట వెళ్ళి మామయ్యగారితో సంప్రతించే వచ్చాం- అమ్మాయీ!" అన్నాడు.

సయూపేట మామయ్యంటే అన్నపూర్ణమ్మగారికి ఎక్కడలేని గురి, భక్తీని. ఆయన ఏమన్నారో అన్న ఆత్రుత బాగా పనిచేస్తోంది.

"మామయ్య ఏమన్నారండి?" కూర మారు వడ్డిస్తూ అడిగింది.

"ఆయన- 'అంతా వారిష్టమే అన్నా'రమ్మా- కొంచెం దూరపువారైనా మీ చిన్నతనం నుండీ పెంచి ప్రేమగా పెద్దచేశారని విని, ముందుగా మే మక్కడికి వెళ్ళాం. మీ బాధ్యతే మీవారికి లేదన్నట్టు మాట్లాడే రేమిటండి-!"

తామంటే గొప్ప శ్రద్ధతో కలుగజేసుకుని బాధ్యతను వహించే మేనమామ ఇలా అన్నా డంటే అందులో ఆలోచన్ల కందని ఊహ ఏదో యిమిడివుండి తీరుతుంది. సంబంధంలో ఏదో లోప ముందన్నమాటే. అడిగిన విషయం వెనక్కు వెయ్యటం అన్నపూర్ణమ్మగారికి అనుమానంగానే వుంది.

"ఆయనతో ఏం చదువుకున్నాడని చెప్పారూ?"

తన ప్రశ్ననే అన్యోక్తిగా మళ్లా వారి ముందుంచింది. పెద్దమనుషుల కేక తప్పనిసరైంది. రెండో పెద్దమనిషి బరువుగా సమాధానమిచ్చాడు.

"మావాడా!.. వాడికి తెలుగు పూర్తయిందండి-"

అంటే ఏమిటో ఆవిడకు అర్థం కాలేదు. నుంచున్నంత సేపూ ఆలోచిస్తూనే వుంది. అమ్మాయికేమైనా తెల్సిందేమోనని ఓసారి గదిలోకి వెళ్లి అడిగింది.

"నే నెక్కడా విన్లేదు- ఏ చదువుకైనా పూర్తవట మనేది వుందా అసలు!" అంది అమ్మాయి.

వంటింట్లోంచి నారుగిన్నె తెస్తూ కూడా తనకున్న పరిజ్ఞానాన్నంతా వినియోగించి ఆలోచించింది. అయినా బోధపడలే దావిడకు.

"అబ్బాయి- ఇప్పుడేం చేస్తున్నాడండి?" చివరకు తెగించి అడిగేసింది.

"హరికథలు చెప్పుతున్నాడండి-" సగర్వంగా కాబోయే అత్తగారిమాటలో మాట కలిపేశాడు.

"తెలుగు పూర్తవట మంటే వాళ్ళ వుద్దేశ్యంలో అయిదో క్లాసు చదవటమేమోనే! ఆరో తరగతినించి ఇంగ్లీషో, హిందీనో ప్రారంభం చేస్తారుటగా-" అంది అమ్మాయి అన్నం తింటూ. అమ్మ ఆకిట్లో ఒత్తుకుంది ఆశ్చర్యంగా. దృఢమైన నిశ్చయం ఆమె కళ్ళలో మసిలింది.

వాకిట్లో మడతమంచాల మీద తాంబూల చర్వణం కానిస్తున్న పెద్దమనుషులతో అన్నపూర్ణమ్మగారు విన్నవించింది.

"కాస్త చదువుకుని ఏదో గౌరవమైన ఉద్యోగాన్ని చేసుకుంటున్న కుర్రవాడి కిద్దామనుకుంటున్నారు మావారు..." అని.

మూడు తలకాయలూ ఒక్కసారి విస్మయంతో పైకి లేచాయ్. ఎదురుగా కూచున్న 'వుల్లో పెద్దమనిషి' సంగతి గ్రహించాడు. "నీకేం తెల్సు అమ్మాయ్యా! నారాయణని రానియ్... ఆడదానివి! అలా తెగతెంపుగా మాట్లాడకూడదు-" అన్నాడు.

"నారాయణగారు ఇంకా నాలుగు మూడు రోజులు పోతేకాని రారండి-" ఆవిడకు సంపూర్ణమైన అయిష్టం విప్పడి పోయింది వారి మీద.

"పోనీలెండి - యిప్పుడు పోయిన దేముంది? వచ్చేదాకా ఉంటాం-" వచ్చిన పెద్దమనుష్యులన్నారు, 'వుల్లో పెద్దమనిషి' కేసి చూస్తూ.

"ఓ కప్పు కున్న హరికథలో?" ధాయివా నిలబెట్టుకుందుకు అబ్బాయి వుటంకరించాడు. అయినా ఆగిపోయేందుకే తుది నిశ్చయమయింది.

మరునాడు ఉదయాన్నే అబ్బాయి మొహం కడుక్కుంటూ 'ఆక్ సేగె సివా' వరవంలో కంఠ్రాలు దివ్యం పాట తాళంతో సహా రాగయుక్తంగా పాడుతుంటే పొరపాటున అమ్మాయి చూసింది. ఆ కే విషయాన్ని అబ్బాయికూడా గ్రహించటం తటస్థించింది. అమ్మాయితో తనకు గాంధర్వ వివాహం జరిగిపోయినట్టు భుజం తెగ రేశా డొకసారి. తనని తప్ప స్వయంవరానికి ఎంతమంది వచ్చినా, మరెవర్నీ యెన్నుకోదు అనే నిశ్చయాని కొచ్చేశాడు.

"అత్తగారూ - నేను బంగాళాదుంపల కూర వేపుడు, వంకాయ ఇగురు పచ్చడి, కొబ్బరి పాటోళీ తప్ప యింకేమీ తిననండీ-ఒక్క మిరియపుచారు మాత్రం తీసుకుంటాను-" పల్లు దప్పుడే గుటకలు ప్రారంభించాడు. ఈ 'వట్టి' సోడ్డు గుటకలు చూస్తూంటే అన్నపూర్ణమ్మగారికి ఒళ్లు మండుకొస్తూంది. ఉన్న రెండు రోజుల్లోనే అబ్బాయి గుణాలన్నీ అవగతమైనాయ్. హరిదాసు పాటలు వింటూంటే ఇంట్లో వాళ్ల ఒంటిమీద తేళ్లూ, జెర్రులూ ప్రాకుతున్నట్టుగా వుంది. సాయంత్రానికి నారాయణగారొచ్చి ఆ కాస్త మాటా కూడ కోటకొంబడి వినిపించే వరకూ హరిదాసుగారి మకాం ఆ యింట్లోంచి కదల్లే లేదు. పెళ్లానికి కూడైనా సవ్యంగా పెట్టటానికి సత్తాలేని ప్రతివాడూ 'పెళ్లి'కి సిద్ధమే.

అనుకున్న దాంట్ల సవ్యమైన మార్గంలో తీరక పోతే బహుముఖాల ప్రతీకారోద్దేశ్యాలకు దారి తీసి తీరుతుంది. ఆరోజు మొదలు పార్వతి సంబంధంకోసం ప్రయత్నించబోయే ప్రతివారి

దగ్గరకూ స్వంత ఖర్చులమీద ప్రయాణం చేసి- "ఆ పిల్ల నన్నే తప్ప యింకెవర్నీ చేసుకోనని విడు స్తుంటే తలి దండ్రులు బలవంతాన నీకు కట్టబెట్టు జూస్తున్నారు. నువ్వు దానితో ఏం సుఖాన్ని పొందుతావ్? మే మిద్దరం అంతర్య ప్రేమికు లం-" అంటూ ప్రచారం చెయ్యటం ప్రారంభిం చాడు మారిదాసు. సత్యంకంటె అసత్యమే తొందరైన ప్రచారాన్ని సంపాదించుకుంటుంది. ప్రజ లెక్కువగా అబద్ధాన్నే నమ్మగలరు కాని సత్యాన్ని కాదు.

నారాయణగారు కొండంత ఆశ పెట్టుకున్న మాటపాతిక రూపాయల విజయనగరం ఉద్యో గస్థుడినికూడా మాయ చేసి నమ్మించి పీటల మీద కొచ్చిన పెళ్లిని కూలదోశాడు. అయిదారు సంబంధాలవరకూ చెడగొట్టి నారాయణగారికి తీరని నష్టాన్ని కలిగించాడు. ప్రపంచ మంతే రోత పుట్టుకొస్తున్నా ఎదిగి యింట్లో ప్రతి నిమి షంలోనూ పెద్ద ప్రశ్నార్థకంలాగా కంటి కగు పించే పార్వతి మొహం చూసి విశ్వ ప్రయ త్నాలు విరమించుకోవటానికి వీల్లేక పోయింది నారాయణగారికి. మూడో కంటివాడికి తెలియ కుండా చిన్నదైనా ఏదో గౌరవమైన పని చేసు కుంటూ మర్యాదగా ఆరవై రాళ్లను తెచ్చుకుం టున్న కుర్రాడు వెంకట్రావును వెతికి నూట పాతిక రాకపోయినా ఆరవయికే యిష్టపడవల సొచ్చింది విధిలేక. చదువుకున్నవాడు ఇవాళ కాకపోతే రేపైనా తెచ్చుకో లేకపోతాడా అని ముడి పెట్టెయ్యటానికే నిశ్చయించాడు. అంతకంటె ఏం చేస్తాడు పాపం, పరిస్థితులు కలిసిరావప్పుడు? ఏదో కాస్త బాగా చదువుకుని 'బా' నటించుకునే ఉద్యోగం చేసుకుంటున్న వాడి చేతిలో పెట్టి సాకుదిక్కట్ల 'న్యాయం' చెయ్యాలనే ఉన్నతాదర్శంతో వున్నా-ఆయన వాంఛ చదువుకున్నవాడు దొరకటంవరకే నెర వేరింది పాపం.

అయినా మూడు ముళ్లూ పడేవరకూకూడా ఆయనకు మనస్సులో భయంగానే వుంది, ఏ నిమిషంలో మారిదాసు ప్రత్యక్ష మౌతాడోనని.

* * *

కట్నాలు, కానుకలకోసం వెంకట్రావు నిలవేసి రొక్కించకపోవటం, అలకపాన్పు మీంచి అందరూ ఏదో అడగమని చెప్తున్నా, నట్టి తాంబూలంతోనే సంతృప్తిపడి లేచిరావ టం వచ్చిన పెళ్లివారందరకూ తలోవిధంగానూ అనిపించింది. చివరిసారిగా అడిగారు యెవరో-

"ఏవీఁ యెరగని వెర్రి పీనుగల్లే నోరుకట్టుకుని అలకపాన్పు మీంచి చేతు లూగించుకుంటూ దిగు తావ్రా ఎవరైనా? తరవాత చదువుకి పెట్టుబడి అడక్కపోతే మానె- ఓ ర్యాలీ సైకిలైనా అడుగొద్దూ?-" అంటూ.

"నా చదువేదో అక్కడితోటే సంపూర్ణ మయింది. అయినా ముష్టి అడుక్కున్నట్టు— వాళ్లు నడిగే దేమిటి?"

నవ్వుతూనే సమాధాన మిచ్చాడు, మాట ల్లోనే ఆదర్శాన్ని స్ఫురింపచేస్తూ.

"ఏదో వేడుకగనక-నువ్వు ... అడుగు తావా, వాళ్లు రోజూ యిస్తారా? ఇది నువ్వు అడగాల్సిన సమయం - వాళ్లివ్వాల్సిన సమయ మూను-"

చేతినున్న బంగారు గొలుసు, రిస్టువాచీ చూసుకుని తన అలకపానుపు జప్తికి తెచ్చు కుంటూ అన్నాడు - ఒక సన్న కళేబరపు మనిషి ఆయాసపడుతూ గావిఖట్టూగ.

"ఏదో ఆశిగి తీసుకో నాయనా - అందరూ అన్నివిధాల చెప్తున్నప్పుడు... మొన్న మా అల్లుడు..." అంటూ స్వీయగాథలు వెల్లడించేం దుకు సిద్ధమయిం దొక వృద్ధ నారీమణి.

తనకు ఏమాత్రం సంబంధంలేని విషయాల్ని కూడా తమ దృక్పథంతోనే కొల్చి యెదుటి వాళ్లను అంటగట్టి లేనిబరువును మొయ్యటం ఎందుకు చేస్తారో అతని కర్థంగాక తికమక లవు తున్నాడు. తను వాంఛించకపోతే వారి కేం!

"ఆ మొహానికి యిలాంటి పిల్ల దొరకటమే అదృష్ట మనుకుంటున్నాడు......ఇంకా ఏమని అడుగుతాడు?"

పదిరోజులనుంచి కల్లుకట్టువేస్తూ ... వచ్చిన పాతికసంబంధాల్ని తిరగ్గొట్టిన కన్నె పిల్ల కొత్తగా వస్తున్న యౌవనాన్ని గర్వంగా చూసుకుంటూ మెల్లిగా అంటోంది.

"ఆఁ...అదీ నిజమే..." బుగ్గలు నొక్కు కుంది- కళ్లు నులుముకుని అప్పుడే కొగ్గామాస్తూ

నిద్దర్లోంచి మేల్కొన్నదానిలాగ- పెళ్లికూతురి వేలువిడిచిన పది తరాలనాటి మేనత్త.

పుట్టి పాతికేళ్ళయినా పలకమీద యింతవరకు 'ఓం' అన్నైనా రాసి యెరగకపోటంవల్ల తన కొడుక్కు ఈ పిల్ల దాటిందని ఆవిడకు బాగా తెలుసు.

నిజానికి వెంకట్రావు వాళ్ళనుకునేంతటి అంద విహీనుడూ కాడు, కళ్లు మిరుమిట్లు గొలిపేంతటి అందం కలవాడూ కాడు. ఏది ఏలాగైనా సామాన్యపు తీరుమాత్రం అతనికి లభ్యమైన మాట వాస్తవం. కాని ఆదర్శం పోయే త్రోవ కంట కావృతమవుతోంది. వెంకట్రావుని ఈ మాటలు ఖిన్నుణ్ణి చేసినయ్. తన ఆదర్శానికి అను గుణంగా ఏమీ అడిగి వారిని బాధించక పోవ టమే తనలో లేని లోపాల్ని ఎత్తిచూపటానికి కారణభూతమయిందా-! ప్రపంచానికి 'బంగ రం ప్లేట్'తో మొట్టికాయలు తినిపిస్తే కాని సరదాగా ఉండదు. ఆదర్శం అపజయం పొందు తుందేమో అని మనస్సు గిజగిజ లాడింది. ఆదర్శం వెనక్కు లాగుతున్నా దాని పీక నొక్కి విధిలేక అన్నాడు—

“వారికెంత యివ్వాలని వేడుకగా వుంటే- వారికి తోచిందేదో యివ్వమనండి-సంతోషంతో స్వీకరిస్తాను- కాని నేనుమాత్రం...”

మళ్ళా సగంలో ఆదర్శవేం జయించింది.

“ఎంతటి మనస్సుగల చక్కటి కుర్రా డమ్మా- నూరేళ్లూ గౌరవంగా వర్ధిల్లునాయనా- అందమంటే యేముందర్రా! సత్యమైన చక్క- చిరునవ్వు కాదూ?-”

అంది, మానవ మనస్తత్వాలను బాగా కాచి వడబోసి జీర్ణించుకున్న వెన్నలాంటి మనస్సుగల ఒకతల్లి.చరికెలకద్ద వెంకట్రావులో ధైర్యంగా కొత్తరక్తం ప్రవహించట మారంభించింది.

* * *

పార్వతి గోముగా మారాంచేస్తోంది- వెంక ట్రావుకు తన తండ్రి యిచ్చిన వెండి చెంబుమీద తన పేరు వేయించుకుంటావని. వెంకట్రావు మంచంమీద అడ్డంగా పడుకుని తమాషాగా ఉడి కిస్తున్నాడు పార్వతిని.

“చెంబు అసలెవరికని యిచ్చారంటావ్-?”

“మీకనే...”

“మరి,నీ పే రెందుకు దానిమీద?”నవ్వుతూ అడిగాడు.

“సరదాగా వేయించుకుంటానండీ-”

“మనిద్దరిలో యెవరిపేరైతేనేం?- ఏదైనా ఇక్కడ వుండేదేగా?”

“ఊహూఁ- నా పేరు వేయించండి! ఏమండీ...”

“ఏం, చెంబు అమ్మకు తిసేస్తానేమోనని భయమా?”

“ఛా! నే నలాగ అన్నానా...చెంబు మీదే- మీ యిష్టం వచ్చినట్లు చేసుకుంటారు-నాకెందుకు?”

బిక్క మొహం వేసి, బుంగమూతి పెట్టి కన్నీటి వానని కురిపించటానికి సిద్ధంగా వుంది. ఆమె వాలకం చూస్తే వెంకట్రావు నవ్వు ఆగటంలేదు. గదితలుపు దగ్గర చప్పుడయితే అటువైపు చూశాడు. ఎవరో బాగా అలంకరించుకున్న స్త్రీ నవ్వుకుంటూ మొహంకేసి చూసి వెళ్ళటం గమనించాడు. వెంకట్రావు భార్యలో అనుకోని సంచలనం కలిగింది.

“మీ దగ్గర ఉండగా ఆవిడ చూస్తే...ఆక్షే పించి ఉడికిస్తుంది బాబూ-” అంటూ బయటికి వెళ్లిపోబోయింది. పమిట చెంగుపట్టుకుని ఆపు చేశాడు.

“ఏం, ఎందుకని ఆక్షేపిస్తుంది?”

“నిన్న పొద్దున్న మీరు మంచంమీద పడు కుంటే నేను గోడ పక్కన తివాసీ వేసుకుని పడుకున్నానా- అప్పుడేం చేసిందో తెల్సా? స్నేహితులందర్నీ తీసుకొచ్చి కిటికీలోంచి చూపిం చిందట...నిన్న సాయంత్రం అందరూ ఉడి కించటమే.”

“ఉడికించటంకేనిదీ...ఏమన్నా రేమిటి?”

“...ఇప్పట్నుంచే విడిచిపెట్టలేక పోతున్నా నట...”

ఏదో చెప్పబోయి కొంచెం ఆగి వింది. లోప లికి వెళ్లి నావిడ పార్వతి ఎక్కడికి వెళ్ళిందని అడుగుతోంది అన్నపూర్ణమ్మగారిని. కలవరంగా “నే వెళ్తాను బాబూ-” అంటూ గది అవతలకు పార్వతి పరుగెత్తింది.

వెంకట్రావు “అసద కింత ఖ్యాతియాసికీ ఎందుకు”అని ఎంతో సేపు ఆలోచనలో గడిపాడు. ఎప్పుడో నిద్రపట్టింది అతనికి తెలియకుండానే.

నిద్రనుండి ఏదో మెలకువ తెప్పించినట్టయింది. మెత్తటి పొడుగాటి నులివెచ్చటి వేళ్లు అతని బుగ్గల్ని రాస్తున్నయ్. కళ్లు తెరిచి చూశాడు.

"నిద్రేనా...?" పార్వతి నవ్వుతూ అడిగింది.

"తేలగొట్టేశావ్ గా-"

"మంచినీళ్లు తెమ్మంటారా?"

"కొద్దిగా తెచ్చిపెట్టు-" ఆమె మౌనంగా వెళ్ళింది.

"మీరు- ఆవిడకేసి చూసి నవ్వేరటగా..." గ్లాసు అందిస్తూ అంది.

"ఎవ రావిడ-?" అర్థంగాక అడిగాడు.

"అంతా తెలవనట్టు! ఏమీ ఎరగని పాపం!"

"ఎవరో చెప్పరాదూ చంపక-"

"నవ్వేరటగా, ఇంకా నన్నడుగుతారేం?"

"మళ్లీ అదేమాటా! ఇంతకూ చెప్పేదివుందా లేదా?" కొంచెం కోపంగానే అడిగాడు పరిస్థితులు అర్థంగాక.

"పైగా చెప్పేవన్నీ దొంగమాటలే - ఏమీ-ఎరగనట్ట పాపం!- నేనేమీ అడ్డురానన్నానుగా- నిజం చెప్తేనేం? మళ్లా ఒట్టుకూడా వేస్తారు!"

ఆమె అనే దంతా వెంకట్రావుకు ఏమీ అర్థంగావటం లేదు. అంతా అయోమయంగా వుంది. ఓ రోజున పార్వతి 'నాకు అప్పు లెవరైనా వుంటే చెప్పండి-' అని నవ్వుతూ అడిగినప్పుడు చేతిలో చెయ్యివేసి - 'ఇంత వరకూ అట్లాంటి గుణం ఎరగను' — అని ప్రమాణం చేసి చెప్పిన మాట నిజమే. ఆమె అతని మాటల్ని విశ్వాస పూర్వకంగా నమ్మింది. మళ్లీ ఈ గాలి దుమారం ఏమిటో, ఎందుకు చెలరేగిందో అనే సందిగ్ధావస్థలో పడ్డాడు. ఆమె అనే ప్రతి మాటా అతన్లో ఉక్రోషాన్ని లేవ దీస్తోంది. పెళ్లయిన కొత్త రోజుల్లోనే హృదయాల్లో అనుమానపుటగ్నుల్ని రగుల్చుకుంటే భవిష్యత్తు ఏవిధంగా పరిణమిస్తుందో అన్న దిగులుతో వూగి పోతున్నాడు.

"ఇంటి కప్పుకేసి చూస్తూ మీన మేషాలు లెక్కిస్తున్నారా, కన్నంలో పట్టుబడిపోయామే అని?"

ఉక్రోషానికి మరో సమిధని చేర్చింది నవ్వుతూనె. అసలు విషయం మాత్రం వ్యక్తం చెయ్యలేదు. వెంకట్రావు ఎవరో కొత్త వ్యక్తిని చూసి నవ్వేడని పార్వతి కేమాత్రం 'జెలసీ' లేదు. ఆమె నవ్వుతూనే వుంది. ఆదర్శాన్ని ఎంత పట్టుదలతో ఆచరణలో పెడ్తున్నా చివరికి నిస్పృహేనా మిగిలేది? కుమిలి పోతున్నాడు.

తాగిన గ్లాసు చేతిలోనే వుంచుకుని ఖంగారు పడుతున్న వెంకట్రావుని చూస్తే ఆమెకి జాలేస్తోంది. దగ్గరగా వచ్చి కాలర్ సవరిస్తూ అడిగింది:

"అల్లా అన్నానని కోప మొచ్చిందా?"

ఆలోచనతో కాలిపోయే అతని మెదడు చల్లబడింది. ఏ విషయానికైనా అభ్యుదయ పంథాలో 'నేను' అని రొమ్ము విరుచుకుని ముందుకు పురోగమించే వెంకట్రావు వ్యభిచారం పేరు వినేసరికి తిరోగమనానికి పురోగమిస్తాడు. వెంకట్రావుకూ వ్యభిచారానికీ మధ్య వెయ్యి యోజనాల వ్యత్యాసం.

"ఇందాక నేను- ఉడికిస్తుందని వెళ్లిపో లేదూ? ఆవిడ గదిలోకి చూసినప్పుడు - మీరు ఆవిడని చూసి నవ్వేర్టగా!"

"ఓహో- "అన్నాడు మౌనాన్ని నిట్టూర్పులో కలిపి వదుల్తూ. "ఎక్కడికి వెళ్లిందని మా అమ్మను అడుగుతుంటే నే వెళ్లిపోయాను మీదగ్గరున్నది. అప్పుడావిడ చాటుగా కేకేసి 'ఏం అయన నన్ను చూసి నవ్వేడేమ్ - ఒదబడతా ననుకున్నాడేమో!'అంది. ఆ క్షణంలో నాకు ఉక్రోషం ఆగలేదనుకుండి. నేను ఏమీ అనుకోను అని చెప్తున్నా అబద్ధ మెందుకు కాదూ లని..."

"నమ్మేనా-?" అనుమానపుటంచుల్ని దూసుకొచ్చినాయా మాటలు. ఆమె మౌనంగా నేలని గీస్తూ నుంచుంది.

"పచ్చకామెర్లున్న వాళ్ళకు - ప్రపంచమంతా పచ్చగానే కనపిస్తుంది." తనే అన్నాడు మళ్లా:

"వెండి చెంబుమీద నీ పేరు చెక్కించుకుంటానని మారాం చేస్తున్నప్పుడు కదా- అమ్మ తలుపు గెంటింది? అంతకు ముందునుంచీ నీ పేరే చూసి నవ్వుతున్నానా?"

"........."

"ఆవిణ్ణి చూసి నవ్వవల్సిన అవసర మేమిటి నాకు—మాట్లాడవేం? తలుపు చప్పుడయితే

అటు చూశాను. అంతకు పూర్వమే మొహం మీదున్న నవ్వు ఎక్కడికి పోతుంది? అది చూసి తనను చూసి నవ్వే ననుకుందా!"

'పోనీ నవ్వేననే అనుకుందాం- నవ్వితే మాత్రం తనెలా అర్థం చేసుకోవాలీ ఇంత దూరం? మీరన్నట్టు రంగద్దాల కళ్లజోడు మహాత్మ్యం— నేను నమ్మలేదు సుమండీ- తనకున్న గుణాలే యెదరవాళ్లకూడా ఉన్నాయనుకోటం పొరపాటు కాదూ?"

"ఆమాటల్నే నువ్వు నిజమని నమ్మి నాతో అవ్యక్త విరోధాన్ని పెంచుకుంటే పశుపు- పారాయణుల లేతచాయలు ఆరకుండానే నవ్య సంసారంలో ఎంతటి అసంతృప్తి, ప్రతీకార వాంఛ గాలిదుమారాల్లాగ చెలరేగేవి? నిండు సంసారాల్ని నిలువునా కూలదోసే వ్యక్తులు."

గాఢంగా నిట్టూర్చి ముగించాడు. అతడి సర్వస్సృష్టి ప్రళయకాలం తర్వాత ప్రపంచం పొందే శాంతిని పొందింది. సవ్యంగా పోయే బాటసారికి మార్గంలో ఎన్ని ముళ్ళకంపలు! అయినా ప్రయాణం సాగిపోవలసిందే.



సాహిత్యలోకం

# గద్యరచనలు కావాలి

యన్. యస్. ఆర్.

వివిధ వర్గాలవారు సాహిత్యంమీద అభిప్రాయాలు వెలిబుచ్చుతూ వచ్చేరు. కాని సామాన్యవర్గమునకు చెందినవారెవరు అందులో కనబడలేదు. కాని గేయాలను ఘాటుగా విమర్శించిన వారు నా వర్గానికి చెంది ఉంటారని నా అనుమానము. సాహిత్యమును విమర్శించగల సామర్థ్యము లేకపోయినా రచయితలవద్దనుండి నా తరగతి ఎటువంటి రచనలు కోరుతుందో తెలియజేయడం దీని ఉద్దేశ్యము.

అసలు భాష- వ్యక్తులు తమ తమ ఉద్దేశాలను వెలిబుచ్చుకొను ప్రయత్నములో ఉద్భవించిందంటారు. కాని భావాలను చప్పగా తెలియబర్చుకోవడము కాకుండా అది ఒక కళగా పరిణామం చెందింది. సాహిత్యానికి స్పష్టత ప్రధాన సుగుణమని నమ్ముతాను. ఆ దృష్టిలో నేటి సాహిత్య వీథినంతా ఆక్రమించే ఈ గేయ భావ వివిధ కవిత్వములలో ఆ సుగుణం ఉన్నట్టు కన్పడదు (కొన్నింటిలో తప్పించి). విమర్శకులు చాలమంది ఛందస్సు, అస్పష్ట భావలయాందలి పదములను ఉపయోగించడం, భావాలగురించి విమర్శించేరు. ప్రాస్తే పాత పద్ధతులలోనే ప్రాయాలికాని నూతన ఛందస్సుల సృష్టించరాదు అనే అభిప్రాయాన్ని సమర్థించుట కష్టం. సమర్థులు క్రొత్త పద్ధతులలో రచించడంలో ఆక్షేపణ ఉండదు, కాని పనికట్టుకొని క్రొత్త పేరున సృష్టించడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకోవడం హాస్యాస్పదంగా వుంటుంది. కవులకు ఆంధ్రదేశంలో కరువులేదు, ఇక చిత్తంవచ్చినట్టు తలోకరు వివిధ రకాలు వ్రాసిన చదువరులు విసుగు వెలిబుచ్చడంలో ఆశ్చర్యం లేదు. తేలికగా తేల్చాలంటే ద్విపద, తేట గీతులు చాలునేమో. నాలుగు గణాల్ని ఒకటిగాను రెండుగాను త్రుంపుదామని ప్రయత్నం కన్పడినట్టు పొడిగించుదామని లేదు. క్రొత్త వరసలకు ఒక నామధేయం కల్పిస్తే నెలకు ఎన్నివందలు వస్తున్నాయో గుర్తుంటుంది. ఇప్పుడు వచ్చే అభ్యుదయ భావకవిత్వాలలో భావం మెండు. రచన అయాక ఏదో ఒకభావం ఉండకమానదు. ప్రత్యేకంగా భావస్ఫూర్తిలేక భావాలకోసం వెదికే వారు ఎంతమంది ఉంటారు! మాయ భావాలు మనిషి అయినతరువాత లోటా! రచన అద్దంలా రచయిత భావాలు స్పష్టంగా కన్పరచాలి. రచయిత, సూర్యకాంతిని కటకము విరదీసి వివిధవర్ణాలలో చూపినట్లు, సామాన్యులకు

గోచరించని మనోవర్తనను, వ్యక్తిభావాలను విడదీసి వ్యక్తంచేయాలి. కాలవాహినిలో చెదరిన సంఘటనల సమీకరించి శోధ చేయాల్చి. అలా కాకుండా ఒక విచిత్రము. ఈ మధ్య ఎద్వర్టయిజ్మెంట్లు ఏరీతిగా ఉంటున్నాయో గమనించే ఉంటారు. బొమ్మ చూస్తే షేక్స్పియరు, విటంబొంబు, అంత్యం సిగరెట్లు. అలా పైకి కన్పడినట్లుగాక నిగూఢంగా వేరే అర్థంలో వ్రాయడం ఒకరీతి. ఆఖరికి ఒక పొడుపుకథలా ఉండడం. భాష సజీవంగా ఉండాలంటే ఇతర భాషల పదాలను జీర్ణం చేసికోవలసిందే. కాని దానికి ఒకమితి ఉంది. పైగా సరియైన రచనలలో పొల్లుపదాలు కన్పడవంటారు. అయితే ఇంగ్లీషు పదాలను పద్యాలలో జొప్పించి, విశృంఖల విహారము చేయించడ మెందుకు? అన్యభాషా పదాలను వాడితే, మరీ అవసరం, లేదా తర్జుమా చేస్తే వికృతంగా తయారవుతుందంటే వాడాలి. ఒకరు ఇంగ్లీషు, ఇంకొకరు ఫ్రెంచి, జర్మను, హిందీ, బెంగాలీలు గుప్పించడము వస్తే దానికి మితి వుండదు. ఆఖరికి ఎగ్జిబిషనులో నిర్జీవప్రతిమకు చీరచుట్టబెట్టి వికృతాభరణాలుతొడిగినట్లుతయారవుతుంది. అభ్యుదయం పేరిట మర్మగర్భితమై, నిగూఢమైన భావాలు చూస్తే నోబుల్ 'లాటరీ' కోసం వ్యర్థశ్రమలా తట్టుతోంది.

నేటి సాహిత్యం చూస్తే ఒక పద్యరచనలే సాహిత్యం అన్నట్టుంది. గద్యనాటక రచనలు తెలుగులో అంత విరివిగా లేవు. కొంతకాలం క్రిందట రవీంద్రుని పేరు చెప్పుకొని వంగసాహిత్యం చలామణి ఐంది. స్వతంత్రంగా రచించలేకపోవడము సరికదా చెత్తరచనలు వ్యాప్తికి లేవడానికి సందేహించకపోవడము ఒక విశిష్టత. ఉన్న నవలలైనా ఆదర్శాలకోసం వాస్తవికతను, మనస్తత్వమును చంపేశారు రచయితలు. వాస్తవికత, మనస్తత్వము అనేవి మన నవలలలో మచ్చుకైనా కన్పడవు. ఇక విజ్ఞానంతో కూడిన గ్రంథాలు అసలే శూన్యం. మావాడు మూడో ఫారం చదువుతూ కవిత్వం వ్రాస్తానని ఎగబాటు. అంతకంటె చక్కని శైలిలో ఒక వ్యాసం రాసి చూపెట్టరాదా అన్నాను. అంటే నాకు కవిని అవాలని వుంది అని సమాధానం చెప్పేడు. సీరియస్‌గా ఆలోచిస్తే వాడు కవిత్వం తప్పించి ఏమి వ్రాయగలడని నా అనుమానం. ఇదివరకు కందంకట్టిన వాడిని కవి అన్నారు. ఇప్పుడు ఆ శ్రమ కూడా అక్కరలేదు. భావం ఉంటే చాలు. సాహిత్యంలో అభిరుచి అంటే కవిత్వం చెప్పడంలోకి వచ్చింది. బహుశః కవిత్వమునకు మనోవికాసము, క్రమశిక్షణ అనేవి తప్పనిసరి కాదు. పైగా రెండు పంక్తులు వ్రాయగలిగితే విశ్వవిద్యాలయాలకే చదువు చెప్పబూనుకొంటారు. విశ్వవిద్యాలయం యిచ్చే క్రమశిక్షణ (సరియైనది అందుబాటులో లేకపోవచ్చు) నిరర్థకమని చెప్పగల సాహసం కవికి ఉన్నట్టు ఏ శాస్త్రజ్ఞుడికీ ఉండి ఉండదు. ఇది యిప్పటి తెలుగు వాఙ్మయము.

నా వర్గానికి కావలసింది ఏమిటి? పద్యాలలో ఈ ఖండ గేయాలు, వచన రచనలలో పురాతన గ్రంథాలు దులిపితే వచ్చే అయోమయం కాకుండా వాస్తవికత, విజ్ఞానంతో కూడిన గద్య రచనలు కావాలి. నూటికి తొంభై పాళ్ళు విద్యావంతులు గల ఇంగ్లండులోనే చాలమందికి సాహిత్యం అంటే విశేషం శ్రద్ధ లేదని ఆర్నాల్డు బెన్నెట్ వ్రాసినట్లు జ్ఞాపకం. అయితే నూటికి పదిమందికే చదువున్న మన దేశంలో ఎంతమందికి సాహిత్యంలో అభిరుచి ఉంటుంది? అందులో ఎంతమందికి ఈ పద్యాల మీద? ఒకవేళ అభిరుచి కల్గినా, ఒక మాదిరి విద్యావంతులకు టీకా తాత్పర్యాలు వ్రాసినా ఆ భావాలు గోచరించకపోతే ఆ కవన మెవరి నుద్దేశించి? తెలుగులో కవులు రాబోయే రెండు మూడు తరాలకు సరిపోయే రచనలు చేసేశారు. కాని యిప్పుడు వచ్చేవి అంటే అవి ఈ ప్రజానీకాన్ని ఉద్దేశించి కాదు. రచయిత సుఖంగా జీవితం గడపాలి అంటే ప్రజాదరణ ఉండాలి. ప్రజా రచయితలు, అభ్యుదయ రచయితలు కొంతకాలం గద్య రచనలమీద దృష్టి కేంద్రీకరించాలి. గ్రంథ స్వీకారాలు చూస్తే వేదాంతం, గీతికలు, బుర్రకథలు తప్పించి తదితరము కనపడవు. మనస్సుకి జ్ఞాన సేకరణ, జ్ఞాపకము, ఊహ, యుక్తాయుక్త విచ

క్షణ, నిర్ణయించుట యిత్యాది లక్షణా లున్నాయి. అవి వ్యక్తికేగాక సంఘానికి సాహిత్యమునకుకూడా చెల్లును. మానవుడు అనాగరిక స్థితినుంచి నాగరికుడైనా బాల్యంనుంచి విశేషంగా కుతూహలం కల్గివుంటాడు. తన గురించి, ప్రకృతిగురించి తెలిసికొందామని జ్ఞాన తృష్ణ కల్గివుంటాడు. ఆకలి కడుపులను కోయిల కూతలు, రవీంద్ర గీతికలు నింపకపోతే జ్ఞాన తృష్ణను ఈ గేయాలు, రచనలు తీరుస్తాయా? స్వతంత్రంగా రచించే ప్రతిభ లేకపోతే చిత్తు రచనలు వెలిగించే శ్రద్ధ ఇంగ్లీషు గ్రంథాలు అనువదించడంలో చూపెట్టి ప్రజలకు ప్రసాదించవలసిన బాధ్యత రచయితలమీద వుంది. కావలసింది అనుకరణ కాదు. మూలం మార్చకుండా అనువదించాలి. స్వతంత్ర రచనకువలెనే అనువాదానికికూడ, అందులో మన సత్వముగల నవల ననువదించడానికి విశేష సామర్థ్యము కావాలి. ఇక శాస్త్ర గ్రంథాలమాట చెప్ప నవసరము లేదు. ఊహా ప్రధానముగాగల రచనలు పూర్తిగా కట్టిపెట్టమని కాదు. చంద్రుని స్థానము బలముగా ఉండవలసినదేగాని చంద్రకళ మితిమీరి వ్యక్తికైనా, సాహిత్యానికైనా ఆరోగ్యవంతము కాదు. ఈ యుగం విజ్ఞాన యుగం. విజ్ఞాన శాస్త్ర ప్రమేయం అట్టే అవసరంలేని కథ, కల్పనలలోకూడ విజ్ఞానాన్ని ప్రవేశపెట్టుతున్నారు. రాజకీయాలు, ఆర్థికసమస్యలు, మానసిక శాస్త్రము ప్రవేశపెట్టి రచనలు సాగిస్తూంటే ఒక్క విజ్ఞానము మీదేనా అభ్యుదయ రచయితల "శీతకన్ను"? కాశీ పట్నపు కొండయ్యగారు ఈ లోటును తీర్చ సంకల్పించి కృషి చేశారు. తగినంత ప్రోత్సాహము అందినట్లు కన్పడదు. ఆఖరికి ఒక మాసపత్రికైనా విజ్ఞానంతో కూడినది వెలువడితేనేగాని ఈలోటు పూర్తికాదు. అంతే కాకుండా పబ్లిషర్సుకూడా కన్పడరు. ఒకవేళ అప్పుడప్పుడు చక్కటి గ్రంథాలు వెలువడినా అవి మారు మూలలనుంచి వెలువడడమే గాని అన్నిదారికే కేంద్రసంస్థ కనపడదు.

ఇంతకీ ప్రజాసాహిత్యం, అభ్యుదయ సాహి

వారు. ప్రజలకు కావలసిన సాహిత్యాన్ని సృష్టించడమే గాక వారియందు సరియైన అభిరుచి వారి రచనలద్వారా పెంపొందింప జేయాలి. ఊహా, కల్పన ప్రధానంగాగల రచనలందు ఆదర్శాలకోసం వాస్తవికతను, మన సత్వాన్ని చంపక వాటికి ప్రాముఖ్యం యివ్వాలి. స్వతంత్ర రచనలు రచించడం, ఇంగ్లీషువాటి ననువదించడం వారి కర్తవ్యం. కుటుంబరావుగారు చెప్పినట్లు సంఘంలో మరాచారాలకు కారణాలు ఎవరైనా చేస్తేవాస్తే అది అభ్యుదయకరము, ప్రజా సాహిత్యము అయితీరుతుంది. ఆ ఉత్సాహంలో అతిశయించి చలంగారిలా మితిమీరి ప్రవర్తించి ఆదర్శాలకోసం వాస్తవికతను చంపిన రచన రాణించదు. మన దురదృష్టవశాత్తూ సంఘానికీ, సారస్వతానికీ రాజకీయాలే సర్వస్వము అయిపోయాయి. జ్ఞానం మన గమ్యం. రాజకీయాలు ఒక అంగం. అలాగే ఊహా కూడాను. శాస్త్రీయ విజ్ఞానం సర్వవిధాలా వెదజల్లడం, మనస్సుకి క్రమశిక్షణ కలిగించడం ధర్మం. ఒకర్ని ఒకరు అర్థం చేసికోడానికే వాఙ్మయం ఏర్పడింది అని అంగీకరిస్తే వాస్తవికత, విజ్ఞానం లేని సాహిత్యం సర్వాంగ సుందరం కానేరదు. ఈ రెండూ కల్గిన సాహిత్యం వర్గాలు పఠించిన అభ్యుదయమేగాక ప్రజాసాహిత్యం కూడా అవును. రచయిత తన ఆవేశాన్ని కాగితము మీదపెట్టడమే ఆదర్శంగాగాక సంఘసేవ దృష్టిలో సాహిత్యానికి సేవ చేసినవాడవును.




# అప్పగింత

ఈరంకి వెంకటరావు

## 4

రామదాసు యివతలకి రాగానే గేటు తలుపులు నెమ్మదిగా, కిర్రుశబ్దంతో మూసుకున్నాయి. దాసు నలుప్రక్కలా శూన్యంలోకి చూసి తల వంచుకొని ఆలోచిస్తూ, కాళ్లు ఎక్కడికి తీసుకెళతాయో తెలియకుండా వెళుతున్నాడు. సరోజ ఏడుపు, గేటు తలుపులు చేసిన ధ్వని యింకా అతని చెవుల్లో మారుమ్రోగుతున్నాయి. సరోజ తనని గుర్తుపట్టలేదనీ, తనంటే ప్రేమ లేదనీ, తను ఆయిల్లు వదిలి వెళ్ళిపోతుంటే గేటు తలుపులు చాలా వింతగా శబ్దం చేశాయనీ దాసు తలపోశాడు.

ఇంతవరకూ అతనిలో విచారం తప్ప యింకేమీ లేదు. ఇప్పుడిప్పుడే అతను కార్యసాధన గురించి ఆలోచిస్తున్నాడు. ఒకవైపు తన ఒంటరితనం, నిస్సహాయత, మరొకవైపు కార్యభారం, అతనికి గోచరించాయి. భయసంభ్రమాశ్చర్యాలు ఒక్కసారిగా కలిగాయి అతనికి.

అతను నెరవేర్చవలసిన కార్యమిది: ఒక జీవి బాధ్యత అతనిమీద వున్నది; ప్రపంచంతో పోరాడి ఆ హక్కు సంపాదించాలి. ఒక స్త్రీ హృదయాన్ని పరిశీలించి ఆమె సౌఖ్యంకోసం పాటుపడాలి. ఆ కార్యం నెరవేర్చడానికి ఆమె వెళ్లినచోటికల్లా తను వెళ్లాలి. ఆమెను యితరుల నుంచి కాపాడటానికి, ఆమెను ఆమెనుంచే కాపాడటానికి ఆమెకు వీలయినంత దగ్గరలో తను వుండాలి.

కాబట్టి కనీసం ఆమె స్థితిగతులలో కన్నా, వీలయితే ఆమెకంటే ఎక్కువ తాహతును తను సంపాదించాలి. ఆమె నివసించే యింట్లోనే తనూ నివసించాలి; కనీసం అతిథిగానైనా ఆమె నివసించే యింట్లో తను స్థానం సంపాదించుకోవాలి. తనూ అందరిలాగే ఒక వ్యక్తిలా తల ఎత్తుకు తిరగగలిగితే, ఆమెకోసం ప్రపంచమంతటితోను పోరాడటానికి జంకడు.

దాసు తన ప్రస్తుత స్థితి చూసుకున్నాడు. తను దీనవాడు, అండవిహీనుడు. పిరికివాడు, అసహ్యమైనవాడు. అతనిప్పుడు బికారిగా వీధుల్లో తిరుగుతున్నాడు; స్నేహితులు గాని, బంధువులు గాని ఎవరూ లేరు. రాత్రికి ఎక్కడ పడుకోవాలో కూడా యింకా నిర్ణయం కాలేదు. వెంకటేశ్వర్లు పరిచారకు... యించుమించుగా పని

గానే అంచనా కట్టారు- ముష్టివాడని. రాత్రికి కడుపుకాలితే చివరకు ముష్టే ఎత్తవలసి వస్తుంది. తనని తాను ముష్టి ఎత్తుకుని తిరుగుతున్నట్టుగా వూహించుకున్నాడు. అతని పరిస్థితి అతనికే ఎంతో దీనంగా, హీనంగా కనిపించి అసహ్యం వేసింది.

ఈ దుఃఖబాధితుడు, యీ ముష్టివాడు హాయిగా సౌఖ్యాలతో తులతూగి, సిల్కు బట్టలు, బంగారు ఆభరణాలు ధరించే భాగ్యవంతుల పిల్లకు రక్షకుడు. తను కలగంటున్నాడేమో ననిపించింది; లేక మతిభ్రమణమైనా కలిగి వుండాలి. రాజేశ్వరమ్మలాంటి ఆవిడ తన పిల్లను అతనివంటి నిర్భాగ్యుడికా అప్పజెప్పడం! ఏ పరిస్థితుల్లోనూ అతనీ కార్యాన్ని నెరవేర్చలేడేమో.

ఇలాగ అనుకుంటూనే అతను రాజేశ్వరమ్మ కిచ్చిన వాగ్దానం ఎలా నిలబెట్టడమా అని ఆలోచిస్తున్నాడు. అతని ఆలోచనలు మరో మార్గం తొక్కాయి. తన ఆశయసిద్ధికి అవకాశాలకంటె ప్రేమ, ఆరాధన ముఖ్యతరంగా కనిపించాయి. ఆ భవనం వదిలిపెట్టి వచ్చినందుకు విచారించాడు. ఇప్పుడు మళ్ళీ అందులో ఎలా ప్రవేశించాలో అతనికి అర్థం కావటంలేదు. ఆ గేటు తలుపులు చేసిన శబ్దం తలపు వచ్చి అతను సిగ్గుపడ్డాడు.

అతను వేలకొద్దీ ఆలోచనలు చిన్నపిల్లలా కాముకులా చేసినట్టుగా చేశాడు. తన సంకల్ప సిద్ధికై మార్గాలు వెతికాడు. కాని అవి ఆచరణలో పెట్టడానికి ఉపయోగించవు. ఒక్కొక్క కొత్త ఆలోచన అతని మెదడులో మెదిలి, ఒక్కొక్క పాత ఆలోచనను పారద్రోలేది.

తరచుగా అతనికి బాధ కలిగించిన ఆలోచనేమంటే తనువచ్చేటప్పుడు సరోజను ఎందుకు ఎత్తుకొని రాలేదని. సరోజ గడ్డిమీద ఆడుకోవటం అతనికళ్ళకు కట్టినట్టుగా వుంది. అంత మంచి అవకాశాన్ని అతను జారవిడిచాడు. అతని లేత మెదడులో సరోజను దొంగిలించిన తర్వాత జరిగివుండే శృంగార ఘట్టంకూడా దొర్లింది. సరోజను తన హృదయానికి హత్తుకొని, ఆ భవనంలోంచి తను పారిపోయి రావటం, ఇదివరకు చదువుకున్న పురాణగాథల్లో శ్రీ కృష్ణుడు రుక్మిణి నెత్తుకురావటం జ్ఞప్తికి తెచ్చింది.

అతనిముఖం ఎర్రబారింది. అతని త్యాగం ఎంత స్వల్పంగా, ఎంత హాయిగా వుంది! సరోజ, తను ఒకయింట్లో నివసిస్తున్నట్టుగా ఊహించుకున్నాడు. తను కష్టపడి ఆమెను పోషించటం, ఆమె పూర్తిగా అతనిపైనే ఆధారపడి వుండటం. ఆ బీదతనంలో, ఆ నిస్సహాయతలో ఆమెను ఎంతో శీలవతిగాను, సుగుణవతిగాను తను పెంచగల ననుకొన్నాడు. తన మాతృదేవత సంతోషిస్తున్నట్టూ, తనను ఆశీర్వదిస్తున్నట్టూ ఊహించాడు.

అకస్మాత్తుగా దాసు కొక అభిప్రాయం తట్టింది. తను ఆలోచిస్తున్నది ఎంత అసభ్యంగానో, అసందర్భంగానో వుంది. తనవంటి కుర్రవాడు ఒక ఆడపిల్లతో వుండటం లోకం ఒప్పుకుంటుందా?

దారిన పోయేవాళ్ళు దాసు అమాయకపు బుర్రలో కలిగే ఆలోచన స్వరూపం తెలుసుకొని వుంటే తప్పకుండా నవ్వేవారు. బడిలో చదువుకునేటప్పుడుండే ధర్మోత్సాహం మళ్ళీ దాసు నావహించింది. ఏమిటి-అతను ఎల్లప్పుడూ వెలివేసినవాడిలాగ జీవితం గడపవలసిందేనా? జీవితరంగంలో ప్రవేశించే ఆ ఏకాకిమీద యింకా గురుతరబాధ్యత పడి అతన్ని కుదించేస్తోంది.

పరస్పర విరుద్ధమైన ఊహాలతో అతని మెదడంతా పచ్చిపుండయి ఆలోచనాశక్తి శూన్యమైంది. అతను అతి కష్టంమీద ఒక నిర్ణయానికి వచ్చాడు-తన హృదయానికి ఏది యిష్టమైతే, ఏది న్యాయమని తోస్తే అది చెయ్యటం. అలా చేసినప్పుడు సాధారణంగా అన్నీ మంచివే అవుతాయి; అన్నీ భగవన్నిర్ణయానికే వదిలి పెట్టవచ్చు.

ఈ నిర్ణయానికి వచ్చాక అతను మళ్ళీ మామూలు మనిషి అవగలిగాడు. తన చుట్టుపక్కల జరిగే సంఘటనల్లో ప్రీతి, ఉత్సాహం కలిగాయి. సాయంకాలపు చల్లగాలి కొంత సుఖాన్ని యిచ్చింది. మానవజీవితంమీద కొంత అసహ్యం తగ్గింది.

ఏదో యథాలాపంగా అతను పార్కులోకి వెళ్ళాడు. అతను చాలా అలసటగా వున్నందు వల్ల ఆ పార్కులో ఖాళీగావున్న బల్లకోసం వెతికాడు.

నరమామిడి చెట్టుకింద పిల్లలు కేరింతాలు కొడుతూ, పరుగెడుతూ ఆడుకుంటున్నారు. కొంతమంది నర్సులు తెల్లటి దుస్తులు వేసుకొని మాట్లాడుకుంటున్నారు. మరికొంతమంది వాళ్ళ ప్రక్కనే నిలుచున్న మగవాళ్ళు చెప్పే రహస్యాలు వింటున్నారు. కొంతమంది తాపీగా ఏ చీకూ చింతా లేకుండా మెల్లిగా నడుస్తూ మాట్లాడుకుంటున్నారు. అక్కడక్కడ వున్న పాలరాతి విగ్రహాలు చెట్ల సందుల్లోంచి కనపడుతున్నాయి.

రామదాసుకి ఖాళీగావున్న బెంచీ ఎక్కడా కనబడలేదు. దానికి దూరంగా, ఒక మూల బెంచీ కనిపించింది. దాసు వెళ్ళి నిట్టూరుస్తూ ఆ బెంచీ మీద ఒక మూల కూర్చున్నాడు. ఆ బెంచీకి మరొకవైపు ఒక యువకుడు కూర్చొని గ్రంథ పఠనం చేస్తున్నాడు. అతను తలెత్తి దాసుని చూసి ఒక చిరునవ్వు విసిరాడు. దాసు కూడా నవ్వాడు.

చీకటి పడుతూండగా ఆ యువకుడు పుస్తకం మూసేసి తనచుట్టూ ఒకసారి చూశాడు. దాసు ఏదో ధ్యానంలో నిమగ్నమైనట్టు వున్నాడు.

దాసు పక్కని కూర్చున్నతడు చాలా అందమైన మనిషి; గంభీరమైన ముఖం అతనిది. అతని కళ్ళు చాలా విశాలమైనవి, వాడియైనవి. అతని ముఖంలో ప్రతిభాగంలోను, అతని విశాలమైన నుదుటిలోను అతని విశాలభావాలు, ఔన్నత్యం పొడగట్టుతున్నాయి. అతనికి ముప్పైమించు యిరవై సంవత్సరాల వయస్సు వుంటుంది. అతని నిరాడంబరమైన దుస్తులూ, ఆలోచనా యుతమైన దృక్కులు, గంభీరమైన ముఖం అతను కష్టపడి చదివే విద్యార్థి అనే అభిప్రాయాన్ని కలిగిస్తాయి.

కొంతసేపయినాక అతను తన తీక్ష్ణమైన, ఆలోచనాయుతమైన దృష్టిని రామదాసు వేపు మరల్చాడు. అతనిలో తనని చూశాక ఏ ఏ భావాలు కలుగుతాయో అన్నట్లుగా దాసు ఆతురతగా చూశాడు. దాసుకి అతనిలో దయ, శాంతము, స్నేహభావము తప్ప ఇంకేమీ కనబడలేదు. అతనికి కొంచెం ధైర్యం వచ్చింది.

దాసు అతనికి కొద్దిగా దగ్గరగా జరిగి ఆ పార్కు చాలా గొప్పదనీ, అలసిపోయి శోష గొన్న హృదయాలకి ఆపార్కు జవసత్వాల నిస్తుందనీ మెల్లిగా అన్నాడు.

అటువంటి సంభాషణలే ఒక్కొక్కప్పుడు గాఢతరమైన మైత్రికి దారితీసి ఎంత సమావేశాల్నికూడా సఫలీకృతం చేస్తుంటాయి. కొత్తగా పరిచితులైన వాళ్ళతోకూడా, వాళ్ళ ముఖ విశేషంవల్లనో, ఆవేళ విశేషంవల్లనో చాలా గాఢంగా వాళ్ళను నమ్మి మన కష్టాలన్నీ ఒక్కసారి వెలిబుచ్చేస్తాము. అలాగ ఏమీ సంబంధం లేని వాళ్ళతో మనసారా విళ్ళువిచ్చుకొన్నా, ఒక్కొక్కప్పుడు మనస్సు తేలికపడి, ఎంతో ఆనందం కలిగి, మన ఆత్మీయులతో చెప్పుకొన్నట్టుగా వుంటుంది. కొత్తవాళ్ళకి మన సంగతులన్నీ చెబుతున్నామనే తలంపుకూడా వుండదు.

కొద్ది నిమిషాల్లో ఆ ఇద్దరు యువకులూ దగ్గరగా జరిగి అన్నదమ్ముల్లాగ మాట్లాడుకుంటూ హాయిగా ఆనందిస్తున్నారు. ఒకరి పరిస్థితి యింకొకరి పరిస్థితితో పోలినా పోలకపోయినా, సానుభూతిమాత్రం కలుగుతుంది. దాసు స్నేహితుడు నిజానికి దాసు అవగ్రత. చెదరు చూపులు, అమాయకమైన ముఖం చూసి ఆకర్షింపబడ్డాడు. బలశాలి, అందమైనవాడూ ఆదవి హీనుణ్ణి, అమాయకుణ్ణి చూసి జాలిపడటం, శ్రద్ధ చూపించటం ఆశ్చర్యం కాదు.

కొంతసేపు యిద్దరూ మాట్లాడుకొన్న తరువాత జీవితంలో తాము అన్నదమ్ముల్లాగ భావించుకొన్నారు. ఇద్దరికీ తలిదండ్రులు లేరు; ఇద్దరూ శాస్త్ర పరిశీలనద్వారా సత్యాన్వేషణకు పూనుకొన్నవారే; ఇద్దరూ స్వశక్తిమీద జీవించ వలసినవారే; ఇద్దరి అభిప్రాయాలు, రుచులు ఒక్కటే.

రామదాసు మాటల సందర్భంలో తన చరిత్ర నంతా చెప్పాడు. కాని తన జీవితంలో ముఖ్యంగా దేనికోసం పాటుపడ దలచు

కొన్నాడో ఆ విషయం చెప్పకుండా జాగ్రత్త పడ్డాడు. అతని ఆరాధన, ప్రేమా హృదయంలో గాఢంగా, ఎంతో నిగూఢంగా వున్న విషయాలు గాబట్టి వాటిని అణచటానికి ఎక్కువ ప్రయాస అవసరం లేకపోయింది.

తన మిత్రుడు చేతిలో దమ్మిడీయైనా లేకుండా దరిద్రంతో మద్రాసు చేరుకున్నాడు. ఆ పట్టణంలో తన స్వశక్తితో, స్వప్రయోజనంవల్ల ఆరోజుల్లో గొప్పవాళ్ళలో తనూ ఒకడు కావాలని నిశ్చయించుకున్నాడు. ఆవకాశంకోసం ఎదురుచూస్తూ పొట్ట పోషించుకునే మార్గంకూడా వెతుకుతున్నాడు. గుమాస్తా వుద్యోగం చేసి కొంత డబ్బుకూడా వెనకవేసుకున్నాడు. సాయంకాలం, ఒక్కొక్కప్పుడు రాత్రి తెల్లవార్లూ శాస్త్ర గ్రంథాలు చదువుతూ వుండేవాడు.

ఇద్దరు యువకులూ అలా కబుర్లతో కాలక్షేపం చేస్తూంటే ఆ మాలతీ పొదక్రింద అంతా చీకటి కమ్ముకొంది. నర్సమ్మల కలగుడ్డలూ, తెల్లని దుమ్ములూ దూరానికి తెల్లని మచ్చలలాగ కనిపిస్తున్నాయి. మందమైన నవ్వులూ, గుసగుసలూ గాలిలో తేలిపోయి చాలా దూరానికి వినిపిస్తున్నాయి. ఆ వనంలో సాంధ్యరాగపు శోభ ఎంతో అందంగా వుంది.

రామదాసూ అతని స్నేహితుడూ లేచి పార్కు దక్షిణపు గేటువైపు నడిచారు మాట్లాడుకుంటూ. ఆ గేటుకి తిన్నగా వున్న రోడ్డు బజారుకు తిన్నగా పోతుంది.

కొంతదూరం నడిచాక యిద్దరూ కాలిబాట మీద ఆగి మాట్లాడుకుంటున్నారు. మాటమధ్యలో చటుక్కున ఆగి అతను దాసు నడిగాడు— "ఇప్పుడు నువ్వెక్కడికి వెళుతున్నావ్" అని.

"నాకు తెలియదు" అన్నాడు దాసు నిస్సంకోచంగా.

"ఏమిటీ, నీకు యిల్లూ వాకిలీ లేదూ? నువ్వీ రాత్రి ఎక్కడ నిద్రించాలో కూడా నిశ్చయించుకోలేదా?"

"లేదు."

"అయితే భోజనమైనా చేశావా?"

"అదీ లేదు."

ఇద్దరూ నవ్వుకున్నారు. దాసు మనస్సు తేలికపడింది. అతను దాసుతో అన్నాడు: "నాతో రా", అని. ఇద్దరూ హోటలుకి వెళ్ళి భోజనం చేశారు. దాసు గత మూడు రోజులకీ ఆవేళే సంతృప్తిగా భోజనం చేశాడు. తరువాత అతని స్నేహితుడి గదికి యిద్దరూ వెళ్ళారు. ఆ భవనం చాలా పెద్దది. అందులో విశాలమైన గదులూ, విశాలమైన మెట్లూ వున్నాయి. పూర్వం ఆ భవనం మతసమావేశాలకీ, భగవద్భక్తులకూ వినియోగించేవారు. ఆ భవనం వెనకాల పెరట్లో మంచి ఫలపుష్పవనం, పెద్ద పెద్ద చెట్లూ వున్నాయి.

రాత్రి పన్నెండు గంటలదాకా యిద్దరూ ఆ వనంలో సిమెంటు అరుగుమీద కూర్చొని మాట్లాడుకుంటూనే వున్నారు. రామదాసు అలసటతో అలాగే ఆ అరుగుమీద నడుం వాల్చాడు.

"చూడూ- యింతవరకూ నీ పేరు అడగటం మానేశాను, నువ్వేమనుకుంటావోనని. నీ పేరేమిటి?" అన్నా డతను.

"నా పేరు రామదాసు. నీ పేరేమిటి?"

"నా పేరు నరసింహం" అన్నాడు అతను, గోడనున్న బెడ్ లైట్ ఆర్పటానికి మెట్లెక్కుతూ.

# 5

ఉదయాన్నే నరసింహం రామదాసును ఒక నిఘంటు కార్యాలయంలోకి తీసుకెళ్ళి అక్కడ గ్రంథకర్త-సంపాదకునితో పరిచయం చేసి ఆ కార్యాలయంలో తనతోబాటు గుమాస్తాగా వేయించాడు. ఆ కార్యాలయంలో ముప్పై మంది వరకూ నిఘంటు తయారుచేసే సహాయ సంపాదకు లున్నారు. కాని వారి నందరినీ గుమాస్తాలనే అంటారు. వాళ్ళ గొడ్డుచాకిరీ చెయ్యాలి అక్కడ. రోజుకు పది గంటలు పని చేస్తే వాళ్ళ పనినిబట్టి నెలకు 80 రూ. మొదలు 100 రూ. వరకూ ముడుతుంది. వాళ్ళసంపాదకుడు మాత్రం చేతులు కట్టుకుని పచార్లు చేస్తూ వుండేవాడు. అతనికి సంవత్సరానికి నాలుగయిదు వేలు ఆదాయం ఉండేది.

దాసు ఆ గొడ్డుచాకిరిని ఎంతో కృతజ్ఞతతో స్వీకరించాడు. నరసింహం కొంత సొమ్ము

సాయంచేసి, తన గది పక్కనే ఆ భవనంలో గది యిప్పించి, హోటలులో ఖాతా యిప్పించి సాయంచేశాడు దాసుకు.

ఒక రెండు వారాలపాటు దాసు ఆ పనితో నలిగిపోయాడు అలవాటు లేక. పగలు చేసిన పనంతా సాయంత్రంపూట జ్ఞప్తికి తెచ్చుకునే వాడు దాసు. తనగురించి ఎప్పుడూ ఆలోచించే వాడు కాదు.

ఒక ఆదివారం ఉదయం దాసుకి సరోజను కలుసుకుందామని బుద్ధి పుట్టింది-ఆవేళ సెలవు కాబట్టి. అంతకు ముందురోజు రాత్రి రాజేశ్వరమ్మ కలలో కనిపించింది; అతనికి మళ్ళీ ధైర్యం, ఉత్సాహం కలిగాయి.

నరసింహంతో చెప్పకుండా, రహస్యంగా వెంకటేశ్వర్లు యింటికి బయలుదేరాడు దాసు. అక్కడికి వెడుతూంటే అతని అడుగులు చాలా ఉత్సాహంగా పడ్డాయి. ఇన్నాళ్ళూ కుర్చీ మీద కూర్చొని పాత గ్రంథాలన్నీ తిరగ వేస్తూంటే అతని కాళ్ళకు తిమ్మిర్లెక్కాయి. ఆదివారం సెలవుని పూర్తిగా వినియోగించుకునే బడిపిల్లవాడిలాగ వున్నాడు.

సరోజను కలుసుకోవటమే అతని లక్ష్యం; ఆ సాధనలో అతనికాళ్ళ శ్రమనుగాని, దేహం ఆయాసాన్నిగాని సరకు చెయ్యలేదు. దారిలో అన్నీ అతనికి అతి మనోహరంగా కనిపించ సాగాయి. ఎక్కడా కొంచమైనా విచారంగాని, వ్యాకులతగాని గోచరించలేదు.

వెంకటేశ్వర్లు యింటి గేటుదగ్గరికి రాగానే అకస్మాత్ భయం ఆవరించింది అతన్ని. అతను అక్కడి కెడితే ఏం మాట్లాడాలి, వాళ్ళేదైనా మాట్లాడితే ఏ విధంగా సమాధానం చెప్పాలి అన్న విషయాలు ఆలోచించటం మొదలుపెట్టాడు. అన్నిటికన్నా ముఖ్యమయిన సమస్య తనరాక గురించి ఏం సంజాయిషీ చెప్పాలి అన్నది. ఐనా అతను యీ ఆలోచనతో కాలం వృథా చెయ్య లేదు. ఆలస్యం అయితే అతని ధైర్యం సడలి పోతుందని భయం. భయపడుతూనే తలుపు తట్టాడు.

గేటు తలుపు తెరవబడింది. తోటదాటి మెట్లనెక్కుతూ, మొదటి మెట్టుమీద ఆగాడు. అక్కడ కొంచెం సేదదీర్చుకొని, ధైర్యం తెచ్చుకుని కళ్ళు ఎత్తి చూశాడు.

ఇంటి ఆవరణలో అతనికి సుత్తి, సమ్మెట దెబ్బలూ, కూలివాళ్ళ వగర్పులూ వినిపించాయి. పనివాళ్లు నడవలో గుమ్మం బాగు చేస్తున్నారు. కొంతమంది పనివాళ్లు గోడలకు రంగు వెయ్యటానికి పాతరంగు గోకి వేస్తున్నారు.

రామదాసు తెల్లబోయినా, ఒక విధంగా సంతోషించాడు. ఒక పనివాడి దగ్గరకి వెళ్లి వెంకటేశ్వర్లు ఎక్కడున్నాడని అడిగాడు. పని వాడు మేస్త్రీ దగ్గరికి అతన్ని పంపించాడు. వెంకటేశ్వర్లు ఆ యిల్లు అమ్మివేశాడనీ, అక్కడికి ఆరుఫర్లాంగుల దూరంలో వున్న సుధాసౌధంలో వుంటున్నాడనీ మేస్త్రీ చెప్పాడు.

రాజేశ్వరమ్మ చనిపోయిన దగ్గర నుంచీ ఆ యిల్లంటే ఏవగింపు కలిగింది వెంకటేశ్వర్లుకి. ఆ యింట్లో ఎక్కడ తిరిగినా తన భార్య మరణ శయ్య కనిపించడం. రోదనలు వినిపించడం, శవం తననెప్పుడూ పరీక్షిస్తూ వెన్నంటుతూ వుండడం, యిలాగ వుండేది వెంకటేశ్వర్లుకి. అందుకని వీలయినంత త్వరగా ఆ యిల్లు వదలి పెట్టి వెళ్ళడానికే నిశ్చయించాడు.

పైగా ఆ భవనం అమ్మివేస్తే బోలెడంత సొమ్ము తన చేతిలో ఆడుతుందని కూడా అత నికి ఆశ కలిగింది. ఆ పేట గాని, ఆ భవనం గాని వదిలి అంతకంటె అందమైన పరిసరాల్లోకి వెళ్ళటానికి అతను అనుమానించలేదు. అందుకని అతను వేరొక యింట్లో మేడ భాగమంతా అద్దెకు తీసుకొని అక్కడికి వెళ్ళిపోయాడు.

రామదాసు సరోజను కలుసుకుందామనే ఆసక్తితో, పట్టుదలతో వెంకటేశ్వర్లు వుంటున్న యింటిని గురించి భోగట్టా చేసి బయలుదేరాడు. అంత దూరం నడవడంలో దాసు ఆసక్తి చచ్చి పోయింది. తన ప్రయత్నంలో ఎన్ని అటంకాలు, కష్టాలు, జీవితంలో ఎన్ని ఆశాభంగాలు ఉన్నదీ అతను బాగా గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. ఇంతలో వర్షం వచ్చి అతన్ని ఒక పంచ క్రిందకు తరిమింది. వాన వెలిశాక అతను బురదలో నడక సాగించ వలసి వచ్చింది. మేడ మెట్లెక్కి తన కాళ్లవైపు చూసుకుంటే కాళ్లనిండా, జోళ్లనిండా బురద వుంది.

సూరయ్య తలుపు తీశాడు దాసుకి. దాసును చూసి వాడు కించిత్తయినా ఆశ్చర్యపడ లేదు. అతనిని గుర్తించని వాడులాగ, కొయ్యబొమ్మ లాగ నిలుచున్నాడు. అయినా వాడి మీసాల చాటున తుంటరి నవ్వు దాగుకొని వుంది.

వెంకటేశ్వర్లు యింట్లో లేడనీ, త్వరలోనే వస్తాడనీ అంత వరకూ లోపల కూర్చోమనీ సూరయ్య అన్నాడు.

దాసు లోపల కెళ్ళి కూర్చుందుకు సాహసించ లేదు. గచ్చుమీద అతని బురద కాళ్ళ ముద్రలన్నీ పడ్డాయి. కదిలితే కొత్త ముద్రలన్నీ పడతా యన్న భయంతో ఒకచోటే స్తంభించినట్టు నిలబడిపోయాడు. దాసు యెదురుగుండా వున్న అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకున్నాడు. అతని ప్రతిబింబం కన్న ఆశ్చర్యకరమైన, నిరుత్సాహకరమైన విషయమేదీ వుండదు అతనికి. దాసుకి తనమీదే అసహ్యం జనించింది.

వెంకటేశ్వర్లు యింట్లో లేకపోవడం ఒక విధంగా మంచిదే ననుకున్నాడు. సరోజ యీ లోగా ఒకసారి కనబడితే, ఆమె నెత్తుకుని ముద్దాడి త్వరగా వెళ్ళిపోదామనుకున్నాడు. సరోజ నవ్వు ఎక్కడైనా వినబడుతుందేమో, ఆమె దగ్గరకు త్వరగా వెళ్ళవచ్చునని అతను శ్రద్ధగా ఆలకించడం మొదలుపెట్టాడు.

అతనా స్థితిలో వుండగా యింట్లో టేబిలు గంట మోగింది. ఆ తరువాత సిల్కు దుస్తుల రెపరెప ధ్వని ప్రక్క గదిలో వినిపించింది. ఒక స్త్రీ నవ్వు, తర్వాత ఆమె సూరయ్యతో మాట్లాడటం దాసు విన్నాడుగాని, ఏం మాట్లాడుకున్నారో సరిగా తెలియలేదు.

కొంతసే పయిన తర్వాత ఆ సిల్కు దుస్తుల ధ్వని మళ్ళీ వినిపించి ఒక యువతి దాసు నిలుచున్న వసారా కెదురుగుండావున్న గదిలోకి వచ్చింది. ఆమె విలాసిని. ఆమె మగవాడి కళ్ళు మిరుమిట్లు గొలిపేలా దుస్తులు ధరించి అలంకరించుకొంది. తలలో అనేక రకాల, మత్తు గొలిపే వాసనల పుష్పాల్ని తురుముకొంది.

విలాసిని డబ్బుకోసం చాలా చిక్కుపడుతోంది. ఆమె యింట్లో సామాను అమ్ముదామనుకొనే సమయానికి ఆమెకు పదిహేను రోజుల నుంచీ కనబడని వెంకటేశ్వర్లు జ్ఞాపకమొచ్చాడు. అవసరం కొద్దీ ఆమె వెంకటేశ్వర్లు యింటికి దాసుకంటే ముందుగానే వొచ్చింది. సమయానికి వెంకటేశ్వర్లు యింట్లో లేనందుకు ఆమెకు కోపం వచ్చింది.

ఆమె గదిలో పచార్లు చేస్తుండగా దాసు కనిపించాడు. విలాసినికి దాసును చూడగానే నవ్వు వచ్చింది. ఆ నవ్వును ఆపుకుందుకు ప్రయత్నించబోయి ఆమె ఉక్కిరిబిక్కి రయింది. నల్లగా పొడుగావున్న శరీరం, దొప్ప చెవులు, కోల ముఖంతో వున్న దాసు ఆమెకు అతి వింతగానూ, పరమ అసహ్యంగానూ కనిపించాడు. ఆమె ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కి రవుతోంది.

ఆమె ప్రక్కగదిలోకి వెళ్ళిపోయి పిచ్చిదానిలా నవ్వటం దాసు విన్నాడు. ఇంతలో లోపల జోడుచప్పుడు వినిపించింది. వెంకటేశ్వర్లు యింకో మెట్లద్వారా లోపల ప్రవేశించాడని దాసు గ్రహించాడు. వెంకటేశ్వర్లు ముందు హాలులోకి ఎందుకో వచ్చి చిరాకుగా విలాసిని వున్న గదిలోకి వెళ్ళాడు. దాసుకి ఏం మాట్లాడాలో, ఏం చెయ్యాలో తోచక ఒక మూల నక్కాడు. వెంకటేశ్వర్లు అతనిని చూడ లేదు. విలాసిని చొరవచూసి ఆశ్చర్యం వేసిందతనికి; కోపంకూడా వచ్చింది. వెంకటేశ్వర్లు మైలపట్టి పన్నెండో రోజున కర్మకాండ యథావిధిగా చేసి గోదానం, వస్త్రదానం, సువర్ణదానం చేసేటప్పటికి అతనిలో కొంత పవిత్రత ఏర్పడింది. రాజేశ్వరమ్మ ఆ యింట్లో పోయింది కాబట్టి అందులో అతను మూడు నెలలవరకూ ఉండడానికి వీలులేకనూ, డబ్బుకు చాలా నిక్కచ్చిగా వుండీ ఆ యిల్లు ఏదో కంపెనీ వాళ్ళకు అమ్మివేశాడు. ఈ సంగతులన్నీ తెలుసుకున్న విలాసిని అప్పుడే డబ్బుకు వచ్చిపడింది.

దాసుకి వినాలని కుతూహలం లేకపోయినా ఆ మూల నిలుచున్నందువల్ల వెంకటేశ్వర్లు, విలాసిని మాట్లాడుకున్న మాటలు వినిపించాయి.

"నీ కిక్కడేం పని వుంది!" అన్నాడు వెంకటేశ్వర్లు కోపంగా.

"మిమ్మల్ని చూదామని వచ్చాను" అంది విలాసిని నెమ్మదిగా.

"నిన్నిక్కడకు ఒక నెల్లాళ్ళవరకూ రావద్దని కబురంపలేదూ! నా మనస్సింకా కుదుట బడలేదు."

"అయితే నన్ను వెళ్ళిపోమంటారా?"

ఆమె అన్నదాన్ని వెంకటేశ్వర్లు వినిపించుకోలేదు. ఇంకా గట్టిగా అరుస్తూ "నువ్విప్పుడు రావడం బొత్తిగా అసందర్భంగా వుంది. నీకు యిలాంటి సమయంలో రాకూడదని తెలుసు ననుకున్నాను" అన్నాడు.

"అయితే నేను వెళ్ళిపోతున్నాను" అంటూ ఆమె వెళ్ళిపోవడానికి ప్రయత్నించినట్టుగా అతన్ని బెదిరించింది. ఆమె అక్కడికి ఆ సమయంలో రావడం మహాపరాధం అని అతను అంటూనేవున్నాడు. ఆమె వెళ్ళిపోతానని బెదిరిస్తూనే వుంది. అతను ఊరుకోనూ లేదు; ఆమె వెళ్ళా లేదు.

తరువాత కొంతసేపటికి వాళ్ళ అరుపులు తగ్గాయి. ఇద్దరూ మెల్లిగా చాలాసేపు మాట్లాడుకోవటం వినిపించింది. ఆ తరువాత గుసగుసలు వినిపించాయి. చివరికి దాసు ముద్దులు పెట్టుకొన్న ధ్వని విన్నాడు.

అతని కక్కడ వుండటానికి మనస్కరించలేదు. మెట్లు దిగిపోవడానికి వెడుతూ దారిలో సూరయ్యను చూశాడు.

"బాబుగా రీవేళ మీతో మాట్లాడుతా రనుకోను" అన్నాడు సూరయ్య.

"పోనీలే, సరోజ యిక్కడలేదా ఏమిటి?" అన్నాడు దాసు.

సూరయ్య ఈ ప్రశ్నతో ఆశ్చర్యపోయాడు. అతని గంభీరతంతా చలించిపోయింది. "అదేం, లేదు. ఆమె వాళ్ళ మేనత్త జానికమ్మదగ్గ రుంది."

దాసు సూరయ్యదగ్గర ఆమె ఎడ్రసు తీసుకున్నాడు. వెంకటేశ్వర్లు పిల్లను తనదగ్గర వుంచుకోవటం బరువుగా భావించాడు. పైగా తను చేసే తప్పుడు పనులన్నిటికీ ఒక సాక్షి వుండటం అతని కిష్టం లేకపోయింది. తరువాత ఆమెకూడా తనలాగ ప్రవర్తిస్తుందేమోనని అతని భయం. అందుకని సరోజను ఏమైతే అవుతుందని తన చెల్లెలికి ఒప్పజెప్పాడు.

"సరోజ నీ దగ్గరవుంటే బాగుంటుంది. ఆడపిల్ల ఎప్పుడూ ఆడవాళ్ళదగ్గిరే పెరగాలి. అదే మగపిల్లవాడయితే నాదగ్గరే వుంచుకొందును." అన్నాడు వెంకటేశ్వర్లు తన చెల్లెలితో. కాని అదంతా అబద్ధం. అతనికి మొదటినుంచీ దృష్టిలో వున్నది అతని స్వేచ్ఛ.

దాసు ఎడ్రసు మననం చేసుకుంటూ వెళ్ళిపోయాడు. అతనికి ఆకలి అధికంగా వుంది; అలసటగాకూడా వుంది. కాని తలంచుకున్న పని అయేదాకా విశ్రాంతి తీసుకోవాలని లేదు.

ప్రొద్దుట వర్షంతో ఆకాశం నిర్మలమయింది. సూర్యుడు తీక్ష్ణంగా ప్రకాశిస్తున్నాడు. వీధులన్నీ ఆరిపోతున్నాయి. దాసు జోళ్ళమీది మట్టినీ, పంట్లాం మీది బురదనూ దులుపుకొన్నాడు. తలమీద నీళ్ళన్నీ జేబురుమాలుతో తుడుచుకున్నాడు.

జానికమ్మ నివసిస్తున్నది చాలా పెద్దభవనం. ఆ యింటిచుట్టూ ఖాళీజాగా, దానిచుట్టూ ప్రహరీగోడా వున్నాయి. దాసు నిర్భయంగా పెద్ద గేటు ద్వారా లోపల ప్రవేశించాడు. అతను లోపలికి వెడుతుండగా ఒక కారు క్రింద పడేవాడే. ఆ కారు నిశ్శబ్దంగా వెనకనించి వచ్చి అకస్మాత్తుగా హారన్ వినిపించింది. దాసు త్రుళ్ళిపడి గోడమూలకు గెంతి తప్పించుకున్నాడు. ఆ కారులో అతను పాతిక ముప్ఫైసంవత్సరాల మధ్య వయస్సుగల యువతిని చూశాడు. ఆమె అతనివైపు అసహ్యంతో లెక్కలేనట్టు చూసింది. ఆమె చాలా ఖరీదైన దుస్తులు ధరించి అందంగా అలంకరించుకొంది. ఆమె యించుమించు విలాసినిలాగ తయారయింది. బహుశా ఆమె చూపుల్లోను, అలంకరణలోను విలాసినిని అనుకరించటానికి ప్రయత్నిస్తోందేమో అనిపిస్తుంది.

దాసు ఒక పరిచారిక దగ్గరకువెళ్ళి మెట్లమీద నిలుచున్నాడు. ఆమె కారు యింటికివచ్చి మళ్ళీ వెళ్ళటం పరీక్షిస్తూ నిలుచుంది.

"జానికమ్మగా రింట్లో వున్నారా?" అని అడిగాడు.

"ఆమె యిప్పుడేగా వెళ్ళిపోయారు, చూడలేదూ?" అంది. దాసు నిర్విణ్ణుడై నిలుచున్నాడు. అంత ఆడంబరంగా వున్నావిడ సరోజ సంరక్షకురాలని వినగానే అతని కొక విధమైన వెగటు జనించింది.

పదహారేళ్ళ వయస్సప్పుడు వెంకటేశ్వర్లు చెల్లెలు చాలా కోరికలతో, ఆశలతో ఉత్సాహవంతంగా వుండేది. ప్రపంచంలో వున్న అన్ని షోకులూ, సౌఖ్యాలూ చవిచూడాలని ఆమె కోరుకుంది. వివాహ సమస్య ఆమె ఒక లెక్కల సమస్యగా భావించి సూక్ష్మంగా తేల్చేసింది. ఆమె సౌఖ్యం, స్వప్రయోజనం ఏ విషయంలో, ఎలాగ బాగా చలామణీ అవుతాయో చాలా సునిశితంగా తెలుసుకోగలదు. నీతి శాస్త్రం, ఆచారాలు ఆమె దృష్టిలో లేనట్టుగానే లెక్క. ఏ విషయంలోనైనా తన ఆలోచన, తనకోరిక, పట్టుదల నెగ్గా లంటుంది. తన సౌందర్యం, పలుకుబడి, ధనం ఏవిధంగా ఉపయోగించి లాభం పొందాలో ఆమెకి బాగా తెలుసు.

ఆమెకి వెంకటేశ్వర్లు సంసారం చూస్తే చాలా జాలి. రాజేశ్వరమ్మను చూస్తే అంత కంటే జాలి. తనలాగ విలాసాలకీ, వినోదాలకీ కాలం వినియోగించకుండా భర్త తన ఇష్టం వచ్చినట్టుగా తిరిగి డబ్బు ఖర్చు చేస్తూంటే, ఆమె నోరు మూసుకుని ఒకమూల పడివుండడం జానికమ్మకు ఆశ్చర్యం. జానికమ్మ అందుకనే చాలా తెలివిగా ఒక వ్యాపారస్థుణ్ణి పెళ్ళాడింది. అతని కెప్పుడూ సంపాదించడమే పని, ఆమె కెప్పుడూ అతని జేబులు ఖాళీ చెయ్యటమే పని. కాని ఆ జేబులుమాత్రం ఎప్పుడూ అక్షయంగా వుండేవి. ఆమె అంచనాలు అన్ని విషయాల్లోనూ ఫలించాయి. ఆమె భర్త సుబ్బారాయుడు ధనాగారం బాగా అభివృద్ధి చేశాడు. అతను వాడుకొన్నది తక్కువే. జానికమ్మ హుషారుగా వున్నప్పుడు తను ఆ యింటి కంతటికీ, తన భర్తకీకూడా రాణీ ననుకొని పొంగిపోతూ వుండేది.

ఆమెకి ఒక్క విచారం మాత్రం వుండేది. తన భర్త రాజకీయాలు మాట్లాడటం మొదలు పెట్టి మెల్లిగా శాసనసభల్లోకి వెళ్ళిపోతానంటూ వుండేవాడు. ఆమె కది ఇష్టం లేదు. అతనెల్లప్పుడూ వర్తకుడుగానే వుండి సంపాదిస్తూ వుండాలని ఆమె వాంఛ. జానికమ్మ వన్నెల విసనకర్ర, సీతాకోక చిలుక అయింది గాని, అలా గవటానికి ఆమె చాలా డబ్బు ఖర్చు చేసింది. ఏ కొత్త అలంకరణ వచ్చినా, అవిడ అమలులో పెట్టవలసిందే.

విలాసిని—అటువంటి వాళ్ళంటే జానికమ్మకు అసహ్యం; కోపం. ఎందువల్లనంటే జానికమ్మ అలంకరణల్లో విలాసిని వంటివాళ్ళను తప్పని సరిగా అనుకరించ వలసి వస్తుంది. జానికమ్మకు ఇష్టం లేకపోయినా అనుకరించటం తప్పలేదు. ఇతరులను అనుకరించకుండా కొత్త అలంకరణలను తనే ఆచరణలోకి తీసుకురావాలని అభిలాష. ఆనందం అలంకరణలోను, దుస్తుల్లోనూ వుందనీ, ఆ ఆనందాన్ని డబ్బుతో కొనుక్కో వచ్చుననే పిచ్చి అభిప్రాయంలో వుందామె.

ఒకనాడు సినిమా దగ్గర ఒకతను ఆమెని జల్సా స్త్రీ అనుకొని చాలా తేలికగా మాట లాడాడు. జానికమ్మ కోపం నటించి, విడ్చి, తన హోదాను తెలుపుకొని అతని దగ్గర క్షమా పణ పుచ్చుకొంది. కాని, అతనలా ఆమెను భావించినందుకు ఆమె లోలోపల సంతోషించక పోలేదు.

జానికమ్మ వెళ్ళిపోతుంటే రామదాసు నిశ్చేష్టుడై చూసి చాలామట్టుకు ఆమెనుగురించి గ్రహించగలిగాడు. ఆ యింట్లో పనిమనిషిని మాత్రం ఏమీ ఆమెనుగురించి అడగలేదు. సరోజను గురించి మాత్రం అడిగాడు.

"ఆ పిల్లంటే ఆ యమ్మకి తల నొప్పండీ. ఎప్పుడూ కాళ్ళని పెకేసుకుని తిరుగుతూ వుంటుందని ఆమెకి చీదరండి."

"అయితే సరోజ ఎక్కడుంది?"

"వారం రోజులకిందటే అక్కడే వుండి పోయే యేర్పాటుమీద బళ్ళో వేశారండి" అంది.

దాసు నిర్విణ్ణు డయాడు. కంగారుతో అడిగాడు—

"ఆమె చాలా కాలం అక్కడుండాలా! ఎన్నాళ్ళుంటుం దక్కడ?"

"నాకేం తెలుసూ?" అన్నదా పనిమనిషి అప్పుడే కొంచెం చిరాకు సూచనలు కనబరుస్తూ. "అమ్మగారు ఓ పన్నెండేళ్ళపాటు ఆ పిల్లని అక్కడే వుంచేటట్టుగా వుంది" అంటూ వెళ్ళి పోయింది. (సశేషము)

# వడిచిన రోజా

'సజగ్నాథ్'

ఆ వూరు వస్తున్నా నన్నమాటేగాని – మన స్వంతా వదిలేసిన వూరులోని స్నేహితున కతి ముఖ్యమయిన సంగతంతా పూర్తిగా చెప్ప లేక పోయానన్న కించతోనే బాధపడుతున్నాను. రైలుబండి ప్లాట్ ఫారమ్ పై ఆగింది సదవు వెంటనే వెళ్ళాను టెలిగ్రాఫ్ ఆఫీసుకి

కౌంటర్ దగ్గఱకు వెళ్ళా... ఆరె, ఎవరు చెప్మా! ఇప్పుడు అన్నట్టు ఆడవాళ్ళు కూడా పబ్లిక్ సర్వీసెస్‌లో పని చేస్తున్నారు కదా!— చూపు మరల్చ లేకపోయాను. నిజం చెప్పా లంటే-ఎంతో అందంగా వుంది. అంతే- టెలి గ్రాం పుచ్చుకుంది. పదాలు లెక్క పెట్టింది. కావల సిన డబ్బు తీసుకుంది.

వచ్చేస్తున్నా ... కొట్లాట మొదలైంది. మనసు పరిపరివిధాల పోతోంది... అబ్బ, ఎంత అందంగా వుంది! మెరుపు తీగను మల్లే— వెనక్కు తిరిగి చూశా—ఒక్కమాటా మాట్లాడా తిరిగి చూసి నట్లయింది. ఆమె పని ఆమె చేసుకుంటూనే వుంది.

అందంగా వుంటే కదూ! నా కన్న యోగా వన కళా సముదయ మింకా కనుయనే లేదు. ఎంతో ఆకర్షణీయంగా వుంది. ఆ నీలి మేఘపు కాంతి చీరెలో మెరిసి పోతోంది. ఎటువంటి శరీరకాంతి... ముద్దు పెట్టుకుంటేనో—

మరోసారి వెళ్లాను. మాట్లాడాలని కుతూ హలంతో వున్నా—సమయం చిక్కలేదు. మూడో పర్యాయం...వెళ్లాను. ఆమె ఒక్కర్తే వుంది.

ఆమె ముఖం చూడక తీరిందికాదు...కారణం? నాలుగైదు టెలిగ్రాములు యిచ్చాను..ఎవో ఇప్పుడిస్తే ఎన్ని గంటలకు వస్తుంది? ఆదివారం ఐతే ఎలాగ! టెలిగ్రాఫ్ స్టేషన్ లేని వూళ్లలో ఎలా? ఏవేవో అసంబద్ధపు ప్రశ్నలు వేశాను-

ఆమె ఎక్కడా చలించలేదు. చిరాకు అంత కన్నా పడలేదు. నెమ్మదిగా అన్నింటికీ సమా ధాన మిచ్చింది.

రోజా అర్థమం రెండు సార్లయినా వెళ్తూండేవాణ్ణి. ఆమె ఒంటరిగా ఏ సమ యాల్లో వుంటుందో తెలుసుగా మరి!

వట్టినే వెళ్ళితే బాగుంటుందా? మర్యాదగా వుండదు. ఏదో నెపం వుండాలి. అందువల్ల యిచ్చినవాళ్ళకే టెలిగ్రాములు ... స్నేహితులు పిచ్చివాణ్ణయ్యా ననుకుంటారేమో! అనుకోని.

ఈ రోజైనా మాట్లాడాలి...అని అనుకో దమే. రోజా మనస్సును హెచ్చరిస్తూండ దమే కాని- ఫలితం శూన్యం. తెగింపు చేయా లంటే, ధైర్యం?

ఆమె మృదుమధుర వచనాలిత్యం, సుందర గభీరవదనం, ఆమె ప్రవర్తన, నెమ్మదిలోని చిన్నారి చిలిపితనం "నిన్ను ప్రేమిస్తున్నాను" అని వెలువడే నామాటల కడ్డువచ్చి, నన్ను ఉక్కిరిబిక్కిరి గావించినై. అంతే—

ఆఖరుకు అనుకున్న దొకటి. జరిగిన దింకొకటి.

"ఒక టెలిగ్రాఫ్ ఫారం..." వణుకుతూ అడిగిన దింతే—

ఎంతకాలం యిలా? ఆఖరుకు ఈ రోజైనా విజయవంతంగా వెళ్లాలనుకున్నా.

టెలిగ్రాం ఫారం తీసుకున్నా—దాని మీద యిలా రాశాను:

'ఫలానా నారీ,

ఫలానా వీధి,

ఫలానావూరు—

కౌంటర్ దగ్గర వుంటున్న అందమైన అమ్మా యిని ఎంతో వెఱ్ఱిగా ప్రేమిస్తున్నా—నేను.

చేతులు వణకసాగేయి ఆ టెలిగ్రాం ఆమెకు అందిస్తూంటే—

ఆమెలో చలనమే లేదు...

ఫారం పుచ్చుకుంది...పదాలు లెక్క పెట్టి సరిగ్గా ఒకరూపాయి పదకొండణాలు అంది.

చలించని రాతి వానప్పు స్త్రీల పవిత్రతకు మంత్ర ముగ్ధుణ్ణయి—చిల్లరకోసం చూశా.

లేదు...రూపాయిపావలా కాగితం వుంది— యిచ్చాను.

నోటును పుచ్చుకొని అన్ని పక్కలా తిప్పి చూసింది. చూసి ఫకాలున ఒక్కసారి నవ్వింది... అంతే- లతలు మళ్లీ పూవులు వికసించినట్టయింది. ఇంకా నవ్వుతోంది... నీళ్ళ గల గల ధ్వనిని మించుతూ నవ్వు ప్రతిధ్వనించింది...అంతే.

"మిగిలిన చిల్లర మీకు కావాలా?" ఆమె అడిగిన దంతే—

(ఒక ఫ్రెంచికథ ఆధారం)

కథానిక

# నాలుగు స్తంభాలాట

వి. యస్. అవధాని

ఎంత కాచినట్లే కాచి చిటపటలాడి వాన ప్రారంభమయింది. శేషు అంతవరకూ రాస్తున్నకలం ఆపలేదు. పది గంటలకు ఇంటిదగ్గరనుంచి వచ్చి ఈ బ్యాంకులో పడ్డాడు. అది ఆఖరునెలలో ఆఖరురోజు. ఆనాడే జీతం ఇస్తారు. కాని ఇది ఏం జీతం? తన ఖర్చులలో ఎన్నోవంతు? అంతకన్న ఎక్కువ సంపాయించడానికి వీల్లా కనిపించదు. ఇవన్నీ ఆలోచించేందుకు తీరిక ఏదీ? ఒకటే పని- పని- దేనికీ ఈ పనంతా? దీని వలన తనకు ఏం లాభం?

వాన కురుస్తూనే ఉన్నది. టైపిస్టు మిషన్ను టక టక లాడిస్తున్నాడు. వాళ్ళ ఇద్దరిలో ఎవరు యంత్రం? ఎవరు మనిషి! గడియారం తిరిగి తిరిగి అయిదు కొట్టింది. ఏజంటు కారు పోతూ పోతూ భాగ్యవంతుని ఉదర్ఘపు త్రేపల్లే ఒక అరుపు అరచి పోయింది. ఒక్కొక్కరే లేచి పోతున్నారు. కాని శేషు లేవలేదు. ఇంకా రాస్తూనే ఉన్నాడు. అలాయని కష్టపడి పని చేసేవాడని మెప్పు సంపాదించేందుకా? కాదు. ఆలోచనల తీవ్రతవల్ల ఎక్కువైన ఆసౌమనస్యం వలన ఇంకా అట్లా ఎంతసేపయినా కూర్చునే వాడేమో- ఇంతలో "కాషియర్ గారు పిలుస్తున్నారండీ" అన్నాడు ప్యూను రాఘవయ్య.

నిద్రలోంచి లేచిన వాడల్లే శేషు రాఘవయ్య వంక ఎగాదిగా చూశాడు. తను చేయుచున్న ఏ రహస్యపు పనినయినా వాడు పసికట్టాడేమో ననే ఓ రకపు అనుమానంతో. మళ్లీ రాఘవయ్య "మిమ్మల్ని కాషియర్ గారు......"

"ఆ, వస్తున్నా" అంటూ తన జీతపురాళ్లు నగ రూపాయిలు పుచ్చుకున్నాడు. దరిద్రుని కోపా లాగేట్లు వాన కొంచెం వెలిసింది.

శేషు పాంటు సర్దుకుంటూ మెల్లిగా వరండా లోంచి బయటికి నడుస్తున్నాడు. బియ్యపుకొట్టు వెంకయ్య యమునివల్లే ఎదురుగా వస్తున్నాడు.

"...ఈ నెలన్నా పైకం ఇప్పించాలి. రెండునెలలనుంచీ వాయిదా..............."

"ఏదీ పుస్తకం ఇటు తే..."

ఎప్పుడూ తనవెంబడే ఉండే దండాయుధం లాంటి చిట్టాను వెంకయ్య తీస్తూ-

"చిత్తం...ఇదుగో తమ ఖాతా 52 రూపాయిలు ఇవ్వాలి."

ముప్ఫయి రూపాయిలు జమవేసి అయిదు పదులు ఇచ్చి గబగబా బయటికి నడుస్తున్నాడు.

ఎదుటనే ఉన్న కాన్‌టీన్ కుర్రవాడు... "మిమ్మల్ని అయ్యరుగారు పిలుస్తున్నారండీ" అన్నాడు.

"రేపు ప్రొద్దున వస్తానని చెప్పు."

"అట్లా కాదటండీ, ఇప్పుడే రమ్మన్నారండీ."

తప్పదు కనుక హోటల్లోకి వెళ్లి తనే ముందుగా "ఇదిగో, ఈ ముప్ఫయీ జమ వేసుకో" అన్నాడు. అట్లా అనడం ఎంత దర్జా! కాని ఆ దర్జా ఎంతసేపు ఉంటుంది? క్షణం సేపు. కాని దానివలన కలిగే తృప్తి ఎంతసేపు ఉంటుంది? ఎంతసేపయినా ఉంటుంది. వట్టి తృప్తి ఏం చేసుకోను? పులుసులో వేసుకోనా! ఎట్లాగూ డబ్బు ఇచ్చాడు కాబట్టి ఒక అరకప్పు కాఫీ తాగి బయటపడ్డాడు. రోడ్డున నడుస్తున్నాడు. "ఛీ ఏం జీవితం ఇది? ఏ నెల కా నెల ఇంతే అవుతోంది" అని అనుకున్నాడు.

"అట్లా బేజారవుతావేం? ఈ కరువు రోజులలో అందరి పనీ అట్లానే ఉన్నది" అన్నాడు జీవంలోని రెండోవాడు.

"అందరి పనీ అట్లానే ఉన్నదనుకుని తృప్తి పడడం. అంతకన్న ఏమీ లేదు." అన్నాడు శేషు.

"నీకన్న ఇతర్లు సుఖపడుతున్నారని నువ్వు అనుకుంటున్నావు. నువ్వు గాని ఇతర్లలో ఒకరు అనుకునేపుడు నువ్వు సుఖపడుతున్నావని అనుకుంటారు" అన్నాడు తన రెండోవాడు.

"అట్లాగా? ఆ రామారావు చూడు. ఎవరినీ అప్పు అడగడు. పైగా తనే ఇతర్లకు వడ్డీ పాలికా సర్దుతూంటాడు."

"ఈ సంఘంలో రామారావులు ఎంతమంది ఉంటారు? అయినా రామారావు ఇబ్బంది పడడం లేదని నీకెట్లా తెలుసు?"

"ఇబ్బందిపడే మన మొహం చూసి ఎవరయినా ఇబ్బందిపడడం లేదని అనుకుంటారా? రామారావు ఎంత సరదాగా హాయిగా ఉంటాడు! అసలు అతనికి దిగుళ్ళు అనేవి ఉన్నవా అని."

"రామారావు జాయింటు కుటుంబంలో ఉంటున్నాడు. వాళ్ళనాన్న కొంచెం సంపాయిస్తున్నాడు. అయినా కొడుకును డబ్బు అడుగుతూనే ఉంటాడు."

"మరి వాళ్ళనాన్నకూ ఇచ్చి, ప్రతినెలా నాకో అక్కౌంటెంటుకో సుబ్బారావుకో అప్పు ఎట్లా ఇస్తున్నాడంటావ్?"

"ఇదే నీ తెలివి. అట్లా ఇతర్లకు ఇస్తూనే రామారావు ఈ వూళ్లో నలుగురు కోమట్లతో స్నేహం చేసుకున్నాడు. తన అవసరానికి వందా రెండూ వాళ్ళదగ్గర తెస్తూంటాడు, నెమ్మదిగా తీరుస్తూంటాడు."

"అబ్బే, అట్లా అప్పు తెస్తూన్నట్లు వాడి మొహంలో లేందే?"

"అది నీ బలహీనత. మనసులో ఉన్న ప్రతీది బయటకు కనిపించాలని ఎక్కడ ఉన్నదీ? పరిస్థితినిబట్టి సర్దుకుపోయే మనోనిబ్బరం ఉండాలి. అదుగో, ఇంటాయన ఎదురుగా వస్తున్నాడు. జాగ్రత్తగా మాట్లాడు. కిందటి నెలకూడా కొంత ఇవ్వాలి."

ఇంటాయన రాఘవయ్య చాలా తమాషా మనిషి. డబ్బు సంగతి కాక ఇంక ఏంకావాలన్నా చేసేటట్లే మాట్లాడతాడు. చెయ్యడం అంటూ వస్తే అది వేరే సంగతి.

"...అ...బ్యాంకినుంచి వస్తున్నారా?"

"అవునండీ ... పాడు వర్షం కురిసినట్లే కురిసి..."

"రోహిణీ ప్రవేశంలో వానవుందని సిద్ధాంతిగారు అననేఅన్నారండీ. ఇవాళ 31వ తారీఖు..."

"అవును. ఇదిగో పదిహేను రూపాయిలు. మిగిలింది ఇంటిదగ్గర ఇస్తాను."

"అబ్బే, ఇవ్వక ఎగవేస్తారా?... క్రిందటి నెలలోనూ ఓ పదిరూపాయిలు దిగపెట్టారు. చిన్నవాడు ఓ వందరూపాయలు అర్జంటుగా పంపమని రాశాడు. ఎక్కడన్నా చూసి పంపాలి. అంతకన్న వేరే..."

"సరే... ఇంటిదగ్గర కలుసుకుంటాను" అంటూ శేషు బయలుదేరాడు. మళ్ళీ తాను బయలుదేరిన చోటికే వచ్చాడు. అందుకనే భూమి గుండ్రంగా ఉన్నదన్నారు. 'దీని దుంపతెగా ఈ భూమి ఎందుకు గుండ్రంగా ఉన్నట్లు!"

"ఎక్కడికి ఇట్లు పోతున్నావు?" తన రెండో వాడు.

"ఇంటికి-ఇంక ఎక్కడికి పోతాను!"

"నీ తెలివి తెల్లవారినట్లే ఉన్నది. ఇంటికి పోయి ఏం చేస్తావు? తెల్లవారితే పాలవాడు, ఇంటాయన, చిల్లర కొట్టువాడు, ఇస్త్రీ చాకలి-వీళ్ళందరికీ ఏం చెప్తావు?"

"గుడ్లు అప్పు చెపుతాను."

"మంచివాడివి కదూ... అట్లాగే చేసేటట్లున్నావ్. నరసయ్య దగ్గరికి పోయి..."

"ఎందుకూ?"

"ఎందుకేమిటి? ఓ యాభయి రూపాయిలు అడిగి తీసుకో!"

"ఎటు తిరిగీ ఈనెలేగా వాడ్ని అప్పు అడగంది—"

"పోనీ రామ్మూర్తి దగ్గరకు పో."

"వాడు నగని మొహమాటస్తుడు. లేదంటే..."

"లేదంటే ఏం చెయ్యాలనే సంగతి ఇప్పుడాలోచించగల సత్తా నీకు లేదు. అది నీవంటి వాడికి చేతకాదు. నీవంటివాడు ఇతర్ల కు[illegible] పడాలి. ఇతర్ల సాయం పొందాలి."

"మనం ఏం సాయం చేస్తాం?"

"సాయం అంటే డబ్బు సాయమేనా? ఇంకా ఏమయినా చెయ్యవచ్చు."

ఇంకా నడుస్తూనే ఉన్నాడు. తన ఇల్లు దాటి పోయింది. రోడ్డువెంబడి అక్కడ ఓ కప్ప, ఇక్కడ ఓకప్ప బెకబెక లాడుతూన్నాయి.

అధికారం తాగిన నాయకుల కళ్ళల్లో లైట్లు వెలుగుతున్నాయి.

గట్టిగా గాలి పీలుస్తూ, గబగబా అడుగులు వేసుకుంటూ ఎవరూ లేని బెంచీకోసం వెదుకుతున్నాడు. ఎక్కడ చూసినా సుఖం, ఎవరి మొహాలు చూసినా ఎంతో తృప్తి కనిపిస్తుంది. ఇవన్నీ దేనివలన వస్తున్నాయి? డబ్బువలన...

"కాదు..." తనలోని రెండోవాడు.

"నీకూ నాకూ తేడే... నాతో మాట్లాడకు."

"నేను పలక్కపోతే నీ పని హుళక్కి... సర్వానికీ కారణం ఏమిటి? అనే ప్రశ్న వదలి నీ తెలివితేట లుపయోగించుకుని నీ సమస్యలను పరిష్కరించుకో..."

"అది చేతనయితే నీ చేత ఇంత చెప్పించుకోవడం దేనికి?"

"అదుగో, సుబ్బారావు వస్తున్నాడు. కాస్త హుషారుగా తిరుగు..."

"ఓ మిస్టర్ శేషూ..."

"ఏం ఇటు బయల్దేరావు?"

"నేను రోజూ ఇటే వస్తున్నాను. నువ్వే ఇవాళ కనుపించావు... కదా..."

"ఎక్కడికి?"

"న్యూ క్లబ్‌కి..."

"దేనికి?"

"ఏడిసినట్లే ఉంది. ముందు పదు, తరువాత చెప్తాను. ఇవాళ అందులో షోహో."

సుబ్బారావ్ ఎంత చలాకీ మనిషి! ఎన్ని ఇబ్బందులు వస్తున్నా, వచ్చినా ఇతర్లకు చెప్పడు. ఇతర్ల సాయం అడగడు. అడిగినట్లు తనకు తెలియదు.

సినిమాలో ... సుబ్బారావేమిటో చెప్తున్నాడు. తను కాసేపు అవుననీ, కాసేపు ఆహా అనీ, కాసేపు తెలిసీ తెలియకుండగా అనవసరంగానూ, అవసరంగానూ నవ్వి... కాలం వెళ్ళబుచ్చుతున్నాడు.

శేషు కళ్ళు సినిమా చూస్తున్నాయి. తలలో మాత్రం సుశీల కనిపిస్తోంది. డబ్బేమీ లేకుండా ఇంటికి వెళితే సుశీల ఏమనుకుంటుందో? సుశీల అడగదు. ఆ ఇబ్బంది తన కెన్నడూ లేదు. కాని మిగతా నెలంతా గడపడం ఎలా? తెల్లవారితే ఇవ్వాల్సిన వాళ్ళందరికీ ఏమని చెప్పాలి? సుశీల తనను ఎన్నోసార్లు తన తండ్రిమీద దావా వెయ్యమన్నది... మళ్ళీ సుశీలే "అబ్బే, అవేం పనులండీ" అంటుంది. తన జీవితంలో ఏనాడూ సుఖం అంటే ఏమో ఎరగడు. ఎందుకుగాను తను బ్రతుకుతున్నాడు? బ్రతకక్క చెయ్యడం ఏమిటి? చావాలి... బ్రతకడం ఒకకళ. ఒక పెద్దకళ. అది తనకు ఎందుకు చేతకాదు. తను బ్రతికే పద్ధతిమాత్రం కళ కాదా? కళా కాదు, గిళా కాదు— బ్రతుకే ఓ పెద్ద గండం. ఈ గండాన్నించి తప్పించుకోవాలి. ఎట్లా తప్పించుకోవడం? అది చేతయినయితే ఇంకా ఏం? తన ఆలోచనలే ఆలోచనలు. సుబ్బారావు స్త్రీలవంక చూస్తూ శేషుని ఆలోచించుకో నిచ్చాడు.

ఇంతలో ఇంటర్వెల్. "సోడా తీసుకురా" అన్నాడు సుబ్బారావు.

శేషు ఏదో సాకి నోట్లో వేసుకుని సోడా త్రాగాడు.

ఈ నాలుగు స్తంభాలాట తాను ఆడలేడు. తనకంటె సమర్థులయిన వారు ఎట్లా ఆడుతున్నారో తనకు తెలియదు. ప్రతి వాడూ తన పని తాను చేసుకోవడమే కాని ఈ ఆటలో అలిసినవానికి కాస్త సాయం చేద్దామని అనుకోడు. అయినా ఎందుకు అనుకోవాలి? శేషు కుర్చీలో నిర్జీవంగా పడివున్నాడు.

సుబ్బారావు సైగ చేసిన స్త్రీ బయటికి వెళుతూ వాణ్ని పిలిచింది. వాడూ లేచి బయటికి పోయినాడు.

ఎవళ్ళగొడవ వాళ్ళది, ఎవళ్ళ ఆట వాళ్ళది. అంతేనా?



# నేటి రాజకీయవాది - నైతిక ప్రమాణాలు

'యథార్థవాది'

ఆధునిక యుగంలో రాజకీయములకుగల విలువ అపారమైనది. మానవుని అనుకూలమైన మానవుని సహజస్వాతంత్ర్యాన్ని, సమాజ జీవితానికి అలవడుటచే ఎట్టి శాసనమునైనా నిర్నిబంధముగా అంగీకరించు అతని నైజాన్ని ఆధారం చేసుకొని నేటి రాజకీయవాది, సామాన్యుని మేలుగోరుటకే తన ఉద్దేశమనియైనను, దేశక్షేమంకొరకని అధికారమునకు అవధి యనునది లేకున్నది. ప్రపంచ చరిత్ర పరిశీలించిన వివిధ కాలములందలి సమాజపు మంచి చెడ్డలు ఆయా కాలములం దమలులోనున్న రాజకీయ వ్యవస్థలపై ఎక్కువ ఆధారపడియున్నట్లు తెలియుచున్నది. సాంఘికముగను, సాంస్కృతికముగను, మరొక విధముగను ప్రజాసేవ చేయ దలచినను రాజకీయవాదివలన ముందు లోకములో శాంతి స్థాపింపబడవలసియున్నది. ఆహారాది అత్యవసర జీవితావసర వస్తువులకూడ నేడు సంఘం రాజకీయవాది దయా ధర్మములపై ఆధారపడియున్నది. దేశక్షేమం పేర వ్యక్తిని సర్వవిధముల శాసించెడు అధికారము నేడు రాజకీయములు కల్గియున్నవి. ఇంతగా మానవుని బ్రతుకు నేటి సాంఘిక వ్యవస్థలో రాజకీయముల కంకితమైయుండ "గోరుచుట్టుపై రోకటిపోటువలె" తమ యిచ్చ వచ్చినట్లు కృత్రిమ మార్గములలో సమాజమునకు వచ్చు నాయకోత్తముల బారినుండియూ నేటి సామాన్యుడు దేశమును రక్షింపవలసియున్నది.

నేటి రాజకీయవాది రాజకీయములలో ఏ పాటి జ్ఞానసంపదో గ్రహించుకొన్నచో "ఏనుగు పాముపలె నుండు" నన్న లోకోత్తర పురుషుడు వాని అవశ్య దైవమని తేలుచున్నది. డిస్రేలీ అన్నట్టు అన్ని రాజకీయవిధానములు మానవ శ్రేయస్సుకే అను పరమ సత్యమును విస్మరించి గ్రంథస్థములైన కొన్ని ఎండమావులవంటి ఆదర్శములను వల్లెవేయుచుండుటనే ఎరిగిన నేటి రాజకీయవాది- మానసిక సంస్కారహీనుడగుటచే- నైతిక వాదము రాజకీయములకు ప్రాణమువంటి దని తెలిసికొనలేనంత దుస్థితిలో నున్నాడు. అందువలన ఈ మహానుభావుని వేయు పిల్లిమొగ్గలు లక్షోపలక్షలు. కొనున సిద్ధాంతములు రాజకీయాలంటే ఉపన్యాసాలు పంచడం, పత్రికా విలేఖరులతో గోష్ఠి చెయ్యడం, మ్యునిసిపల్- జిల్లాబోర్డు - శాసనసభల ఎన్నికలలో పాల్గొని సింహాసనా లాక్రమించడం. (తరువాత కథను పాఠకు లూహించుకోగలరు.) తమ లక్ష్యమును సాధించుటలో మహానాయకులకుగల పట్టుదల గాని, చిత్తశుద్ధి, సత్యసంధత, విశాలహృదయము గాని వీరిలో కంచుకాగడా వేసి వెదకినా కన్పింపవు. మనోవాక్కాయ కర్మలయం దణుమాత్రపు భేదము కన్పట్టనీయని నిజమైన రాజకీయవాది తత్వమునకు ఈయన ప్రవర్తన పూర్తిగ విరుద్ధమైనది.

మానవానీకమును అనాగరికతనుండి, పశుప్రవృత్తులనుండి, అజ్ఞానమునుండి విముక్తుల చేయుటయే రాజకీయముల పరమావధియైయుండ ఈ దశాబ్దములోని రాజకీయవాదు లవలంబించు విధానములు తలచుకున్నచో ప్రస్తుత రాజకీయవాదియెడ సమాజము ఏ పాటి ఆశల పెట్టుకో వచ్చునో సులభముగా గ్రహింపవచ్చును. ప్రత్యర్థుల వాదనలను హేతువాదముతోను, సంఘశ్రేయదృష్టితోను ఎదుర్కొనుటకు బదులు ప్రత్యర్థులనాకారమన్న బాంబులతో బెదరించుట, హత్యలను చేసి నిండువున ప్రాణముతీయుట, (తమకు ఓట్లనిమ్మినవారిని దాచివేయుట) మన నవయుగ నిర్మాతల కేవల ఆచారములైయున్నవి. ఇక నియమములకు కట్టుబడియుండుటలో, ఇతడు నిన్న సామ్యవాది; నేడు హిందూ మహాసభ అనుయాయి; రేపు గొప్ప బ్లాకుమార్కెటు వ్యాపారస్థుడైనా ఆశ్చర్యపడవలసిన పనిలేదు.

ఒక ఉద్యమములో చేరుటకుగాని దానినుండి నివర్తించుటకుగాని శ్రీవారికి అట్టే సేపుపట్టదు.

ప్రజల మానసికస్థితి ఎట్లున్నను నాయకత్వం చిత్తశుద్ధిగలదైతే అవినీతిపరులు చెప్పుక్రింద తేళ్ళవలె పడి ఉందురని చరిత్రానుభవము తెలియజేయుచున్నది. దొరప్రభువుల కాలంలో చెలరేగిన అవినీతిని వ్యక్తి ప్రాధాన్యములతో నిమిత్తంలేకుండా నిర్దాక్షిణ్యంగా అణచివేసి లెనిన్ మహాశయుడును, శాసనాతిక్రమణమును చేసినవారిని కఠినశిక్షలకు పాత్రుల జేసి ఖిల్జీ వంశస్థుడైన అల్లా ఉద్దీన్ చక్రవర్తియు అవినీతిని అరికట్టిరే గాని ఆనాటి కాలమునందు రష్యా, ఇండియా దేశములలోని ప్రజలు మనకంటె బుద్ధిమంతులగుటచే కాదు. నేడు అవినీతి మహామారి ప్రపంచ వ్యాప్తి గాంచుటకు రాజకీయముల నైతికపతనమే కారణముగాని ప్రజల మనస్థితి కాదు.

నైతికసుగుణాలు లేనివగుటచే కొన్ని రాజకీయపక్షములు తమ ఆదర్శములకు భిన్నముగా ప్రజలపై విపరీతాధికారము చెలాయించుటయు, మరి కొన్ని పక్షములు తాము నిర్వహింపవలసిన పాత్రను సరిగా నిర్వర్తింప లేకపోవుటయు సంభవించుచున్నది. భారతదేశమే కాంగ్రెసు కాంగ్రెసే భారతదేశము అని కాంగ్రెసుపక్షము పేరొందుటకును, నేడా ప్రాధాన్యము నది కోల్పోవుటకును దాని నైతికబలములోని తరతమ భేదములే కారణములు. కాంగ్రెసులో నేడు సంభవించిన నైతికపతనము అతివాదపక్షము లనువారిలో ప్రారంభమునందే సంభవించుటచే గొర్రె తోకవలె వాని కభివృద్ధి లేదనిపించుచున్నది. కాంగ్రెసుకు వ్యతిరేకముగా వామపక్షములను సమీకరించుటకు శ్రీ శరత్ చంద్రబోసు కొత్తగా చేసిన యత్నము విఫలమగుటయే ఇందుకు ప్రబల నిదర్శనము. (శ్రీ శిలభద్రయాజి ఆధ్వర్యమున ఇటీవలలో ఒక వామపక్ష మేర్పడి యున్నది.)

పెట్టుబడిదారుల పలుకుబడిలో వుండి బంధుప్రీతికి, ఆశ్రితజన పక్షపాతానికి, అవినీతికి కేంద్రప్రభుత్వం ఆలవాలమై యున్నదని, మనకు వచ్చినది అధినివేశ ప్రతిపత్తే గాని సంపూర్ణ స్వాతంత్ర్యం కాదని, స్వాతంత్ర్య సిద్ధితో ప్రజలకు సర్వసౌకర్యాలు కూర్చగలమని చెప్పిన కాంగ్రెసు ఏమీ చెయ్యలేకపోయిందని శ్రీ శరత్ చంద్రబోసు కలకత్తాలో చెప్పిన మాటలు వాస్తవం కావచ్చును. ఫార్వర్డుబ్లాకు పక్షనాయకులలో ఒకరైన శ్రీ రూయికర్ అన్నట్లు నే డధికారములో నుండుటకు ప్రజావిశ్వాసము కంటె వామపక్షములలోని అనైక్యతయే గొప్ప కారణం కావచ్చును. కాంగ్రెసు తనలోని లోపములు సరిదిద్దుకొనుటకు ప్రజలు శవజాగరణము చేయవలసిన అవసరం కూడా లేదనవచ్చును. కాని "రోం నగరం తగలబడుతోంటే నీరో చక్రవర్తి ఫిడేలు వాయించి"నట్లు ఒకవంక తమ అభిమాన ఆదర్శములు మట్టిగలసి పోవుచున్నవని వాపోవుచు, వేరొకవంక ఏవో స్వల్పభేదములను పురస్కరించుకొని సోషలిస్టు పక్షములన్ని అంగీకరించినవన్న బోసు మహాశయుని ఏకాంశసూత్ర ప్రణాళిక ఆధారముగనైన వీ రేకము కాలేకపోవుట నవ్వు కలిగించుచున్నది. (నేడు మతతత్వవాదులు బలపడు లక్షణములు కూడ కన్పించుచున్నవి.) ఇవి యిట్లుండ "ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికి ఎక్కబూని" నట్లు వీరిలో కొందరు కమ్యూనిస్టు నియంతృత్వమును కూడా అరికట్టెదమని ప్రగల్భము లాడుచున్నారు. కేవల అభిప్రాయముల ద్వారా ప్రజాహృదయమును మారగొనగలమని వీరుద్దేశించినచో ఇంతకన్న ఏడాకు లెక్కువగ బ్రిటిషు ప్రభుత్వమును విమర్శించి ప్రజల కనేక వాగ్దానములు చేసిన కాంగ్రెసు ప్రవర్తనను చవిచూచిన ప్రజలు సులభముగా మోసపోయెడి కాలము గతించినదని గుర్తింపవచ్చును.

ఆత్మ విమర్శన చేసుకొన్నచో కాంగ్రెసులోవలె నదితరపక్షాలలోకూడా చీలికలు అసంఖ్యాకములుగా కలవని (ఉదాహరణ, ఫార్వర్డుబ్లాకు పక్షము), వ్యక్తి ప్రాధాన్యములకై వారును ప్రత్యేకముఠాలకు చీటికి మాటికి లేవదీయుటలో ప్రసిద్ధు (తేజసింగు స్వతంత్ర, కే. టి. పా.) లని తెలియుచున్నది. నాగపూరు సమావేశములో సోషలిస్టులు పాల్గొనరని తెలిసిన వెంటనే అంతవఱకు వారి సహకారమునకై అర్రులు చాచిన శరత్ బోసు చేసిన ప్రకటన, కమ్యూనిస్టు పార్టీని గురించి తదితరులు, ఆ పార్టీ వారు కాదని ప్రకటన చేసియున్నను ఒకరాత్రి) కాథ రద్దయినట్లు, జోషి నాయకత్వమున

మరొక పార్టీ త్వరలో నెల
కొనునట్లు నిచారోపణ చేయుట.
వామ పక్షాలవారును పరస్పరా
రోపణలు చేసికొనుటలో సిద్ధ
హస్తు లేనని వ్యక్తపరచు
చున్నవి.

నైతిక వాదముయొక్క
ప్రాధాన్యమును గుర్తింపకపోవు
టచే ఇట్టి అవకతవకలకు నేటి
రాజకీయములుగురియగుచున్నవి
గ్రుడ్డిలో మెల్లవలె కమ్యూనిస్టు,
రాడికల్ హ్యూమనిస్టుల రాజ
కీయములు కొంతకు కొంత
ప్రోత్సాహ జనకముగ నున్నవి.
ఇంకొక వర్గము వారు మను
ష్యుడు సాంస్కృతికజీవి అను
వాదమును రాజకీయముల కన్వ
యించి తదనుగుణముగపనిచేయు
చుందురు. ఇంకొకవర్గము వారు
మనుష్యుడు సాంస్కృతిక జీవి
అయ్యును ఆతడు చచ్చు
టకే జన్మించుటలేదు కనుక
'శతకోటి ఉపాయములు' కన్ని
నను అనంతకోటి దారిద్ర్యము
తెమల్చనేడి నేటి బూర్జువా
కపట ఆర్థిక నీతినుంచి (బోడి
తలకు మోకాలికి ముడిపెట్టినట్లు
ఈ దరిద్రతకు కర్మ సిద్ధాంతము కారణమని
చెప్పబడుచున్నది) కోట్లకొలది మానవులను
ముందు రక్షించినగాని వారు జ్ఞాన పిపాసు లగుట
కవకాశము కల్గదనువాదము ననుసరించి పని
చేయుచున్నారు.



ప్రఖ్యాత బ్రిటిష్ సినిమాతార హాజెల్ కోర్ట్. సహజ సౌంద
ర్యాని కీమె పేరుపడింది. "మేకప్" యించుమించు అవసరం
లేకండానే యీమె చిత్రాలలో నటిస్తుంది.

వాదము లెంత విలువగలవైనను రాజకీయ
వాదులు నైతిక విలువలయొక్కయు, ధర్మ
వాదముయొక్కయు ప్రాముఖ్యమును గుర్తింప
విచో, అధునిక దృష్టిని కోల్పోవుటచే పతనము
చెందిన పూర్వవ్యవస్థవలె, నేటి రాజకీయవిధాన
ములపై ఆధారపడిన వ్యవస్థలును చీట్లపేక
మేడలవలె ఏక్షణమునో కూలిపోక తప్పదు.
తమ్ము తాము సంస్కరించుకొనకనే రాజకీయ
రంగముల కెగబడెడి వారివలన సమాజమున కింత
మేలు జరుగుటకు బదులు రాజకీయ వాతావర
ణము కలుషము కాగలదనుట సత్యదూరము
కాదు.

# వెలిగించు తంత్రీ!

దాశరథి

మబ్బుల మస్తిష్కమ్ముల
మెరిసిన ఇంద్ర చాపమ్ములూ
పచ్చని గడ్డి మళ్లలో
విరిసిన ఇంద్ర గోపమ్ములు
ఇవి వర్షానికి గురుతులు
ఇవి హర్షానికి షరతులు.

అవునా
ఈ ఇంద్ర ధనుఃఖండమ్ములు
ఒకనాటికి కాల దండమ్ములు?
ఈ మెత్తని ఇంద్ర గోపమ్ములు
ఒకనాటికి రక్త కూపమ్ములు?
కానోపు——

మా నిశా నిర్భర జీవిత రంగమ్ములు
నిజమ్ముగా విషగంగా తరంగమ్ములు.
ఒకనాటికి ఈ కాలం కట్టి తెన్నప్పుడు
ఈ జగత్తు
నవ పాంచజన్యనాదం విన్నప్పుడు
నేటివన్నీ ఆనాటికి తప్పులు
పుచ్చిపోయి పురుగెక్కిన పప్పులు.

అవునుకదా, ఆనాటికి
ఈనాటి వంకర నాగేటికి
ఎంత విలువ? ఎంత వెలువ?
ఈ చరిత్ర చీకటి గదిలో
ఈ ధరిత్రి అమ్ముల పొదిలో
తైలదీపం వెలుతురులో
వెదికి వెదికి వేసారినా
లభించేది, కనిపించేది——
పెద్దల, విద్యావంతుల
కవి రాజుల,
తరతరాల బూజుల
వ్రాత్రి పాత్ర గాజుల
విలువలు :
చిలువలు పలువలుగా
అల్లి, కల్పించి చెప్పే అబద్ధాల
రాజాధిరాజుల
మార్తాండ తేజాల
పురుషత్వపు, పరుషత్వపు
అల్లిబిల్లి, అల్లిక బిగి కథలు.

అవునా,
అనాథ విశ్వశ్రామిక మూర్తీ!
ఆగామి యుగ పరివ్యాప్త కీర్తీ!

నీ నరనరాల నడిచే
'నయాగరా', 'జెర్సొప్పా'
జలపాతాల రుధిర ధారలో
నీ కన్నీటి చారలో
జనియించిన
జగాన్ని పెంచిన
దేవుళ్ళను దెయ్యాలను మించిన
అరుణారుణ విద్యుద్దీపిక
వెలిగించుకో.

తొలగించుకో
యుగ యుగాల
పేదతనం బరువులు.
దేశ దేశాల
బీదజనం కరువులు.

హే, తంత్రీ!
లయరుద్ర, మహానుభావ!
ప్రియ విశ్వశ్రామికదేవ!
హే, తంత్రీ!
చూపించు
నా యీ పాపపు లోకం
పడిపోయే చీకటి దారుల
ఎగుడు దిగుడులు
చూపించు.

వెలిగించు, తంత్రీ,
విరించి పుట్టక ముందునించీ
మంచులో పొంచుకు కూచున్న
శ్రీయూరావ వాటిక,
ఈ 'రుధిర దీపిక.'

అభిప్రాయ వేదిక

# ప్రపంచ శాంతి




సామ్య వాదానికీ పెట్టుబడికీ మధ్యా, తూర్పుపశ్చిమ యూరపు దేశాల వైషమ్యాలకు మధ్యా నలిగి ప్రపంచం అట్టుడికిపోతున్నది. యుద్ధ మేఘాలూ, యుద్ధ భయమూ ప్రపంచాన్ని ఆవరిస్తున్నాయి. ఆవర్గాల సంఘర్షణ ప్రపంచవినాశనానికి దారితీసే లాగు కనిపిస్తున్నది.

మొన్న యూనెస్కోలో డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణగారు ఈ విషయాలనుగురించి గంభీరంగా ఉపన్యసించారు. మూడు వందల మంది యూనెస్కో సభ్యులు ఆయన ఉపన్యాసాన్ని హర్షధ్వానాలతో స్వీకరించారు.

ప్రేమను రాధాకృష్ణగారు చేసిన సూచన ఏమిటి? ట్రూమన్ స్టాలినులు కలుసుకుని శాంతి ఒడంబడిక చేసుకోవాలనీ, కమ్యూనిజమూ పెట్టుబడిదారీ ఒకదాన్నిచూసి ఒకటి భయపడరాదనీ, పశ్చిమ రాజ్యాలలో ఆర్థిక న్యాయమూ-తూర్పు దేశాలలో రాజకీయ న్యాయమూ లేవనీ, యుద్ధం పాపమని ఆయన అన్నారు. కాని ఆయన చెప్పిన తుదిపలుకు మనుష్యులు అవర్గాలను త్యజించి హృదయాలలో ధర్మాన్ని ప్రతిష్ఠింప జేయాలని!

రాధాకృష్ణగారి ప్రసంగంలో చాలావరకు భిన్నత్వంలో ఏకత్వం చూసే తాత్విక దృష్టి లోపించింది. పశ్చిమ యూరపు రాజ్యాలవారు ఆర్థిక దురన్యాయంతో బాటు రాజకీయ న్యాయాన్ని అమలు చేస్తున్నారనీ, తూర్పు యూరపు దేశాలవారు రాజకీయ దురన్యాయంతో బాటు ఆర్థిక న్యాయాన్ని అమలు చేస్తున్నారనీ ఆయన ఎట్లా విశ్వసించారో తెలియదు.

ఇది స్వల్ప విషయమని మనం త్రోసివేయనవసరం లేదు. ఈ స్వల్ప విషయంమీదనే ఈనాటి మేధావుల బుద్ధి వాద్యమంతా ఆధారపడి ఉంది. ప్రతి ఆర్థిక వ్యవస్థ వెంటా ఒక రాజకీయ వ్యవస్థ ఉండీ, దానితోపాటు ఇదీ మారుతుంది. ఒకదాన్ని చెక్కు చెదరకుండా ఉంచి రెండవదాన్ని మార్చటం అసంభవం. ఇదిసంభవమని విశ్వసించి పాత రాజకీయ విధానాలలోనే సోషలిస్టు వ్యవస్థ సాధించటానికి నడుముకట్టిన బ్రిటను, ఫ్రాన్సు వగైరా దేశాలు అమెరికా చుట్టూ పరిభ్రమిస్తున్నాయి.

రష్యాలో 1917 లో జరిగిన విప్లవానికి చరిత్రకారులు ప్రముఖ స్థానం ఇవ్వటానికి కారణ మేమంటే రష్యా తన ఆర్థిక వ్యవస్థను ఒక ధోరణిలో మార్పు చేయటానికి—ఆర్థిక దురన్యాయం అంతం చెయ్యటానికి — ఒక విధమైన రాజకీయ వ్యవస్థను ఈ విప్లవం ద్వారా దోహదం చేసుకున్నది. ఇప్పుడక్కడ వ్యక్తుల దారిద్ర్యాన్ని పూర్తిగా వ్యక్తుల కొనుగోలు శక్తితోనే కొలవ నవసరం లేదు. అక్కడ దేశ సంపదతో బాటు వ్యక్తుల సాకువ కూడా పెరుగుతుంది. అధికోత్పత్తి వల్ల అక్కడ కాటకాలు రావు. ఇదంతా పాతనమాటే. కాని మేధావులు వీటన్నిటికీ రాజకీయాలతో సంబంధం ఉందని మరుస్తూ ఉంటారు. రష్యాలో పౌర స్వాతంత్ర్యాలు లేవని రాధాకృష్ణయ్యగా రనటంలో అంతరార్థ మేమంటే, అందరికీ పని చేసుకునే హక్కు, విశ్రాంతి తీసుకునే హక్కు, రోగం వస్తే చికిత్సపొందే హక్కు, వార్థక్యంలో ప్రభుత్వం చేత పోషింపబడే హక్కు, తాము ఎన్నుకున్నవారు తమ ఇష్టానుసారం ప్రవర్తించక పోతే వెనక్కు పిలిచే హక్కు మొదలైనవి పౌరస్వాతంత్ర్యాలలో చేరవని!

రష్యాలో ఉన్న సాంఘిక పరిస్థితి ఏ కారణం చేతనైనా మనకు నచ్చకపోతే మనం దానికి ఎడంగా ఉండవచ్చు. దాన్ని చూసి అమెరికాలోనూ, బ్రిటనులోనూ, ఇతర దేశాలలోనూ గల కొన్ని వర్గాలవారు వాంతి చేసుకుంటున్నారు. దానిలోని లోపాలను విమర్శించటంతో తృప్తి చెందక రష్యామీదా, స్టాలిను మీదా, ఇతర రష్యను నాయకులమీదా లేనిదంత అపక్

ప్రచారం కూడా చేశారు. ఈ అసత్యాలు ఎన్నో సార్లు రుజువయాయి. దీనితో బాటే వివిధ దేశాలలోని ప్రజాసామాన్యాన్ని రష్యా ఆకర్షిస్తున్నది. ప్రతిదేశంలోనూ కమ్యూనిస్టు పార్టీలు పనిచేస్తూ రష్యా విప్లవాన్నీ, రష్యాలోని రాజకీయ ఆర్థిక విధానాలనూ ప్రచారం చేస్తున్నాయి. అనేకచోట్ల ఈ పార్టీలకు ప్రాబల్యం లేకపోవటానికి ముఖ్యమైన కారణ మేమంటే రష్యా విధానాలను చూసి. వాంతి చేసుకునే రాజకీయ వర్గాలవారు రాజకీయాధికారాన్నీ, ప్రచారసాధనాలనూ, పోలీసు సైనికబలాలనూ తమ చేతిలో ఉంచుకుని ఈ కమ్యూనిస్టు పార్టీలను వేటాడటమే. దీన్ని చూసి మేధావులు పొరబాటు పడరాదు; ప్రజలకు కమ్యూనిస్టు పార్టీలమీద ద్వేషమనీ, వారికి రష్యా విధానాలు నచ్చవనీ తలపోయరాదు. రష్యా విధానం నిజంగా ప్రజలకు అపకారం చేసేదే అయితే, ప్రజాసామాన్యానికి ఆ విధానంమీద ఇష్టం లేదనే భ్రమవల్ల రెట్టింపు ప్రమాదం ఉంది.

ప్రపంచశాంతి కోరేవారు యుద్ధాలెందుకు వస్తాయో కూడా తెలుసుకోవాలి. మానవహృదయాలలో ధర్మం ప్రతిష్ఠాపన కాని కారణం చేతనే యుద్ధాలు రావు. ఒక రకమైన ధర్మం యుద్ధాలకు దారితీస్తుంది. సామ్రాజ్యవాంఛా, ప్రపంచాధిపత్య వాంఛా రెండు ప్రపంచయుద్ధాలు తెచ్చిపెట్టాయి. ప్రస్తుతం ప్రపంచమంతటా పెట్టుబడిదారీ శక్తులను గెలిపించటానికీ, డాలరుచేత ప్రపంచ విజయం సాధింపజేయటానికీ అమెరికా కంకణం కట్టుకున్నది. ఈ ప్రయత్నానికి తోడ్పడటానికి బ్రిటను సిద్ధంగా ఉన్నది. ఈ అమెరికా యత్నానికి తీవ్రమైన ఆటంకరం ఎదురైతే యుద్ధం కలగవచ్చు—ప్రస్తుతం గ్రీసులోనూ, చైనాలోనూ ప్రత్యక్షంగానూ, ఇతరచోట్ల అప్రత్యక్షంగానూ జరుగుతూనే వుందికూడానూ.

ప్రపంచాన్నంతా కమ్యూనిజం మయం చేయాలనే కాంక్ష రష్యాకు ఉన్నదని ఆరోపించవచ్చు; ఆరోపిస్తున్నారు కూడానూ. దీనిని మనం విశ్వసించవచ్చు కూడాను. అయితే దీని వల్ల ప్రపంచయుద్ధం రాదని నమ్మటానికి ప్రబలమైన కారణాలు రెండున్నాయి. ఒకటి, కమ్యూనిజము పెట్టుబడిదారీ వ్యవస్థలో కలిగే సమాజ సంఘర్షణల ఫలితంగా ఉత్పత్తి అవుతుందని సిద్ధాంతం; సోషలిస్టు వ్యవస్థలోని సమాజ సంఘర్షణలవల్ల పెట్టుబడిదారీ ఉద్భవిస్తుందనే సిద్ధాంతంగాని, విశ్వాసంగాని పెట్టుబడిదారీ తత్వంలో లేదు. రెండు, ఆర్థికంగా ఇతర దేశాలమీద ఆధిపత్యం సంపాదించటానికి అంతర్జాతీయ యత్నాలు సాగించవలసిన అవసరం రష్యాకుగాని, తూర్పు యూరపు దేశాలకుగాని, రేపు చైనాకుగాని ఉండదు. ఆర్థికంగా ఇతర దేశాల మీద ఆధిపత్యం సంపాదించవలసిన అవసరం చేతనే అమెరికా కొన్ని రాజకీయ విధానాలను అంతర్జాతీయంగా అమలు చెయ్యవలసి వస్తున్నది.)

పైన చెప్పిన రెండు విషయాలను స్పష్టంగా అవగాహన చేసుకోలేనివాళ్లు మాత్రమే రష్యా ద్వారా ప్రపంచయుద్ధం రావచ్చునని భ్రమ పడతారు. వాటిని అవగాహన చేసుకున్నవాళ్లు ఇటీవల ఐక్యరాజ్యసమితిలో విషిన్స్కీ శాంతి కోసం ఎందుకు లబలబలాడుతాడో, ఇంకా పూర్వం స్టాలిను కమ్యూనిజమూ పెట్టుబడిదారీ సంఘర్షణ రావలసిన అవసరంలేదని ఎందు కన్నాడో సులభంగా గ్రహిస్తారు.

ప్రపంచయుద్ధం రానేరాదు. వచ్చిందంటే అది అమెరికా బ్రిటనుల చలవవల్ల రావాలేగాని రష్యా పుణ్యాన ఎన్నటికీ రాదు.

---

ఒక బుడతడు చుట్ట నోట్లో పెట్టుకుని వీధివార కనిపించాడు. దారిని పోయే ముసలమ్మ అదిచూసి నిర్ఘాంతపోయి, "బళ్లోకి పోలేదేం, మనవడా?" అని అడిగింది. "నేనా బళ్లోకి! చాల్లే, పరాశకం-నాకింకా మూడేళ్లేగా!"

# చెప్పుకోవలసిన మాట

సిద్ధాంతి మల్లికార్జునం

చిరకాలం నుండి కలలు గంటూన్న జమీందారీ సంస్కరణ నేటికి సఫలీకృతం కావడం అభినందనీయమే. బహుశా దీని వెంటనే చిన్న చిన్న భూస్వాముల సంస్కరణ కూడా తయారు కావచ్చు. ఇతర విషయా లెట్లా వున్నప్పటికీ సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీల వ్యాపనాన్ని అవరోధించటానికి, సమీపభవిష్యత్తులో రాబోయే ఎన్నికలకు ఉపయోగకారిగా వుండటానికి కాంగ్రెస్ ప్రభుత్వం ఈ సంస్కరణ యింత హడావిడిగా, ఆర్థిక లోపసమయంలో, కేంద్ర ప్రభుత్వ సలహాలకు విరుద్ధంగా, ముందు వెనుక లాలోచించకుండా, జమీందారుల కివ్వవలసిన నష్టపరిహారాన్ని నిర్ణయించి ఇవ్వకుండా, చేశామంటే చేశామనే తొందరలో చేసిందనడంలో సందేహం లేదు. ఏ విధంగానైనా సరే ప్రజాభిప్రాయమంతా కొద్దిగానో గొప్పగానో, త్రికరణ శుద్ధిగానో లేకనో ఈ సంస్కరణ కనుకూలంగానే వుంది.

ఎంత మంచి సంస్కరణైనప్పటికీ కొత్తలో కొంతమందికి బాధాకరంగానే వుంటుంది. జమీందార్ల వటుంచి, నేడు జమీనులన్నీ పోతున్నాయని ఖేదపడేవారు చాలా తక్కువ; అట్లా ఖేదపడేవారైనా జమీందార్ల అదరాభిమానపాత్రులే. మరి ఈ బాధను లోనుగావలసిందే.

ఈ సమయంలో జమీందారుల వైఖరి చాలా విచిత్రంగా వుంది. నీటిలో మునిగి అనుక్కు వేగంగా పోయేవాడు ప్రాణరక్షణ కొరకు గడ్డిపోచను సైతం గట్టిగా పట్టుకున్నట్లుంది జమీందార్ల స్థితి. వీరు ప్రభుత్వచర్య న్యాయబద్ధం కాదని నిరూపించడానికి న్యాయ చట్టాలలో క్షాణాల కొఱకు అహోరాత్రాలు వెదకి వేసారుతున్నారు. వెంకటగిరి రాజా లాంటివారు న్యాయస్థానాలకు ప్రాకుతున్నారు. కాని ఇదంతా వృథా వ్యయ ప్రయాసయేమో! ఒకవేళ బ్రిటిషు ప్రభుత్వం తయారు చేసిన చట్టాలలో జమీందారులకు లాభదాయకమైన చట్టా లున్నప్పటికీ జమీందారీ బిల్లులోనే పైకన్సి రద్దు అయినవని, ఈ రోజుల్లో ప్రజాభిప్రాయానికే ప్రాధాన్యం కాబట్టి అదే సుదిన్యాయమని సమర్థించే ప్రభుత్వం ముందు వీరి ప్రయత్నాలన్నీ బూడిదలో హోమంలాగు నిష్ప్రయోజన మౌతాయి. ఇటీవల శిహాన్రిగారి ప్రయోగం దీనికి మరింత సహాయకారి. ఎంతెంత కృషిచేసినా తిరిగి తమతమ జమీందారీలు రావు, భోగాలు రావు.

ఇక మొదటయినా ఈ జమీందార్లు తమ పూర్వ సాంప్రదాయాలు, హక్కులు, ధర్మాలు, విస్మరించితే శ్రేయస్కరం. పూర్వపు రోజుల్లో బ్రిటిషు ప్రభుత్వమూ, అంతకుముందు ప్రజలూ ఈ జమీందారుల నుద్ధరించారు. స్వార్థానికి బ్రిటిషు ప్రభుత్వం వీరిని చాలా మధ్యపెట్టింది. ఇక ప్రజలు, ప్రభుభక్తి అనే సద్భావంతో ఈ జమీందారుల అవినీతి చర్యలను సహిస్తూ మంచి జమీందారుకొరకు, మంచి పరిపాలనకొరకు ఎదురు చూస్తూండేవారు. వెనకటి సంగతి ఏమయినప్పటికీ బ్రిటిషు ప్రభుత్వాదరణ క్రింద జమీందారులందరూ అక్రమావినీతులకు లోనైనారు.

ఇప్పుడా కాలం పోయింది. నూతన భావాలు ప్రపంచాన్ని ఆవరించాయి. ప్రపంచంతోటీ, నూతన భావాలతోటీ జమీందారులు కూడా ముందుకు సాగిపోవాలి. ఇన్నాళ్లూ రైతులనోళ్లు కొట్టి డబ్బు దోచుకొని గుర్రపు పందాలకు, విదేశయాత్రలకు, పాశ్చాత్య సుందరులతో వివాహ విహారాలకు, నీలగిరి నివాసాలకు ఇంకా ఇలాంటి వెన్నిటికో డబ్బు తగలేశారు–పాశ్చాత్య నాగరికతా వ్యామోహంతో. ఇంక తృప్తిపడాలి. ప్రాపంచిక సుఖాలు తెన్నుగా అనుభవించారు. కాలం ఎప్పటికీ తమదే ననుకోడం చాలా పొరపాటు. ప్రపంచ చరిత్రలో మహామహా సామ్రాజ్యాలే కూలి పేలవాలై

పోయినప్పుడు ఈ చిన్నచిన్న జమీందారీలు చితికిపోవడ మొక వింత కాదు. ఒక లెక్కలోనిది కాదు. ఇకనైనా సంఘక్షేమానికొరకు జమీందారులు తమ స్వార్థాన్ని త్యాగం చెయ్యాలి. అప్పటికి ఆత్మోద్ధరణకు వారికవకాశా లున్నా యీనాడు తమ స్వంత ఆస్తిపాస్తులసహాయంతో పరిశ్రమలు స్థాపించి, బిర్లా డాల్మియాలు కావచ్చు. ఆనాడిక ఇండియా గవర్నమెంటు తమ చేతిలో ఉసిరికకాయే!

కాని జమీందార్లు దేశాని కేమైనా యథోచిత సేవ చేశారా అనే విషయం చర్చించవలసివున్నది. మొట్టమొదటినుంచీ, ఈ జమీందారులు శక్తివంచన లేకుండా లలిత కళల కొరకు పాటుపడి వాటిని ఉద్ధరించారనడంలో ఆవంతైనా అనుమానం లేదు. వీరు ముఖ్యంగా కవులను, పండితులను, శాస్త్రజ్ఞులను, సంగీత విద్వాంసులను, నాట్యాచార్యులను, నాట్యకర్తలను, నటులను, నాటక కళను, శిల్పులను, చిత్రకారులను చాలా పోషించారు. ఇదివరలో ప్రతి ఆస్థానమందూ పైన చెప్పిన కళారాధకు లుంటూండేవారు. వారుండటం ఆస్థానానికే గౌరవం. సాధారణంగా ఈ ఆస్థానాల్లో వుండే కవిపండిత గాయకాదిజనులమధ్య పోటీలు జరుగుతూండటం, పోటీల్లో గెల్చినవారికి బిరుదులు, గ్రామాలు, ధన కనక వస్తు వాహనాదులు ఇవ్వడం జరుగుతూండేది. ఈ పోటీల్లో గెల్చిన వారికంటే వారిని పోషించే రాజుకే— జమీందారు లందరికీ రాజాలనే బిరుదు సహజంగా వుంది- చాలా గౌరవం. పైపెచ్చు రాజులే ఆకాలంలో గొప్ప కవులుగానో, విద్వాంసులుగానో, రసికులుగానో వుండేవారు. ఆ కళలన్నిటినీ వారు ఉద్ధరించబట్టే ఈనాటికీ అవి సజీవంగా ఉన్నాయి. అట్టి పోషణే లేకుంటే మన పవిత్ర గ్రంథాలైన రామాయణ భారత భాగవతములు, ప్రబంధములు, నాటకాలంకార శాస్త్రములు, అన్నీ పుట్టిన చోటనే గిట్టి వుండేవి. అవన్నీ రాజ పోషితాలే. అయితే నేటి జమీందారులలో కవులు, పండితులు ఎక్కువగా లేకపోయినప్పటికీ, తమ పూర్వ సంప్రదాయానుసారంగా వీరు సారస్వతాన్ని, లలిత కళలను పోషిస్తూ వచ్చారు. గద్వాల్ సంస్థానంలో పండితులకు, కవులకు, తదితర కళారాధకులకు సర్వదా సత్కారాలు జరుగుతూంటాయి. జయపూరు మహారాజాగారైన విక్రమ దేవవర్మగారి కవితా శక్తి, సారస్వతాభిరుచి, సారస్వత పోషణ లోకవిదితమే. పిఠాపురం రాజాగారు అధిక ధనవ్యయంతో సూర్యరాయాంధ్రనిఘంటు రచన సాగించడంకూడా తెలిసిన విషయమే. ఇంకా కొందరు ఆయుర్వేద శాస్త్ర పరిశోధనోద్ధరణ కొరకు పాటుబడుతున్నారని వినికిడి. ఈ విషయంలో ప్రజాప్రభుత్వానికి శ్రద్ధ ఎంతమాత్రమున్నదీ మనకు తెలుసు. ఈ ప్రకారం జమీందారులు తమ తమ శక్త్యానుసారం లలిత కళలను పోషించారు.

మరొక విషయమేమిటంటే, ఈ జమీందారుల పోషణవల్లనే చాలావరకు దేవాలయ నిర్మాణం జరిగింది. దేవాలయ నిర్మాణ విషయంలో శిల్పుల నెంతగా పోషించారో, ఆ శిల్పం ఎంత లోకవిఖ్యాతి గాంచినదో నిరూపించేవి ఆ అద్భుత గోపురాలే. సాధారణంగా ప్రతి జమీందారూ తన వూరిలో గాని, ఎస్టేటులో గాని, మరెక్కడైనా సరే కొత్తగా దేవాలయాలను నిర్మించడం గానీ, పోషించడం గానీ తప్పక జరుగుతూంటుంది. వారి కృషివల్లనే ఈ శిల్పాలన్నీ సజీవంగా ఉన్నాయి. ఇకమీదట ఈ దేవాలయ నిర్మాణాలు సాగవనే నమ్మకం. రాజపోషణ నశించిన తర్వాత ఇవన్నీ శిథిలమౌతాయి. ఈనాడు పత్రికల్లో క్రొత్త దేవాలయాలు నిర్మిస్తున్నారనే వార్త చాలా అరుదు. అది లేదు సరికదా, దేవాలయాలలో దొంగలు దూరి విగ్రహాల మీదుండే ఆభరణాలను, వస్త్రాలను దోచుకొని పోయిన వార్తలు మాత్రం చూస్తున్నాం. ఈపరిస్థితులలో సోమనాథ దేవాలయ పునర్నిర్మాణం జరగబోతున్నదనే వార్త ముదావహమైంది.

జమీందారులు దేవాలయాలను పోషిస్తే మన ప్రజాప్రభుత్వం వాటిని తాను వశపరచుకొని ఉద్యోగస్థులను తనిఖీ చెయ్యమని నియమించింది. ధర్మకర్తలంటూ, కమీషనర్లంటూ దేవాలయాల డబ్బు తినే మహానీయులు ఏర్పడ్డారు. ఇక శిల్పం ఏమిటో, తత్పోషణ ఏమిటో అర్థం కావటం లేదు.

# యమ - యమి

సంజీవి యస్. ఈశ్వరన్

ఆది అన్నిటికీ మొదలు- అవును, కాదు అనేది లేదు- అంతా అంతులేని చీకటి - రాత్రి, పగలు అనే మార్పులేని చీకటి-చచ్చిపోవడ మనేది లేదు- ఎప్పుడూ బ్రతకడం అనేది లేదు- అది అన్నిటికీ ప్రారంభం-బ్రహ్మ పదార్థాలని సృష్టించాడు-దేవుళ్లనీ, ఋషుల్నీ పుట్టించాడు - తర్వాత, అగ్నిని భూమిమీదకి, వాయువును ఆకాశంలోకి, సూర్యుడిని తారాపథంలోకి నిర్ణయించాడు-

సూర్యుడు రూపవతియగు 'సంజ్ఞ'ను భార్యగా స్వీకరిస్తాడు. ఆమె లోకాల కన్నిటికీ శిల్పి అయిన 'విశ్వకర్మ' పుత్రిక. ఆయన కళలకు అధిపతి. దేవుళ్లు అలంకరించుకొనే ఆభరణాలని కళ్లు చెదిరిపోయేలా చేసిన చతురుడు. వాళ్లు ఎక్కే రథాలని నైపుణ్యంతో చెక్కిన కళానిధి.

సూర్యునియొక్క సంబంధంచేత సంజ్ఞకు ఇద్దరు పిల్లలు కల్గుతారు. యమ-కొడుకు. యమి-కూతురు. ఇద్దరూ ఒక్కసారే పుట్టారు. వాళ్లిద్దరూ రెండు కళ్లలా దగ్గరగా కలిసి మెలిసి బాల్యాన్ని గడుపుతున్నారు... వాళ్లిద్దరూ వున్న లోకం తప్ప ఇంకోదాన్ని ఊహించలేదు... సూర్యుని కిరణ శోభలో, ధగధగలు మెరిపించే కాళింది పర్వతపు లోగిలిలో చిన్నతనాన్ని వెళ్లబుచ్చుతున్నారు-

సుందరమైన దుస్తుల్లో యమి జ్వాలలా వెలిగిపోతోంది ఒకనాడు... తొలి ప్రభాతంలా కొత్తదనాల్ని వొలకబోస్తోంది... విశ్వకర్మ మనుమరాలు, సూర్యుని ముద్దు పట్టి కళలతో తూగుతోంది. యమ పగడంరంగు బట్టలు వేసుకొని కపటాకుఛాయ శరీరాన్ని ముగ్ధపరుస్తున్నాడు.

పచ్చటి గడ్డిలో ఆడుతూ పాడుతూ గంతుతూ కిలకిల నవ్వుతూ యమి ఉత్సాహంతో తీగెల్లాంటి రెండు చేతుల్నీ యమ కంఠానికి పెనవేస్తుంది. ఉన్నట్టుండి చేతులు చాచి ముందుకు లాక్కొని తన పెదిమల్తో బుగ్గల్ని ముద్దు పెట్టుకొంటుంది... మళ్లీ మృదువుగా ముందుకు తోసేసి వెన్నెల్లా నవ్వుతుంది... యమ ఆశ్చర్యంతో అర్థంకాని చూపుల్తో చూస్తాడు. సిగ్గుతో యమిని కోపసూచకంగా వదల్చుకొంటాడు... ఇంతలోనే గుండె బరువెక్కేలా చిన్న బుచ్చుకొంటుంది... మళ్ళీ ఇద్దరూ ఒక్కసారే పకపక నవ్వులతో చేతుల్లో చేతులు వేసుకొని హాయిగా గాలిలో తేలిపోతున్నట్టు గెంతులేస్తారు. ఇట్లా ఆడుతూ పాడుతూ వాళ్లిద్దరూ పెద్దవాళ్ళయారు... సంవత్సరాలు ఒకదాని కొకటి కూడుకొంటున్నాయి. కొత్తగా ఉద్రేకం ముంచుకొస్తోంది-ఎర్రని నాలుకలాంటి ప్రమాదమైన వుద్రేకం-తల్లిదండ్రు లిది గమనిస్తున్నారేమో-ఏమో!

యమ నూనూగు మీసాలతో పురుష సింహాలయాడు వొక్కసారి—

యమి ప్రతిఅవయవం పొంపుల్లో పాల పొంగులా వుబికి వస్తోంది వయస్సు—

కాలం ఘంగున గంట కొట్టింది—

రక్తం మాట్లాడిస్తోంది—

పిచ్చి వుద్రేకం మింగేస్తా నంటోంది!

* * *

యమి: నేస్తమా...

యమ: ఊఁ...

యమి: పెద్ద సముద్రాన్ని ఈదుకొంటూ నీ దగ్గర కొచ్చాను... స్నేహంగా వుందాము

రావా? నీ దగ్గరసంబంధంతో నేను ఫలించి పోదునని కనాలి...నిన్ను నాన్నా అని పిలుస్తాడు...వాడు నీ పోలికలతో నీ అంతవాడవాలి-మనవాడు!

యమ: ఏమిటీ? ఇట్లా మాట్లాడుతావేం?

యమి: అసలే నేనే చెప్పాలా?

యమ: చెప్పు.

యమి: వాంఛ!

యమ: ఇట్లాంటి వాంఛతో వున్న నీ స్నేహం నాకు వద్దు...నువ్వూ నేనూ ఒక్కసారే పుట్టినా భేదం తప్పలేదు. దేవతలు కోపగిస్తారు—చూసుకో.

యమి: దేవతలు! వాళ్లకి వాంఛ వుందిగా-మనకి అది వుంటే తప్పా? బ్రహ్మ-కూతురు 'వచ' (సరస్వతి) తో ఏమి చేశాడో నీకు తెలియదా?రా...నాతో హాయిగా వుండి సుఖపడు. చూడు, నా శరీరం నిన్ను పిలుస్తోంది.

యమ: దేవతలు చేసిందే మనం చేయాలా?

యమి: నువ్వు మర్చిపోయావా?

యమ: ఊఁ-

యమి: మనిద్దర్నీ గర్భంలోనే దగ్గరగా వుంచాడు...నువ్వూ నేనూ అమ్మ రక్తంలో ఒకళ్ళ కొకళ్ళం అంటుకొని ప్రవహించి—చివరకు రెండుగా చీలిపోయాం...మన కలయిక ప్రకృతే నిర్ణయించింది...మళ్ళీ మనం కలిసికొని ఈ విధంగా ఒకటవాలి...రా-

యమ: వొద్దు-నువ్వు తప్పుగా అర్థం చేసుకొన్నావు. మనల్ని రెండుగా చీల్చివేసిన ప్రకృతి ధర్మానికి అర్థం—మనల్ని వేరుగా వుండమనే. ఇట్లా మాట్లాడటం భావ్యమేనా?

యమి: ఏమిటీ—నామీద కోపమా! నీలోని వెచ్చదనం నా రక్తంలో పుట్టినప్పటి నుంచీ ప్రవహిస్తోంది—అది ఆపగలవా ఇప్పుడు? అది ఇప్పుడు నిప్పులా దహించి వేస్తోంది...నీ శరీరంతో ఏకమవుతేగాని అది చల్లారదు. నన్ను దగ్గరగా- మరీ దగ్గరగా రానిచ్చుకో- భార్య భర్తకు శరీరాన్ని పూర్తిగా స్వాధీనం చేసినట్టుగా నీకు నా దాన్ని వొప్పచెప్పనియ్యి... ఒక్క రథాన్ని అంటిపెట్టుకొన్న రెండు చక్రాల్లా నడిచి పోదాం...రా-

యమ: సిగ్గు తెచ్చుకో... నువ్వు నన్ను పాడుచేస్తున్నావు. పో - దూరంగా వెళ్లు... నిప్పులాంటి దేవుళ్ళ కళ్లు నా దేహాన్ని చురకలేస్తున్నవి...ఊఁ... పో - ఇంకో పురుషుడిని సంపాదించుకో.

యమి: అబ్బా- నువ్వూ ఇంత బాధ పెట్టగలవా? చూడు-నీ యమిని. నువ్వూ దేవుడివే కానీ ఇంత క్రూరుడివి...నిన్ను అందరూ అసహ్యించుకొంటారు ... సూర్యుడు ఆరోగ్య చిహ్నమైన కిరణాలతో నిన్ను ఎప్పుడూ తాకడు, ఇంక- ఎంత త్వరగా మర్చిపోయావు! కాళింది అడుగుల్లో మనం పూలు తెచ్చుకోడం-ఆడుకోటం- గెంతులేయడం...అబ్బ- ఒక్క దేహంలా వున్నాం కదూ!

నువ్వు కాలు నొప్పితో ఏడుస్తూంటే నీకు నేను ఎన్ని పాటలు పాడి మరిపించానూ-అన్నీ మర్చిపోయావా!

[సూర్యుని గాఢమైన తాపాన్ని ఓపలేక 'సంజ్ఞ' అడవులకు వెళ్లి పోతుంది. చెలికత్తె 'ఛాయను' పరిచర్యలు చేస్తుందనుని అప్పజెప్తుంది. సూర్యుని కలయికచే ఛాయకు ముగ్గురు పుట్టారు-శని (గ్రహం), మను సవర్ణి, తపతీ (నది). సవతి తల్లి,ఆమె పిల్లలయందు చూపుతున్న మమకారాన్ని చూడలేక యమ కాలుతో తన్ని పోతాడు. ఛాయ ఆగ్రహంతో 'ఆ కాలు కుళ్లి పోవాలని' శపిస్తుంది. దానికి ఫలితంగా యమ కాలు కుళ్లి పురుగుల్తో బాధపడుతుంటే సూర్యుడు దయదల్చి ఒక కోడిని పంపి వాటిని తినిపించి వేస్తాడు. కొంత బాగుపడుతుంది. కాని కాలు సరిపడక పోవుటచేత యమ శిథిలపాదుడయాడు.]

యమ: .........

యమి: నేను ఏడుస్తూంటే చూస్తూ వుంటావా?

యమ: ఏడ్వకు-నే నేమి చేశానూ?

యమి: ఇంతకన్నా ఏమి వుందీ? వాంఛతో గాలిలో ఆకులా కొట్టుకొని పోతుంటే చూస్తూ వూరుకొన్నావుగా!

యమ: వొద్దు-వొద్దు. అటువంటి సంభావణ చేయకు. వాంఛ విచక్షణను కనిపించ నివ్వదు. జ్ఞానాన్ని చీకటిచేసేస్తుంది-నేను క్రూరుడిని కానుచూడు.నీకే 'తప్పు' అని తెలుస్తుంది. కాను, నీకు ఇంకో లోకం తెలియదు. నీలో లేగిన

వాంఛకు నా పురుష చిహ్నాలే కారణం— కానీ నీకు నేను సోదరుడిని. ధర్మంగా నువ్వు నాకు పవిత్రమైన దానివి. నా మాట నమ్ము. ఇంకో పురుషుడిని గ్రహించి నీ యౌవనాన్ని వెన్నెల చేసుకో.

యమి: ఆహా! నువ్వా-సోదరుడివి! నీ ప్రియతమ స్నేహాన్ని తిరస్కరించి బూడిద పాలు చేశావు. వొద్దు. నా వాంఛ సంకెళ్లలో చితికి పోకుండా నన్ను పూర్తిగా గ్రహించు-నీలో జాలి లేదా! యమి కాళ్లమీద వంగినది-కాదు!

యమ: నేను నిన్ను మలినం చేయను.

యమి: ఆలోచించు - తొందరపడుతున్నావు. మన రెండూ గుండెలూ ఒక్క కదలికతో పెరిగినవి-బాల్యంలో కన్నంగా సూర్యుని కిరణ శోభలో వెలిగిపోతూ గడ్డిమీద ఇద్దరమూ ఎంత దగ్గరగా పడుకొని నవ్వలేదూ? ఇప్పుడు నన్ను వుండనివ్వవెందుకూ? అప్పుడు లేని తప్పు ఇప్పుడెట్లా వచ్చిందీ?

యమ: అబ్బ! వద్దు-మాట్లాడకు- నేను నిన్ను ఓడించాను. నువ్వు నాకు చెల్లెలివి. నీకు నేను తగను. నే స్వచ్ఛంగా వున్నాను. పో-నన్ను తాకకు.

యమి: అయ్యో! యమా-నీకు భయమన్న మాట! పాపం. నీ కళ్లలో వెలుగు నా కళ్లలో మెరుస్తోంది. ఎందుకో చెప్పలేవా? నీ చేతులు రెండూ ఆగిపోయిన పూతీగల్లా చలిస్తున్నాయెందుకూ? నువ్వూ నన్ను ప్రేమిస్తున్నావు-నీకు ధైర్యం లేదు!

యమ: కాక... పోనీ తీగలాంటి చేతుల్ని ఇంకో పురుషుడి మెడకు చుట్టేసుకో. ఇంక నిన్ను చూడలేను. వెళ్ళిపో యమీ—

యమి: నీలో జాలికూడా లేదా!

యమ: మీ ఇద్దరి కలయికనూ దేవుళ్ళు ఆశీర్వదిస్తారు. పో-సుఖపడు. వెళ్ళిపో-త్వరగా!

యమి: అబ్బ! దుఃఖంతో - యమి-గుండెలు బరువెక్కి-మనస్సు చీకటై పోయి-కన్నీళ్ళ ప్రవాహమవుతోంది-యమా-ఇంక నీ గుండెలు చితికిపోనియ్యి-పిచ్చిపిచ్చి నీ కళ్ల చిల్లులు పడిపోనియ్యి-యమ నీ ప్రేమను కాళ్ళక్రింద పడేసి తొక్కేశాడు-అది నలిగిపోయింది - యమీ-నువ్వింక చచ్చిపో-యమీ-నువ్వింక నవ్వలేవు-నవ్వలేవు-

యమి ఇంకా చలించకుండా కాళ్ళమీద వంగి ప్రార్థిస్తూనే వుంది...యమి మూగబాధకు పాటలొచ్చి అందర్నీ మేలుకొల్పుతూ, బాధ పెడ్తూ గాలిలో సుడి తిరుగుతూ చివరకు ఎక్కడో దారి తప్పిపోయింది..

రెండు కన్నీటిబొట్లు యమి కనురెప్పల్లో మిల మిల లాడి బుగ్గలమీదనుంచి మెల్లిగా క్రిందికి జారిపోయి టపటప లాడినవి. కళ్లు రెండూ అడ్డంగా మూసిపోతూ - వాటిలో నీటిబొట్లు ఒకదానికొకటే జారుతూ, వెళ్ళిపోతున్నవి. దృష్టి చెదిరిపోతోంది...యమి కళ్ళముందు చెట్టూ గుట్టలూ గడ్డీ - అన్నీ కదిలిపోతున్నవి- ఎక్కడికో-ఇంకా యమి వేడుకొంటోంది— ఇద్దరూ చిన్నతనంలో గిరగిరా చుట్టూ తిరుగుతూ ఆడుకొన్న ఉదుంబరం చెట్టు కూడా ఆకారం లేకుండా యమి కళ్ళముందు మాసి పోతోంది...ఆ చెట్టును ఒక్క ఔదుంబరా అని ముద్దుగా పిల్చుకొనేది-

కానీ యమి చెవులకు- యమ ఎక్కడో వెళ్ళి పోతున్న నల్లని దున్నపోతు కాళ్ళ చప్పుడు వినిపించింది. ఆ రెండుకుక్కల అరుపు దూరంగా వినిపిస్తోంది. యమి మెల్లిగా చలనం తప్పిపోతూ- శరీరాన్ని కూడా వదిలేస్తోంది. యమ వెళ్ళిపోయిన శూన్యంలోనే యమి అందమంతా జీవంతో లేచి వెళ్ళిపోయింది. యమి శరీరంలోని రక్తం, అన్నీ నీరై పోయినవి. ఆపలేని దుఃఖంతో- చివరకు ఆగకుండా చిన్న ప్రవాహంలా కరిగింది గుండెలో నుంచి మొదలుపెట్టి అడుగడుక్కీ పెరుగుతూ విచారంతో- పచ్చిక బయళ్లలోకి చేతులుచాచుకొంటోంది నిరాశతో.

సూర్యుడు కిరణాల్ని తగ్గించాడు. చిన్న నీ రెండలాంటి వెలుగు ప్రవాహాన్ని ముద్దు పెట్టుకొంటోంది. "[illegible]" అంటూ సన్నని కంఠంలో పిచ్చి ప్రియంగా పలవరిస్తోంది- దుఃఖ భారంలో నీరైపోయిన యమి అంతర్గత ప్రాణమయిన 'యమున'—

యమునా నది చీకటిగా, బరువెక్కిన హృదయంలో కదిలి పోతోంది మెల్లిగా. లోపల వెక్కి-వెక్కి ఏడుస్తోందా అన్నట్లుగా- ఆ స్వచ్ఛమైన ప్రేమ ప్రవాహంలో అప్పుడప్పుడు కలవరం కల్గుతోంది-

(ఇంగ్లీషునుండి అనువాదం: కొత్తపల్లి లలిత)

# జనవాక్యం

**సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురిత మవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.**

---

### ఉత్తరవిశాఖలో వెనుకబడ్డ జాతులు

మద్రాసు ప్రభుత్వము వెనుకబడ్డ జాతుల జాబితాను పునఃపరిశీలన చేస్తున్నట్టు తెలియుచున్నది. ఇంతకు పూర్వము చేసిన యిట్టి పరిశీలనలో ప్రభుత్వము మా ఉత్తరవిశాఖలో ఎక్కువ జనాభాగల వెలమ, కాపు, రెడ్డి కులాలను వెనుకబడ్డ జాతుల జాబితా నుండి తొలగించి చాల అన్యాయము జేసినది. ఉత్తర విశాఖ జిల్లా కరవు కాటకాలకు పుట్టినిల్లు అనేది లోక విదితము. దీనికితోడు గోరుచుట్టుపై రోకటిపోటు చందమున మా జిల్లాలో నున్న జమీందారీ, ఈనాందారీ ప్రాంతాలు ఆంధ్రరాష్ట్రములో ఎక్కడా లేవనే చెప్పాలి. ఈ జమీందారీ, ఈనాందారీ పాలనలో నున్న రైతాంగపు కులాల ఆర్థిక, సాంఘిక దురవస్థలు వేరే వర్ణించ నవసరము లేదు. ఉత్తరవిశాఖ జిల్లాలో గల వెలమ, కాపు, రెడ్డి కులాలలో చదువుకున్న వారెందరున్నారో గమనిస్తే ప్రభుత్వము ఎంత అన్యాయము చేసినదో విదితము కాగలదు. ఈ కులాలలో హైస్కూళ్ల విద్య పొందిన వారిని పదులలో లెక్కపెట్ట వచ్చును. ఇక గ్రాడ్యుయేట్సును వ్రేళ్ళమీద లెక్కపెట్ట వచ్చును. ఈ కులాలలో నూటికి ఒక్కరైనా చదువుకున్న వారున్నారా యని సందేహము కలుగుచున్నది. ఈ జిల్లాలలో ఆరు హైస్కూళ్లున్నవి. గ్రామాలలో నున్నవారు ఎన్నో మైళ్ళ దూరములో నున్న పట్టణాలకు వెళ్ళి విద్య నభ్యసించుకోవలెనంటే ఎంత కష్టమో ఆలోచించవచ్చును. దీనికి తోడు ఈ రైతాంగ కులాలు సగము జీతాలు కూడ కట్టుకోలేని పరిస్థితులలో వారు విద్య నభ్యసించటము దుస్తరము. అందుచేత ప్రభుత్వము వారు ఈ జిల్లాలోగల వెలమ, కాపు, రెడ్డి కులాలను వెనుకబడ్డ జాతుల జాబితాలో ఈ దఫా చేర్చి ఈ కులాలకు గతములో చేసిన అన్యాయము తొలగించుట న్యాయము.

నరసన్నపేట జి. యల్. నాయుడు

---

### ఉత్కళాంధ్రుల విద్యాసౌకర్యాలు

ఆగష్టు నెలలో సమావేశమైన అఖిలభారత విద్యామంత్రుల సభవారి తీర్మానానుసారము గంజాం కోరాపుట్టి జిల్లాలలో తెలుగు పిల్లలకు మెట్రిక్యులేషన్ వరకు స్కూళ్ళలో తెలుగున విద్యాబోధన జరుగుచున్నది. ఈ కారణమున పై రెండు జిల్లాలలోగల హైస్కూళ్ళలోను, మిడిల్ స్కూళ్లలోను, ప్రైమరి స్కూళ్ళలోను గల మొత్తం విద్యార్థుల సంఖ్య, తెలుగు పిల్లల సంఖ్య వేరువేరుగా తీయుచున్నాము. ఉత్కళాంధ్రులెల్లరు ఉపేక్ష వహించక తమతమ తాలూకాలయందు గల హైస్కూలు, మిడిల్ స్కూలు, ప్రైమరీస్కూళ్ళలోని పై లెక్కలు తప్పక దయచేసి వెంటనే నాకు తెలుపవలసినదని వేడుచున్నాను. ఈ యంశాలు ఒరిస్సా ప్రభుత్వమునకు తెలుపవలసి యున్నది.

గుణుపురం ప్రహారాజు సన్యాసిరాజు

భాషారాష్ట్ర సమితి - ఆంధ్రశాఖ